శ్రీ రస్తు

# ఆంధ్ర నామ సంగ్రహము

# ఆంధ్ర నామ శేషము

ప్రతిపదటీకానుక్రమణికాసహితము

చెన్నపురి :

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

# పీ ఠి క.

ఆంధ్రభాష తత్సమ, తద్భవ, దేశ్య, గ్రామ్యములని నాలుగు తెగలుగలదిగ నున్నది. అందు మొదటి దగుతత్సమభాషా పదముల యర్థపరిజ్ఞానమునకై యమరసింహకవివర్యునిచే రచింపఁబడిననామలింగానుశాసనము మున్నగునిఘంటువు లపరిమితములుగా నున్నవి. కడపటి దగుగ్రామ్యభాష ప్రయోగార్హముగామిచే దానికి నిఘంటువు లక్కఱలేక వాడుకలో నిలిచినది. ఇఁక దేశ్యతద్భవాత్మకమగు నాంధ్రభాషకే ప్రత్యేకనిఘంటువు కావలసివచ్చినందున నట్టినిఘంటువుల నాంధ్రకవులు కొన్నింటిని వ్రాసిరి. వానిలోఁ బ్రసిద్ధికెక్కినవి ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, తరువాతిది సాంబనిఘంటువు-వీనిలో మొదటి రెండుగ్రంథములను పెక్కండ్రిదివఱకు ననేకపర్యాయములు టీకలతోఁ జేర్చి ముద్రించిరి.

ఈకూర్పుయొక్క గొప్పమార్పు.

అయినను, నిఘంటువులకుఁ టీక వ్రాయుటయందు రెండు విషయములు ముఖ్యముగా గమనింపవలెను. ఒక్కటి, రూఢిపదములకుఁ దప్పఁ దక్కినవాని కవయవార్థముఁ దెలుపవలయును. రెండవది, ఆరూపములనిష్పత్తి చూపవలయును. ఈపద్ధతి ననుసరించియే అమరమునకు సుధ యను నొకవ్యాఖ్యానమును మహాపండితుఁ డగుభానుజీదీక్షితుఁడు రచించెను. అట్లే యీతెనుఁగు నిఘంటువులకును వ్రాసినబాగుండునని తలంచి తద్భవములకెల్ల నవి యేసంస్కృతపదములనుండి వచ్చినవో

ఆపదములును కఠినస్థలంబులందు వ్యాకరణాంశములును సమూత్రోదాహరణంబుగాను వ్రాయఁబడినవి. గొప్పయభివృద్ధి యేమన, ఈనిఘంటువులు పద్యరూపముగా నున్నందున గణితపు అకారాద్యనుక్రమణిక క్రమవ్యయముల గూర్చి వ్రాయించి దీనితోఁ జేర్పఁబడినది. దానియుపయోగమును గూర్చి చదువరులె తెలిసికొనఁగలరు. కాఁబట్టి యీగ్రంథము నాదరించి, దీనియం దలిలోపములను దెల్పి, యివి యింకను వన్నెకు వచ్చునట్లు చేయు టకును, ఇట్టి గ్రంథము లన్నియుఁ ద్వరలో నచ్చుపడుటకును భాషాభిమానులు ప్రోత్సాహము గలిగింతురు గాక యని కోరు చున్నాము.

## ఆంధ్రనామసంగ్రహము.

ఆంధ్రనామసంగ్రహము పైడిపాటి లక్ష్మణకవిచే రచింపఁ బడినది. ఈపైడిపాటి లక్ష్మణకవి కౌండిన్యగోత్రుఁడు. ఏకామ్ర మంత్రిపుత్త్రుఁడు. ఈకవి తనగ్రంథాది నిష్టదేవతాప్రార్థనమునం దు "శ్రీపతివంద్యుఁడా" అని విశేషణము చేర్చియుండుటచే నితఁ డు మహేశ్వరభక్తుఁడని తెలియుచున్నది. కావుననే తనగ్రంథ మును కాశీవిశ్వనాథుని కంకితముచేసెను. ఈకవియొక్క కాలం బు నిర్ణయింప నొక్కయాధారం బైనను లేదు. అయినను, ఆం ధ్రనామశేషము రచించిన అడిదము సూరయకవీంద్రుఁడు పీఠికయందు "ఆంధ్రనామసంగ్రహమునందుఁ జెప్పని, కొన్ని తె నుఁగుమాటలుఁగు లన్ని కూర్చి, యాంధ్రనామశేష మనుపేరఁ జెప్పెద" నని చెప్పియుండుటచే, సూరనకవికి ముందటివాఁడయి యుండవలెను. అట్లయినచో నితఁడు పదునేడవశతాబ్దాంత మున నున్నవాఁ డని తోఁచుచున్నది.

## ఆంధ్రనామశేషము.

ఆంధ్రనామశేషము అడిదము సూరకవి రచించెను. ఈ సూరకవితండ్రి బాలభాస్కరుఁడు, నియోగిబ్రాహ్మణుఁడు. ఈ మహాకవి - కవిజనరంజనము, రామలింగేశ్వరశతకము, కవిసంశయవిచ్ఛేదము, ఆంధ్రచంద్రాలోకము, ఆంధ్రనామశేషము అనునైదుగ్రంథములను రచించెను. ఈమహాకవి క్రీ.వె.1750సంవత్సరము మొదలు 1780 సంవత్సరమువఱకు నున్నట్లు కవిజీవితమువలనఁ దెలియుచున్నది.

---




# ఆంధ్రనామసంగ్రహము

## సటీకము.

---

అవతారిక — పైడిపాటి లక్ష్మణకవి యాంధ్రనామసంగ్రహ మనెడి గ్రంథమును రచింపఁబూని, తాను జేయఁబూనిన యీగ్రంథము నిర్విఘ్నముగఁ బరిసమాప్తి నొందుటకై తన యిష్టదేవతానమస్కారరూప మైనమంగళము నాచరించి, యిఁకమీఁదను గ్రంథకర్తలాదిని మంగళముఁ జేయుదురుగాక యనుతలంపుతో నామంగళమును బద్యరూపముగా గ్రంథారంభమునఁ జేర్చుచున్నాఁడు. రెండవ మూఁడవపద్యములందుఁ గవి తనపేరును, గ్రంథనామమును, ఆగ్రంథవిషయములను, కృతిపతిని దెలియఁ జేయుచున్నాఁడు—

క. శ్రీపతివంద్యు విశాలా
 శ్రీపతిని భజించి యిష్టసిద్ధులు వరుసన్
 బ్రాపింపఁగ గణనాథుని
 శ్రీపాదంబులకు నెఱఁగి చెందినవేడ్కన్.

క. నతభక్తలోకరక్షా
 రతికిం జంచత్కృపాతరంగితమతికిన్

శతమఖముఖసురనుతిసం
గతికిఁ మహిమోన్నతికిని • గౌరీపతికిన్. 2

తే. అంకిత మొనర్తుఁ దెనుఁగుపే • ళ్ళరసి కూర్చి
గరిమతో నాంధ్రనామసం•గ్రహ మనంగ
నమరకృతిఁ బైఁడిపాటియే•కామ్రమంత్రి
సుతుఁడఁ గవిలక్ష్మణాఖ్యుఁడ • సుజనహితుఁడ. 3

తా. పైఁడిపాటి యేకామ్రమంత్రి కుమారుఁడను, సజ్జనుల కిష్టుఁడను నైన పైఁడిపాటి కవిలక్ష్మణుఁ డను నేను తలఁచినకోర్కెలు నెఱవేఁటుటకై శ్రీమహావిష్ణువుచేఁ బూజింపఁదగిన విశాలాక్షీపతి యగు కాశీవిశ్వేశ్వరుని ధ్యానించి, పిదప విఘ్నేశ్వరుని మహిమగలపాదములకు మ్రొక్కి మిక్కిలి సంతోషము నొందినవాఁడనయి, తన్ను మ్రొక్కెడుభక్తులను గాపాడుట యందు శ్రద్ధగలవాఁడును, దయారసముతోఁ గూడినబుద్ధిగలవాఁడును, దేవేంద్రుఁడు మొదలగు సకలదేవతలచేఁ జేయఁబడునమస్కారముల నంగీ కరించువాఁడును, విశేషమహిమగలవాఁడును నైన కాశీవిశ్వనాథస్వామికి సంకితముగాఁ దెనుఁగుపేళ్లన్నియుఁ జేర్చి యాంధ్రనామసంగ్రహ మను గ్రంథము నొనర్చెదను (అని గ్రంథకర్త ప్రతిజ్ఞ చేయుచున్నాఁడు).

అవ. గ్రంథకర్త తాను రచియింపఁదలఁచిన గ్రంథమునం దలి పరిభాషను దెలుపుచున్నాఁడు.—

తే. దేవమానవస్థావర•తిర్యగాఖ్య
వర్గ లొనరింతు నానార్థ•వర్గుఁ గూడ
వర్గములు గాఁగఁ గూర్తు నా•వ్యయములందు
నిడుదు వివరించునెడల సం•స్కృతపదంబు. 4

తా. నేను రచింపఁబోవు ఆంధ్రనామసంగ్రహమందు దేవవర్గు, మా నవవర్గు, స్థావరవర్గు, తిర్యగ్వర్గు, నానార్థవర్గు అను నైదువర్గులను రచించెదను.

పర్యాయపదములన్నియుఁ దెలుఁగుపదములుగా నుండును. అర్థమును వివరించుటకై ఆపర్యాయపదములకుఁ దుదను సంస్కృతపదము నుంచెదను (అని గ్రంథకర్త చెప్పెను).

[దేవవర్గనందు దేవతలు, వారికి సంబంధించినవి చెప్పఁబడినవి. మానవవర్గనందు మనుష్యులు, వారికి సంబంధించినవి వివరింపఁబడినవి. స్థావరవర్గనందు కొండలు, చెట్లు మున్నగునచరములనుగూర్చి చెప్పఁబడినవి. తిర్యగ్వర్గనందు పశుపక్ష్యాదులకు సంబంధించినవానినిగూర్చి వివరింపఁబడినది. నానార్థవర్గనందు ననేకార్థములయినపదములఁ గూర్చి వివరింపఁబడినవి.]

క. శ్రీలలనాధిపవంద్య వి
శాలాక్షీప్రాణనాథ ♦ శతమఖముఖది
క్పాలాభీష్టద సమధిక
శీలా కాశీనివేశ ♦ శ్రీవిశ్వేశా. 5

తా. లక్ష్మీనాథుఁ డగువిష్ణుచేతఁ గొనియాడఁదగినవాఁడవును, కాశీవిశాలాక్షికి మగఁడవును, ఇంద్రాదిలోకపాలురకోర్కుల నీడేర్చువాఁడవును, గొప్పస్వభావముగలవాఁడవు నైన కాశీపురియందు వెలయుచున్న యోవిశ్వేశ్వరా! నీవు నాగ్రంథము నవధరింపుము (అని గ్రంథకర్త కృతిపతిని హెచ్చరించెను).

సీ. ముక్కంటి యరపడి♦మోముల వేలుపు
మినుసిగదయ్యంబు ♦ మిత్తిగొంగ
గట్టువిల్తుఁడు గఱ♦కంఠుఁడు మిక్కిలి
కంటిదేవర బేసి♦కంటివేల్పు
వలిమలల్లుఁడు మిన్ను♦వాకతాలుపు కొండ
వీటిజంగము గుజ్జు♦వేల్పుతండ్రి

వలరాజుసూడు జ•క్కులతేనిచెలికాఁడు
బూచులయొకిమీఁడు • పునుకతాల్పు
తే. విసపుమేఁతరి జన్నంపు•వేఁటకాఁడు
బుడుతనెలతాల్పు వెలియాల•పోతురౌతు
తోలుదాలుపు ముమ్మొన•వాలుదాల్పు
నాఁగ భవదాఖ్య లొప్పు (నం•ధకవిపక్షు). 6

టీ. ముక్కంటి=మూఁడునేత్రములుకలవాఁడు, [బహువ్రీహిసమాసాంతకార్యములు చూపట్టెడి. బాల.సమా.సూ. చేత 'ముక్కంటి' యని యయ్యెను.] అరపదిమోములవేలుపు = ఐదుముఖములు గలదేవుఁడు, మినుసిగదయ్యంబు = ఆకాశము జుట్టుగాఁగలదేవుఁడు, మిత్తిగొంగ = మృత్యువునకు శత్రువు, [మిత్తి-ప్రకృతి, మృత్యువు.] గట్టువిల్తుఁడు=మేరుపర్వతము ధనుస్సుగాఁగలవాఁడు, [బా. సమా. సూ. చూ. ముక్కంటి.] కఱకంఠుఁడు= నల్లనికుత్తుకగలవాఁడు, ["ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రామ్యంబు" బాల. సంజ్ఞా. 23సూ. చేత నిది యనింద్యగ్రామ్యము.] మిక్కిలికంటిదేవర = హెచ్చునేత్రములుగల దేవుఁడు, బేసికంటివేల్పు = మూఁడు నేత్రములుగలదేవుఁడు, [మూఁడు అనునది బేసిసంఖ్య.] వలిమలల్లుఁడు = మంచుకొండయొక్క(హిమవంతునియొక్క) అల్లుఁడు, మిన్నువాకతాలుపు=[మిన్ను=ఆకసము, వాక=నది] ఆకాశగంగను శిరస్సున ధరించువాఁడు, కొండవీటిజంగము = కైలాసపర్వతము నివాసముగాఁ గలభిక్షుకుఁడు, గుజ్జువేల్పుతండ్రి=పొట్టిదేవర యగువిఘ్నేశ్వరుని జనకుఁడు, వలరాజుసూడు=మన్మథునికిఁ బగతుఁడు, జక్కులతేనిచెలికాఁడు = [జక్కులు=యక్షులు, వారికి ఱేఁడు కుబేరుఁడు, అతనికి స్నేహితుఁడు.] కుబేరునిస్నేహితుఁడు, బూచులయొకిమీఁడు = పిశాచములకు అధిపతి, పునుకతాల్పు = బ్రహ్మకపాలధారి, విసపుమేఁతరి=విషము దిన్నవాఁడు, జన్నంపువేఁటకాఁడు=దక్షునియాగము ధ్వంసముచేసినవాఁడు,

[విసము+మేఁతరి, జన్నము+వేఁటకాఁడు—కర్మధారయమందు మువర్ణమునకు పుంపులగు. బా. సంధి. 32 సూ. చేత పుంపుగాగమము.] బుడుతనెలతాల్పు = బాలచంద్రుని శిరంబునఁ దాల్చినవాఁడు, వెలియాలపోతురౌతు = తెల్లనియాఁబోతు నెక్కుయోధుఁడు, తోలుదాలుపు = వ్యాఘ్రచర్మమును ధరించువాఁడు, ముమ్మొనవాలుదాల్పు = మూఁడు మొనలుగల ఆయుధమును (త్రిశూలమును) ధరించినవాఁడు, నాఁగన్ = అను ఈయిరువదిరెండును, అంధకవిపత్ = అంధకాసురునికి శత్రుఁడా! భవత్ ఆఖ్యలు ఒప్పును = నీపేళ్లనఁదగు. (ఈపద్యములోఁ జెప్పిన ౨౨ ను ఈశ్వరుని పేళ్లు.)

సీ. సోఁకుమూఁకలగొంగ ♦ చుట్టుఁగైదువుజోదు
పచ్చవిల్తునితండ్రి ♦ లచ్చిమగఁడు
పులుఁగుతత్తడిరౌతు ♦ వలమురితాలుపు
వెన్నుఁడు కఱివేల్పు ♦ వెన్నదొంగ
నునుగాడ్పుదిండిపా♦నుపునఁ బండెడుమేటి
బమ్మదేవరతండ్రి ♦ తమ్మికంటి
పదివేసములసామి ♦ పసిఁడిపుట్టముదాల్పు
కఱ్ఱినెచ్చెలి తరి♦గట్టుదారి
తే. యాలకాపరి వ్రేఁతల♦మేలువాఁడు
పాలకడలల్లుఁడును బక్కి♦డాలుతేఁడు
ఱేయుఁ బవలును జేయుక♦న్దోయివాఁడు
మామమా మన హరి యొప్పు ♦ (శ్రీమహేశ).    7

టీ. సోఁకుమూఁకలగొంగ = రాక్షససమూహములకు శత్రువు, చుట్టుఁగైదువుజోదు = గుండ్రనియాయుధమును (సుదర్శనమును) దాల్చు వీరుఁడు,

( ) మూలములో నీకుండలమున నుంచఁబడిన పదములు పర్యాయపదయుగ్మములకు సంబంధపడ వని యెఱుఁగుఁడు.

[చుట్టు+కైదువు-చుట్టుఁగైదువు, సమాసమున నుదంతస్త్రీసమంబులకుఁ బరుషసరళములు పరము లగునపుడు నుగాగమంబగు. బా. సంధి. 25సూ. యోధశబ్దమునకు వికృతి-జోదు.] పచ్చవిల్తునితండ్రి = పచ్చనివిల్లు గలమన్మథునికిఁ దండ్రి, లచ్చిమగఁడు = లక్ష్మికి భర్త, (లక్ష్మి-వికృ. లచ్చి.) పులుఁగుతత్తడిరౌతు=గరుడవాహనము నెక్కెడి వీరుఁడు, వలమురితాలుపు = పాంచజన్యమనుశంఖమును ధరించువాఁడు, వెన్నుఁడు=(విష్ణుశబ్దభవము.) అంతట వ్యాపించువాఁడు, కఱివేల్పు = నల్లనిమేనిచాయ గలదేవుఁడు, వెన్నదొంగ = (కృష్ణావతారంబున గోపికల యిండ్లయందు) వెన్న నపహరించినవాఁడు, *నునుగాడ్పుదిండిపానుపునఁ బండెడుమేటి = మృదువైనవాయువును భక్షించెడు శేషతల్పమునందుఁ బరుండు దొర, బమ్మదేవరతండ్రి = బ్రహ్మదేవునికిఁ దండ్రి, తమ్మికంటి = కమలములఁబోలు కన్నులు గలవాఁడు, పదివేసముల సామి = దశావతారము లెత్తిన దేవుఁడు, (సామి-ప్రకృ. స్వామి. వేసము-ప్రకృ. వేషము.) పసిఁడిపుట్టముదాల్పు = పీతాంబరము ధరించినవాఁడు, కఱ్ఱినెచ్చెలి = అర్జునునకు ముఖ్యస్నేహితుఁడు, (నెఱ+చెలి=నెచ్చెలి.) తరిగట్టుదారి = కవ్వపుఁగొండను (మందరపర్వతమును) మోసినవాఁడు, ఆలకాపరి=పసులను మేఁపినవాఁడు, (ఆవు-బహు. ఆవులు-లేక ఆలు. బహువచనము పరంబగునపు డావుప్రభృతుల తుదియక్షరంబునకు లోపం బగు. బా. సంధి. 21 సూ. చేత ఆవుశబ్దమున కంత్యవర్ణలోపము.) వ్రేఁతలమేలువాఁడు = గోపికాస్త్రీలను రక్షించువాఁడు, పాలకడలల్లుఁడు = లక్ష్మీదేవికిఁ దండ్రియైనక్షీరసముద్రున కల్లుఁడు, పక్కిడాలు ఱేఁడు = గరుడధ్వజము గలవాఁడు, రేయుఁబవలును జేయుకన్దోయివాఁడు = నిశాకరదినకరులు(చంద్రసూర్యులు) నేత్రములుగాఁ గలవాఁడు.

* 'నునుగాలిమేఁతపానుపునఁ బండెడిదొర'-అని పాఠాంతరము.

* మామమామ=మామ యగు సముద్రమునకు మామ—అనక (శ్రీమహేశా) హరి ఒప్పును. ఈ ౨౨ పదములును విష్ణువుపేళ్లు.

సీ. పక్కిడాల్వేలుపు ♦ పొక్కిలిపసిబిడ్డఁ
డంచతేజీనెక్కి ♦ యాడురాతు
మనెడుప్రొద్దులనొసళ్లను వ్రాయుదేవర
చదువులవేలుపు ♦ జన్నిగట్టు
తెలిదమ్మిగద్దియఁ ♦ గొలువుండు రాయఁడు
నిక్కపుజగమేలు ♦ నేర్పుకాఁడు
కడుపుబంగారుబొ♦క్కసముఁ జేసినమేటి
పోరోగిరముతిండి♦పోతుతండ్రి
ఆ. నలువ తమ్మిచూలి ♦ నలుమొగంబులవేల్పు
వేల్పుపెద్ద పలుకు♦వెలఁదిమగఁడు
తాత బమ్మ యన వి♦ధాతనామము లొప్పు
(నఘువినాశ యీశ ♦ యభ్రకేశ.) 8

టీ. పక్కిడాల్వేలుపుపొక్కిలిపసిబిడ్డఁడు = గరుడధ్వజుఁడైనవిష్ణువు యొక్క నాభికమలంబునందుఁ బుట్టినచిన్నబిడ్డఁడు, అంచతేజీనెక్కియాడురాతు = హంసవాహనారూఢుఁడు, మనెడుప్రొద్దులనొసళ్లను వ్రాయుదేవర = మానవులజీవితకాలమును మోములందు వ్రాసెడువేల్పు, చదువులవేలుపు=విద్యలకుఁ బ్రభువు, జన్నిగట్టు=యజ్ఞోపవీతమును దాల్చినవాఁడు, తెలిదమ్మిగద్దియఁ గొలువుండురాయఁడు = తెల్లనితామరపువ్వు ఆసనెడుసింహాసన

---

*మామమామ యెట్లనఁగా—లక్ష్మీదేవి సముద్రమునఁ బుట్టినది గనుక విష్ణువునకు సముద్రుఁడు మామ యయ్యె. విష్ణుఁడు తనపాదములందుఁ బుట్టిన గంగను సముద్రున కొసఁగుటచే సముద్రమునకుఁ దాను మామ యయ్యె.

మందుఁ గూర్చుండు ప్రభువు, నిక్కపుజగమేలు నేర్పుకాఁడు=సత్యలోకమును బాలించెడిప్రభువు, కసుపుబంగారు బొక్కసముఁ జేసిన మేటి=హిరణ్యగర్భుఁడు, పోరోగిరముతిండిపోతుతండ్రి = జగడమే యాహారముగాఁ గలిగిన నారదునికిఁ దండ్రి, నలువ=నాలుగునోళ్ళుగలవాఁడు, [నాలుగు నాతులుగల వాఁడు-నలువ. బహుప్రీహి...బా.సమా.22సూ. చేత సమాసాంతకార్యముగలిగినది.] తమ్మిచూలి=విష్ణువునాభికమలమునందుఁబుట్టినవాఁడు, నలు మొగంబుల వేల్పు=చతుర్ముఖుఁ డగు దేవుఁడు, వేల్పు పెద్ద=దేవతలకుఁ బెద్దవాఁడు, పలుకువెలఁదిమగఁడు=వాక్కులదేవి యగుసరస్వతీదేవికి భర్త, తాత = పితామహుఁడు, బమ్మ [బ్రహ్మశబ్దభవము.] ఈ ౧౭ ను బ్రహ్మదేవుని పేళ్ళు.

తే. గట్లరాయనిపట్టి ము•క్కంటివెలఁది
యేనుఁగులగొంగత్తడి • నెక్కుదంట
సామిసామేనిఁ జేకొన్న•చాన జగము
తల్లి యన గౌరిపేళ్లొప్పు • (ధర నుమేశ). 9

టీ గట్లరాయనిపట్టి=పర్వతరాజగుహిమవంతునికూఁతురు, ముక్కంటివెలఁది=త్రినేత్రునిభార్య, ఏనుఁగులగొంగత్తడి నెక్కుదంట = ఏనుఁగులకు విరోధి యైనసింహము నెక్కుడు ధీరురాలు, సామిసామేనిఁ జేకొన్న చాన=భర్తయొక్క యర్ధాంగమును గ్రహించినయాఁడుది, (సామేను = సగముదేహము.) జగముతల్లి = లోకముయొక్క తల్లి-అను ఈ ౫ ను పార్వతికిఁ బేళ్ళు.

తే. లచ్చి కలుములజవరాలు • పచ్చవిల్తు
తల్లి కలిమివేల్పునిల్లాలు • తల్లితల్లి
కడలికూఁతురు సిరి లిబ్బి•పడఁతి తమ్మి
యింటిగరి తన శ్రీ యొప్పు • (మృగధరాంక). 10

టీ. లచ్చి [లక్ష్మీశబ్దభవము.], కలుముల జవరాలు=సంపదలు గలయాఁడుది, పచ్చవిల్తుతల్లి=మన్మథునితల్లి, కలిమివేల్పునిల్లాలు=విష్ణుపత్ని, తల్లితల్లి=

తల్లియైనగంగకుఁ దల్లి, కడలికూఁతురు=సముద్రునికూఁతురు, సిరి [శ్రీశబ్దభవము.], ఒబ్బిపడఁతి = నిధులందుండుదేవత, తమ్మి యింటిగరిత=కమలనివాసిని యగు నాఁడుది - అను నీ ౯ యుం లక్ష్మికి నామములు.

క. తలవాఁకిటను మెలంగెడు
పొలఁతుక పలుకులవెలంది ♦ పొత్తముముత్తో
నలువపడఁతి కలుములపై
దలికోడ లనంగఁ బరఁగు ♦ (ధర) వాణి (శివా). 11

టీ. తలవాఁకిటను మెలంగెడుపొలఁతుక=శిరస్సనకు ద్వారమైన నోటియందు సంచరించెడు స్త్రీ, పలుకులవెలఁది=వాక్కుల కధిదేవత యగునదుచు, పొత్తము ముత్తో=పుస్తకములందు వెలయునట్టి ముత్తైదువ, నలువపడఁతి=బ్రహ్మదేవునిభార్య, కలుములపైదలికోడలు=సంపద కధిదేవత యగులక్ష్మీదేవికిఁ గోడలు [లక్ష్మీపుత్త్రుఁడు బ్రహ్మ; లక్ష్మికిఁ దనకొడుకుభార్య యగుటచేఁ గోడలు.]-ఈ ౫ ను సరస్వతికిఁ బేళ్లు.

సీ. ఇద్దఱుతల్లుల♦ముద్దుబిడ్డఁడు పని
చెలుపులదొర చేట♦చెవులవేల్పు
వంకరతొండంబు♦వాఁ డేనుఁగుమొగంబు
దేవర పాఁపజం♦దెములమేటి
మ్రొక్కువారలపనుల్ ♦ చక్కఁజేసెడుసామి
గఱికపూజల మెచ్చు♦గబ్బివేల్పు
ముక్కంటిపండుల♦మెక్కెడితిండీఁడు
ముక్కంటిగారాబు♦ముద్దుపట్టి
ఆ. పెద్దకడుపువేల్పు ♦ పిళ్లారి కుడుముల
తిండికాఁడు కొక్కు♦తేజిరౌతు

గుజ్జువేలు పొంటి•కొమ్ముదేవర వెన
కయ్య యన వినాయ•కాఖ్య (లీల). 12

టీ. ఇద్దఱుతల్లులముద్దుబిడ్డఁడు=గంగాపార్వతులకిద్దఱకుఁ బ్రేమంపుఁ బుత్త్రుఁడు, పనిచెఱుపులదొర=కార్యవిఘాతము చేయుదేవుఁడు, చేటచెవుల వేల్పు = చేటలవలె వెడల్పయినచెవులు గలదేవుఁడు, వంకరతొండంబునాఁడు=వంకరగా నుండుతొండము గలవాఁడు, ఏనుఁగుమొగంబుదేవర = గజవక్త్రము గలదేవత, పాఁపజందెములమేటి=పాములే యజ్ఞోపవీతముగాఁ దాల్చుప్రభువు, మ్రొక్కువారలపనుల్ చక్కఁజేసెడుసామి=తన్నుఁగొల్చువారికార్యము లనుకూలపఱచుదేవుఁడు, గఱికపూజల మెచ్చు గబ్బివేల్పు=గఱికపూజకు మెచ్చుకొనెడుగొప్పదేవుఁడు, ముక్కంటిపండుల మెక్కెడుతిండీఁడు=టెంకాయలను దినెడువాఁడు, ముక్కంటి గారాబుముద్దుపట్టి=త్రినేత్రుఁ డగునీశ్వరునికి మిక్కిలి యిష్టుఁ డగుకుమారుఁడు, పెద్దకడుపువేల్పు = లంబోదరుఁ డగుదేవుఁడు, పిళ్లారి, కుడుములతిండికాఁడు = కుడుములు దినువాఁడు, కొక్కుతేజిరౌతు = మూషకవాహనము నెక్కుదేవుఁడు, గుజ్జువేలుపు=పొట్టిదేవుఁడు, ఒంటికొమ్ముదేవర=ఏకదంతము గలదేవుఁడు, వెనకయ్య- ఈ ౧౭ ను వినాయకుని పేళ్లు.

సీ. పెనుఁబాఁపకవణంబుఁ • దినువారువము రౌతు
గట్టులయొకిమీని•పట్టిపట్టి
ఱెల్లుచూ లార్గురు•తల్లులకొమరుండు
గాడుపుసంగడి•కానికొడుకు
పుంజుడాలుపు వేలు•పులఱేనిదళవాయి
జంటముమ్మోముల•దంటవేల్పు
కొంచగుబ్బలివ్రక్క•లించినబలుదిట్ట
రెండాఱుచేతుల • దండిమగఁడు

తే. వేలుపులమూఁకపేరిటి • వెలఁదిమగఁడు
వేల్పుగమికాఁడు వెనకయ్య • వెనుకవాఁడు
కొమరుసా మన సేనాని • కొమరుమిగులు
(విగతభవపాశ కాశీని • వేశ యీశ). 13

టీ. పెనుఁబాఁపకబళంబుఁదినువారువమురౌతు = గొప్పసర్పములనెడు కబళమును మ్రింగునట్టి నెమ్మినెక్కు యోధుఁడు (మయూరవాహనుఁడు.), గట్టులరాయనిపట్టిపట్టి = పర్వతరాజపుత్త్రి యగు పార్వతికిఁ బుత్త్రుఁడు, రెల్లుచూలు = రెల్లునందుఁబుట్టినవాఁడు, ఆర్గురుతల్లులకొమరుండు = షట్కృత్తికలకుఁ బుట్టినవాఁడు, గాడుపుసంగడికానికొడుకు = వాయుసఖుఁడగు అగ్నికిఁ బుత్త్రుఁడు, పుంజుడాలువు = కోడిపుంజు ధ్వజమునందు ధరించినవాఁడు, వేలుపులకొనిదళవాయి = ఇంద్రునిసేనాధిపతి, జంటముమ్మోములదంటవేల్పు = ఆఱుముఖములు గలదేవతోత్తముఁడు, కొంచగుబ్బలి వ్రక్కలించినబలుదిట్ట = క్రౌంచపర్వతంబును బగులఁగొట్టిన బలవంతుఁడు, రెండాఱుచేతులదండిమగఁడు = పండ్రెండుచేతులు గలధీరుఁడగుపురుషుఁడు, [రెండాఱులు = పండ్రెండనియర్థము. ఇట్లే, జంటమూఁడులు = రెండుమూఁడులు, ఆఱు అని యర్థము.] వేలుపులమూఁకపేరిటివెలఁదిమగఁడు=దేవసేనయనుకాంతకు భర్త,[వేలుపులమూఁక అనఁగా దేవసేన అని సంస్కృతమున పర్యాయపదము. పద, తదర్థములకు నభేదము.] వేలుపుగమికాఁడు = దేవతలసేనాధిపతి, వెనకయ్యవెనుకవాఁడు = వినాయకునితమ్ముఁడు, కొమరుసామి=[కుమారస్వామిశబ్దవికృతి.] ఈ ౧౮ ను కుమారస్వామికిఁ బేర్లు.

సీ. అలరువిల్తుండు క • న్నులవిల్తుఁడును గమ్మ
విలుకాఁడు చక్కెర • వింటివాఁడు
చెఱకువిల్కాఁడు కెం • జిగురులవిల్తుఁడు
వెడవిల్తుఁడును బచ్చ • విల్తుఁ డించు

విల్లుదాలుపు తుంట•విలుకాఁడు తియ్యవి
ల్కాఁడును జమిలిము•క్కాలినారి
విలుకాఁడు చౌవంచ•ములుకులుగలదంట
రాచిల్కనెక్కెడు•రాయరౌతు
తే. మీను మొసలిసిడంబుల•మేటి చంద
మామయల్లుఁడు వలరాజు • మరుఁడు లచ్చి
కొమరుఁ డనువేళ్ల నొప్పును • గుసుమధన్వి
(విగతభవపాశ కాశీని•వేశ యీశ). 14

టీ. అలరువిల్తుండు = పువ్వులు ధనుస్సుగాఁగలవాఁడు, కన్నులవిల్తుఁడు=గణపులధనుస్సుగలవాఁడు, కమ్మవిలుకాఁడు = తియ్యనిధనుస్సు గలవాఁడు, చక్కెరవింటివాఁడు=పంచదార నొసఁగు ధనుస్సు గలవాఁడు, చెఱకువిలుకాఁడు = చెఱకుగడ ధనుస్సుగాఁ గలవాఁడు, కెంజిగురులవిల్తుఁడు=ఎఱ్ఱనిచిగుళ్లు విల్లుగాఁగలవాఁడు, [కెంపు + చిగురు - ప్రాతాదిగమ కనాద్యక్షరశేషము, కెం + చిగురు=అనుస్వారము ద్రుతతుల్యముగాన పరుషమునకు సరళాదేశము. కెంజిగురనియాయెను. [వెడవిల్తుఁడు= చులకనిధనుస్సు గలవాఁడు, పచ్చవిల్తుఁడు=పచ్చనిధనుస్సు గలవాఁడు, ఇంచువిల్లుదాలుపు = చెఱకుగడ ధనుస్సు ధరించువాఁడు, తుంటవిలుకాఁడు = చెఱకుతుంట విల్లుగాఁగలవాఁడు, తియ్యవిల్కాఁడు=తియ్యనివిల్లుగలవాఁడు, జమిలిముక్కాలినారివిలుకాఁడు = ఆఱుకాళ్లు గలపురుగులు (తుమ్మెదలు) అల్లెత్రాడుగాఁ గలధనుస్సుగలవాఁడు, [జమిలిముక్కాళ్లు=రెండుమూళ్లు కాళ్లు. ఆఱుకాళ్లు.] చౌవంచములుకులు గలదంట = ఐదుబాణములు గలయోధుఁడు, రాచిల్కనెక్కెడురాయరౌతు = శ్రేష్ఠమగు చిలుక నెక్కెడు మేటివీరుఁడు, మీను మొసలిసిడంబులమేటి = చేఁపలు మొసళ్లు ధ్వజమునందుఁ గలదిట్టరి, చందమామయల్లుఁడు = చంద్రుని కల్లుఁడు, వలరాజు = ప్రేమలకు నధిపుఁడు,

మరుఁడు, [స్మరశబ్దభవము.] లచ్చికొమరుఁడు=లక్ష్మీదేవియొక్క పుత్త్రుఁడు-అను నీ ౧౪ యందును మన్మథుని పేళ్లు.

సీ. చలువలఱేఁడు వె॰న్నెలఱేఁడు ఱేఱేఁడు
జాబిల్లి ఱేవెల్గు ♦ చందమామ
తమ్ములపగవాఁడు ♦ కమ్మవిల్తునిమామ
కలువలఱేఁడు పా॰ల్కడలిపట్టి
జక్కవకవవిప్పు ♦ ముక్కంటితలపువ్వు
చుక్కలదొర ప్రొద్దు॰జోడుకోడె
తపసికన్వాప బి॰త్తరిజింకతాలుపు
కఱివేల్పుడాకన్ను ♦ కడలివెన్న
తే. పంటపైరులయొకిమీఁడు ♦ జంటదంట
చౌకములపాళ్ల తెలిముద్ద ♦ చలివెలుంగు
వేలుపులబువ్వ చీఁకటి॰వేరువిత్తు
నెల యనఁగఁ జంద్రుపేళ్లొప్పు ♦ (నీలకంఠ). 15

టీ. చలువలఱేఁడు=చల్లఁదనము గలరాజు, వెన్నెలఱేఁడు=వెన్నెలకధిపతి, ఱేఱేఁడు = నిశానాథుఁడు, జాబిల్లి = (జాను+బిల్లి) అందమైన బింబము, ఱేవెల్గు=రాత్రియందుఁ బ్రకాశించువాఁడు, చందమామ, [చంద్రమస్ శబ్దభవము.] తమ్ములపగవాఁడు = కమలములకు విరోధి, కమ్మవిల్తునిమామ = మన్మథునికిమామ, కలువలఱేఁడు=ఉత్పలములకు రాజు, పాల్కడలిపట్టి = క్షీరసముద్రునిపుత్త్రుఁడు,. జక్కవకవవిప్పు = చక్రవాకమిథునమును వియోగపఱచువాఁడు, (రాత్రిపూఁట చక్రవాకదంపతులు గలిసియుండవు.) ముక్కంటితలపువ్వు = ఈశ్వరునిశిరోభూషణ మయినవాఁడు, చుక్కలదొర = నక్షత్రములకు రాజు, ప్రొద్దుజోడుకోడె = సూర్యునితోసమానుఁ డగు వీరుఁడు, తపసికన్వాప = అత్రిమునీంద్రునియొక్క నేత్రమునఁ బుట్టిన చిన్నవాఁడు, బిత్తరిజింకతాలుపు=సొగసైనమృగంబునుదాల్చినవాఁడు,

కఱివేల్పుడాకన్ను = విష్ణువుయొక్క యెడమనేత్రము, కడలివెన్న = సముద్రమునందలివెన్న, (పాలసముద్రము చిలుకునప్పుడు పుట్టుటచేత వర్ణమునుబట్టి వెన్న యని చెప్పఁబడియె.) పంటపైరుల యెకిమీఁడు = సస్యములకు రాజు, జంటదంటచౌకములపాళ్ల తెలిముద్ద = పదునాఱు కళలుగల తెల్లనిబింబము, [జంట=రెండు, దంట=రెండు, చౌకము = నాలుగు, రెండు రెండులు నాలుగు-నాలుగు నాలుగులు పదునాఱు.] చలివెలుంగు = చల్లనికిరణములు గలవాఁడు, వేలుపులబువ్వ=దేవతల కాహారమైనవాఁడు, [చంద్రుని కళలలో 15 కళలను దినదిన మొక్కొక్కదేవత పానము సేయుచున్నదని శ్రుతి.] చీఁకటివేరువిత్తు=చీఁకటిని బోఁగొట్టువాఁడు, నెల-అను నీ 24 ను చంద్రునిపేళ్లు.

సీ. వెన్నునివలకన్ను • వేఁడివేలుపు ప్రొద్దు
తొవలరాయిడికాఁడు • పవలుసేయు
వేలుపు పచ్చగు•ఱ్ఱాలవజీరుండు
వేఁడివెలుంగు రే•వెల్గుజోదు
జంటాఱుమేనుల•సామి చీఁకటిగొంగ
యొజ్జనివేలుపు • నిపముసూడు
చదలుమానికము ప్రాఁ•జదువులపెట్టియ
యేడుగుఱ్ఱములతే•రెక్కుజోదు
మువ్వేలుపులయిక్క • మ్రొక్కులదేవర
గాములతేఁడు జ•క్కవలతేఁడు
వేయిచేతులతేఁడు • వెలుఁగులయెకిమీఁడు
చెయువులసాకిరి • చాయమగఁడు
మింటితెరువరి తమ్మివా•ల్గంటిమగఁడు
పోఁరనీల్గెడుమొనగాండ్రు•పోవుదారి

జగముచుట్టంబు జమునయ్య • జగముకన్ను
నాఁగ సూర్యునిపేళ్లొప్పు • (నాగభూష). 16

టీ. వెన్నునివలకన్ను=విష్ణువుయొక్కకుడికన్నైనవాఁడు, వేఁడివేలుపు=తైక్ష్ణ్యముగలదేవుఁడు, ప్రొద్దు, [బ్రధ్నశబ్దభవము.] తొవలరాయిడికాఁడు=కలువలకువిరోధి, పవలునేయువేలుపు = దినకరుఁడు, పచ్చగుఱ్ఱాలవజీరుండు=పచ్చగుఱ్ఱములనెక్కెడిరౌతు, వేఁడివెలుంగు = వేఁడికిరణములుగలవాఁడు, రేవెల్గుజోడు=రాత్రియందుఁ బ్రకాశించుచంద్రునికి సమానుఁడు, జంటాఱుమేనులసామి=ద్వాదశాత్ముఁడు, చీఁకటిగొంగ=చీఁకటిని బోఁగొట్టుదేవుఁడు, ఎఱ్ఱనివేలుపు=ఎఱ్ఱనిదేహముగలదేవుఁడు, ఇవముసూడు = మంచునకుశత్రువు, చదలుమానికము=ఆకాశమునకురత్నము, ప్రాఁజదువులపెట్టియ=వేదములకునికిపట్టు, ఏడుగుఱ్ఱములతేరెక్కుజోదు, ముమ్మేలుపులయిక్క = త్రిమూర్తులకుఁ దావరమైనవాఁడు, మ్రొక్కులదేవర = నమస్కారములకుఁ బ్రియుఁడయిన దేవుఁడు, గాములఱేఁడు = గ్రహములకురాజు, జక్కవలఱేఁడు=చక్రవాకములకధిపతి, వేయిచేతులఱేఁడు=సహస్రకిరణుఁడు, వెలుఁగులరొకిమీఁడు = వెలుతురులకన్నిటికిఁ బ్రభువు, చెయువులసాకిరి = కర్మలకు సాక్షిభూతుఁడు, చాయమగఁడు=ఛాయాదేవికిఁ బెనిమిటి, మింటితెరువరి=ఆకాశమునఁదిరుగు బాటసారి, తమ్మివాల్గంటిమగఁడు=పద్మిని యనుకాంతకు నాథుఁడు, పోరసీర్గడు మొనగాండ్రుపోవుదారి = యుద్ధమునఁజచ్చినవీరులు స్వర్గలోకమునకుఁ బోవుమార్గమైనవాఁడు, (యుద్ధమునఁజచ్చినవీరులును, యోగులును సూర్యమండలమును భేదించికొని స్వర్గమునకుఁబోవుదురని శ్రుతి.) జగముచుట్టంబు=లోకబాంధవుఁడు, జమునయ్య = యమునకుఁదండ్రి, జగముకన్ను = లోకమునకు నేత్రము అను ౨౯ యును సూర్యునికినామములు.

సీ. చట్టుపల్ దెగగట్టుఁ • గొట్టెడుజెట్టి నూ
అంచులవాలు చే•మించుజోదు

దుగబొట్లపిటిఁది యై•దుకనుంగవలవేల్పు
పాఱుతపసియింటి•పంచకోడి
యొడలిచూపాడయఁ డె•క్కుడుమొగుల్ గలప్రోడ
నిక్కువీనులజక్కి • నెక్కురౌతు
తెల్లయేనుఁగు నెక్కి • తిరిగెడుదొర తూర్పు
మాగాని యేలెడు•మణియకాఁడు
తే. జమిలిచౌపంచపదులు జ•న్నములు నేసి
నట్టివేలుపు సోమాసి • పెట్టుఁ జెట్టు
పొట్టితమ్ముఁడు గల్గిన•యట్టివేల్పు
నాఁగ నింద్రునిపేర్లొప్పు • (నాగభూష). 17

టీ. చట్టుపల్ దెగగట్లఁగొట్టెడు జెట్టి=పర్వతములయొక్క రెక్కలను ఛేదించినదిట్టరి, నూఱంచులవాలుచేమించుజోదు=నూఱంచులు గలవజ్రాయుధమును జేతఁదాల్చినయోధుఁడు, దుగబొట్లపిటిఁది యైదుకనుంగవలవేల్పు = సహస్రనేత్రుఁడు, [దుగబొట్లపిటిఁదియైదు అనఁగా ఐదు నూఱులు-రెండు సున్నలు వెనుకఁగలయైదు=500, వానికవలు=వానిజత-500 × 2=1000 వేయి.] పాఱుతపసియింటిపంచకోడి = గౌతమునియాశ్రమంబునఁ గోడిరూపము నెత్తినవాఁడు, ఒడలిచూపాడయఁడు = దేహమంతయుఁ గన్నులుగలదొర, ఎక్కుడుమొగుల్ గలప్రోడ = మేఘములె వాహనములుగాఁ గలనేర్పకాఁడు. [ప్రౌఢ-వికృ. ప్రోడ.] నిక్కువీనులజక్కి నెక్కురౌతు=నిక్కుచెవులవాహనమును (ఉచ్చైశ్శ్రవ మనుగుఱ్ఱమును) ఎక్కునట్టిదిట్టరి. తెల్లయేనుఁగు నెక్కి తిరిగెడుదొర=ఐరావత మనుగజము నెక్కి సంచరించెడుప్రభువు, తూర్పుమాగానియేలెడు మణియకాఁడు = తూర్పుదిక్కును పాలించెడియుద్యోగస్థుఁడు, జమిలిచౌపంచపదులు జన్నములు నేసినట్టి వేలుపు = నూఱుయాగములుచేసిన దేవుఁడు, [జమిలి=రెండు, చౌపంచ=ఐదు, రెండుఐదులు=పది, పదిపదులు = నూఱు.] సోమాసిపెట్టుఁజెట్టు = సోమయాజులపాలిటికల్పవృక్షము, పొట్టి

తమ్ముఁడు గల్గినయట్టివేల్పు=వామనుని దమ్మునిగఁ గలవాఁడు-అను నీ ౧౨ను ఇంద్రుని పేళ్లు.

ఆ. నీరుపాప గాలి ♦ నెచ్చెలి యన్నింటి
తిండికాఁడు కప్పుఁ ♦ దెరువుజాడ
యంటరానివేల్పు ♦ జంటమోములసామి
యగ్గి యనఁగ నొప్పు ♦ ననలుఁ (డీశ). 18

టీ. నీరుపాప = నీటియందుఁబుట్టిన బిడ్డఁడు, గాలినెచ్చెలి = వాయుసఖుఁడు, అన్నింటితిండికాఁడు = సర్వభక్షకుఁడు, కప్పుఁదెరువుజాడ=నల్లని మార్గము కలవాఁడు (కృష్ణవర్త్మ), అంటరానివేల్పు = తాఁకుటకు వీలుపడని దేవుఁడు, జంటమోములసామి = రెండుముఖములు గల వేలుపు, అగ్గి [అగ్ని శబ్దభవము.] ఈ 8 ను అగ్నిహోత్రుని నామములు.

తే. జమునసైదోడు పెతరుల♦సామి జముఁడు
ప్రొద్దుకొమరుఁడు గుదెతాల్పు ♦ పోతుజక్కి
నెక్కి యాడెడుబలురౌతు ♦ దక్కిణంపు
సామి యన నంతకుం డొప్పు ♦ (శ్రీమహేశ). 19

టీ. జమునసైదోడు=యమునకుఁ దోఁబుట్టినవాఁడు, పెతరులసామి=పితృదేవతలకుఁ బ్రభువు, జముఁడు, [యముఁడు-వికృ. జముఁడు.] ప్రొద్దుకొమరుఁడు=సూర్యునికొడుకు, గుదెతాల్పు = గుదెను ధరించినవాఁడు, పోతుజక్కినెక్కియాడెడుబలురౌతు = దున్నపోతు నెక్కెడిబలిమిగలదిట్టరి, దక్కిణంపుసామి=దక్షిణదిశ నేలువాఁడు-ఈ 8 ను యముని నామములు.

ఆ. మూలతేఁడు సోఁకు♦మూఁకలతేఁడు రే
ద్రిమ్మరీఁడు పొలసు ♦ దిండిపోతు
రక్కసుండు నల్ల ♦ ద్రావువాఁ డనఁగను
నిర్ఋతిపేళ్లు సెల్లు ♦ (నీలకంఠ). 20

టీ. మూలఱేఁడు=నిరృతిమూల కధిపతి, సోఁకుమూఁకలఱేఁడు=రాక్షసులసేనలకు రాజు, రేద్రిమ్మరీఁడు = రాత్రులందుఁ దిరుగువాఁడు, పొలసు దిండిపోతు = మాంసమును దినువాఁడు, రక్కసుఁడు, [రాక్షసశబ్దభవము.] నల్లద్రావువాఁడు=రక్తపానము చేయువాఁడు-ఈ ౬ ను నిరృతికిఁ బేళ్లు.

ఆ. మేటినీరుచాలి ♦ మెయితాలుపులసామి
వల్లెత్రాఁడుదాల్పు ♦ నీళ్లరాయఁ
డేటిబోఁటిమగల ♦ ఱేకిమీఁడు పడమటి
దొర యనంగ నొప్పు ♦ వరుణుఁ (డీశ). 21

టీ. మేటినీరుచాలిమెయితాలుపులసామి = విస్తారజలము గలసముద్రమునందుఁ బుట్టిన దేహములు గలజలజంతువులకు ఱేఁడు, వల్లెత్రాఁటితాల్పు = పాశ మనెడు ఆయుధముఁ దాల్చినవాఁడు, నీళ్లరాయఁడు=రసాధిపతి, ఏటిబోఁటిమగలఱేకిమీఁడు = నదులకు భర్తలైనసముద్రములకు రాజు, పడమటిదొర=పడమటిదిక్కు నేలెడిరాజు - ఈ ౫ ను వరుణునికిఁ బేళ్లు.

సీ. వడిగలజింకతే♦ త్తడి నెక్కునెఱరాతు
మేటిపాములమేఁత ♦ నీటికాత
యొడలితాల్పులపిండు ♦ కుసు రగుబలియుండు
సోఁకుదయ్యము వింటి♦చూలి గాలి
కరువలి తెమ్మెర ♦ గాడ్పు పయ్యరయొంటి
మ్రాఁకులపెనుముప్పు ♦ మబ్బువిప్పు
సురటివీవులఁబుట్టు ♦ సుడిగొట్టు చలినట్టు
బక్కవారలపెను♦బాద యీఁద
తే. అబ్బురపుఁదియ్యవిలుకాని ♦ నిబ్బరంపు
దెబ్బపోరుల నలయిక ♦ ప్రబ్బుబోంట్ల

గబ్బిగుబ్బలచెమటల • యుబ్బడంచు
గబ్బి నాఁ జను మారుతాఖ్యలు (మహేశ).* 22

క. మరుదాఖ్య లొప్పుచుండును
ధర వినుచూలి యని సోఁకు•దయ్య మనం బ
య్యెర యని గొట్టిన నీఁ దనఁ
గరువలి యనఁ దెమ్మెరనఁగ • గాలి యనంగన్. 23

టీ. వడిగలజింకతత్తడినెక్కు నెఱరౌతు=వేగము గలలేడి యనువాహనము నెక్కెడి నేర్పరి యగువిట్టరి, మేటిపాములమేఁత=శ్రేష్ఠము లగుపాములకు ఆహార మైనవాఁడు, నీటితాత = ఉదకములకుఁ దాత, ఒడలితాల్పుల పెంపు కుసు రగు బలియుండు= దేహధారులకు ప్రాణమైనబలిమి గలవాఁడు, సోఁకుదయ్యము = స్పర్శగుణముగలదేవుఁడు, మింటిచూలి = ఆకాశంబునఁ బుట్టినవాఁడు, గాలి, కరువలి, తెమ్మెర, గాడ్పు, పయ్యెర, ఒంటిమ్రాఁకుల పెనుముప్పు = ఒంటరిగానున్నచెట్లకు మిక్కిలిబాధ గలిగించునది, మబ్బువిప్పు = మబ్బులను జెదరఁగొట్టునది, సురటివీవులఁబుట్టు = సురటివీచుటచేఁబుట్టినది, సుడిగొట్టు=గుండ్రముగా వీచునది, చలిపట్టు = శీతమున కునికిపట్టయినది, ఒక్కవారలపెనుబాద = కృశించినవారికి మిక్కిలి బాధాకరుఁడు, ఈఁద, అబ్బురపుఁదియ్యవిలుకాని నిబ్బరంపు దెబ్బపోరుల నలయిక ప్రబ్బు బోఁట్ల గబ్బిగుబ్బల చెమటల యుబ్బడంచుగబ్బి = ఆశ్చర్యకరములై మన్మథునిబాణముల ప్రహారమువలన నలఁతనొందిన యువతులయొక్క గొప్ప

* ఈసీసపద్యమునఁ జెప్పఁబడిన పర్యాయపదములనే వెనుకటి కందమునందును జెప్పినాఁడు. ఏవో రెండుపదములుమాత్రము చేర్పఁబడినవి. అవి కేవలపద్యపూరణార్థము చేర్పఁబడినవి గాన మరల వానిని అర్థమునందు వ్రాయలేదు. కాఁబట్టి పర్యాయపదములు ౨౧ అనుటసరి. అందును ఒకదీర్ఘసమాసపద మొక్కటి కానఁబడుచున్నది. అది పర్యాయపద మనుట యుక్తముగాఁ దోఁచలేదు. పాదపూరణార్థమనియే చెప్పవచ్చును.

స్తనములమీఁది యెక్కువచెమటఁ బోఁగొట్టునేర్పరి, వినుచూలి=ఆకాశమున బుట్టినదేవుఁడు, గొట్టు-ఈ ౨౧ యును గాలికిఁ బేర్లు.

క. ముక్కంటియనుఁగుఁజెలి వడ
చక్కెలిక చాగకాఁడు • జక్కులదొర బల్
రొక్కమెకిమీఁడు మానిసి
నెక్కెడువాఁ డనఁగ జను ధ•నేశుం (డభవా). 24

టీ. ముక్కంటియనుఁగుఁజెలి=ఈశ్వరునికిఁ బ్రాణస్నేహితుఁడు, వడచక్కెలిక=ఉత్తరదిక్కు నేలెడిప్రభువు, * చాగకాఁడు= ధనమొసఁగువాఁడు, జక్కులదొర = యక్షులకు రాజు, బల్ రొక్కమెకిమీఁడు = ఎక్కువ కలిమికి రాజు, మానిసి నెక్కెడువాఁడు = నరవాహనుఁడు - ఈ ౬ ను కుబేరునినామములు.

క. విడిముడి గలవేలుపుచెలి
జడముడిజంగంబు గడదె•సం గాపరి యగా
యొడయండు పాఁపతొడవుల
నిడియొడివే ల్పనఁగ నొప్పు • నీశానుఁ డిలన్. 25

టీ. విడిముడిగల వేలుపుచెలి=రొక్కము గలవేల్పునకు (కుబేరునకు) మిత్త్రుఁడు, జడముడిజంగంబు=జడలను దాల్చినబిచ్చగాఁడు, కడదెసంగాపరి యగా యొడయండు = కడపటిదిక్కగునీశాన్యదిక్కు నేలెడి ప్రభువు, పాఁపతొడవుల నిడియొడివేలుపు=నాగభూషణుఁ డగుదేవుఁడు- ఈ ౪ ను ఈశానునిపేరులు.

క. దేవాలయాహ్వయంబులు
కోవెల యన దేవళంబు • గుడి నా వెలయున్

* తేగకాఁడు - అని పా

దేవ ళ్లన జేజే లనఁ
గా వేలుపు లనఁగ వెలయుఁ ♦ గ్రతుభుగభిఖ్యల్. 26

టీ. కోవెల, దేవళంబు, (దేవాలయశబ్దభవము.) గుడి, ఇవి 3 ను దేవాలయములకుఁ బేరులు. దేవళ్లు-(దీనికి ఏకవ. దేవర.) జేజేలు, వేలుపులు-అను నీ 3 ను దేవతలకుఁ బేరులు.

ఆ. తుటిని బెళ్లు దనరు ♦ సిరిదంపుఁబెద్ద బల్
పాఁపఱేఁడు వెన్న ♦ పాను పనఁగఁ
బుడమితాలు పనఁగఁ ♦ దడవులనిడుపఁడు
చిలువఱేఁ డనంగ ♦ శేషునకును. 27

టీ. సిరిదంపుఁబెద్ద=సుఖసముగలగొప్పవాఁడు, బల్పాఁపఱేఁడు=పాములపెద్దలకుఁ బెద్దయైనపాము, వెన్నపానుపు=విష్ణువుయొక్క సెజ్జయైనవాఁడు, పుడమితాలుపు=భూమిని మోయువాఁడు, తడవులనిడుపఁడు = చిరకాలజీవి, చిలువఱేఁడు=పాఁపరాజు - ఈ ౬ ను ఆదిశేషునకుఁ బేరులు.

క. మఱునయ్యతేజి పులుఁగుల
దొర పాములవేఁటకాఁడు ♦ తూరుపునా డేల్
దొరబువ్వఁ గొన్నలావరి
గరుటామంతుఁ డన నొప్పు ♦ గరుడం (డభవా). 28

టీ. మఱునయ్యతేజి=మన్మథునితండ్రియగువిష్ణునకు వాహనము, పులుఁగులదొర = పక్షీంద్రుఁడు, పాములవేఁటకాఁడు = పన్నగశత్రువు, తూరుపునాడేలుదొరబువ్వఁ గొన్నలావరి=పూర్వదిశను బాలించు దేవుఁ డగు నింద్రుని యాహారం బగు అమృతమును దెచ్చినబలవంతుఁడు, గరుటామంతుఁడు - ఈ ౫ ను గరుత్మంతుని పేళ్లు.

ఆ. నల్లవలువతాల్పు ♦ తెల్లనిమైదంట
వెన్నదొంగయన్న ♦ వెట్టినీళ్ల

మేలువాఁడు దుక్కి♦వాలుదాలుపు తాటి
పడగవాఁ డనంగ ♦ బలుఁడు (రుద్ర.). 29

టీ. నల్లవలువతాల్పు=నల్లనిబట్టఁదాల్చినవాఁడు, తెల్లనిమైదంట=తెల్లనిదేహముగలదిట్టరి, వెన్నదొంగయన్న = కృష్ణుని యగ్రజుఁడు, వెఱ్ఱినీళ్లమేలువాఁడు=మద్యపానమునం దాసక్తిగలవాఁడు,దుక్కివాలుదాలుపు=నాఁగేలాయుధముగాఁ గలవాఁడు, తాటిపడగవాఁడు-ఈ ౬ ను బలరామునిపేర్లు.

క. వడముడి యనఁగా గాడుపు
కొడుకన నివి రెండుబేళ్ల♦గుఱ భీమునకుం
బుడమిం గల్తి యనం గ
వ్వడి యన విచ్చుఁ డనఁగ ♦ వాసవి (యీశా). 30

టీ. వడముడి, గాడుపుకొడుకు=వాయుపుత్త్రుఁడు-ఈ రెండును భీమునికిఁ బేరులు. కల్తి,కవ్వడి=ఇరుగేలను బాణప్రయోగము చేయువాఁడు,[కవ+వడి-అం దదుకప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు. బాల. సంధి. 42 సూ. చే నిపాతము.] విచ్చుఁడు - [బీభత్సశబ్దభవము.]ఈ 3 ను అర్జునునికిఁ బేర్లు.

తే. వేలుపులత్రోవ యుప్పర♦వీది యాక
సంబు విను విన్ను మిను మిన్ను ♦ చదలు నింగి
దివి మొయిలుదారి చుక్కల♦తెరువు బయలు
గాడ్పుతంత్రన నభ మొప్పు ♦ (గరళకంఠ). 31

టీ. వేలుపులత్రోవ=దేవతలు సంచరించుమార్గము, ఉప్పరవీది=పైనుండు మార్గము, ఆకసంబు, (ఆకాశశబ్దభవము.) విను, విన్ను, మిను, మిన్ను, చదలు, నింగి, దివి, (ద్యుశబ్దభవము. ద్యువ్యాచ్ఛబ్దంబులకు దివి భువి యగు. బా. తత్స. 84 సూ. చే "దివి" యని నిపాతము.) మొయిలుదారి = మేఘమార్గము, చుక్కలతెరువు=నక్షత్రమార్గము, బయలు, గాడ్పుతంత్రి = వాయువుతంత్రి - ఈ ౧౮ ను ఆకాశమునకుఁ బేరులు.

తే. వెలయు ధరణిఁ జతుర్దిశల్ ♦ నలుఁగడ లన
నలరు దచ్చికడ లన ది♦శాష్టకంబు
దనరు నీరైదుకడలు నా ♦ దశదిశలును
(మౌళిధృతగంగ యంగజ♦మదవిభంగ). 32

టీ. నలుఁగడలు=నాలుగుదిక్కులకుఁ బేరు. దచ్చికడలు=ఎనిమిదిదిక్కులకుఁ బేరు. ఈరైదుకడలు-(ఈరు=రెండుఐదులు=పది) పదిదిక్కులకును బేరు.

ఆ. తాఁటిసిడమువాని♦తల్లి కూఁతురిబిడ్డ
వెన్నునడుగుపాప ♦ మిన్నువాఁక
వేల్పుటేఱు గడలి ♦ వెలఁదుక ముత్రోవ
ద్రిమ్మ రనఁగ నొప్పు ♦ (దివిజగంగ). 33

టీ. తాటిసిడమువానితల్లి=తాలధ్వజుఁ డగుభీష్మునితల్లి, కూఁతురిబిడ్డ=తనకూఁతు రగులక్ష్మికి గూఁతురు, వెన్నునడుగుపాప = విష్ణుపాదమునఁ బుట్టిన చిన్నది, మిన్నువాఁక = ఆకసమునందుఁబాఱునది, వేల్పుటేఱు = దేవతలనది, (వేల్పు + ఏఱు-కర్మధారయసమాసమందుఁ బేర్వాదిశబ్దముల కచ్చుపరంబగు నపుడు టుగాగమం బగు. బా. సంధి. సూ. చే టుగాగమంబు.) కడలివెలఁదుక = సముద్రునిభార్య, ముత్రోవద్రిమ్మరి = మూఁడుత్రోవలుగాఁబాఱునది, త్రిపథగ-ఈ ౮ ను గంగానదికిం బేరులు.

తే. వేలుపులగారు చౌదంతి ♦ వెల్లయేనుఁ
గనఁగ నైరావతంబున ♦ కాఖ్య లమరు
వేల్పుదొరతేజి యనఁగను ♦ వెల్లగుఱ్ఱ
మనఁగ నుచ్చైశ్శ్రవం బొప్పు ♦ నంబికేశ. 34

టీ. వేలుపులగారు = దేవతలయేనుఁగు, చౌదంతి=నాలుగుదంతములు గలది, వెల్లయేనుఁగు = తెల్లయేనుఁగు-ఈ 3 ను ఐరావతమునకుఁ బేరులు. వేల్పుదొరతేజి=దేవేంద్రునివాహన మగుగుఱ్ఱము, వెల్లగుఱ్ఱము=తెల్లనిగుఱ్ఱము - ఈ ౨ ను ఉచ్చైశ్శ్రవమునకు నామములు.

ఆ. పుడుకుఁదోడుకు వేలు•పులగిడ్డి వెలిమొద
వనఁగఁ గామధేను • వలరుచుండు
గల్పకంబు దనరు • వేల్పుఁజె ట్టీవుల
మ్రాను వెల్లమ్రాను • నా (సుమేశ). 35

టీ. పుడుకుఁదోడుకు = కోర్కుల నొసఁగునట్టియావు, వేలుపులగిడ్డి = దేవతలయావు, వెలిమొదవు = తెల్లనియావు - ఈ 3 ను కామధేనువునకుఁ బేళ్లు. వేల్పుఁజెట్టు = దేవతలవృక్షము, [వేల్పు + చెట్టు - సమాసంబుల నుదంత ... బగు - బా. సంధి. 25 సూ. చే "వేల్పుఁజెట్టు" అని రూపము. ఇట్లె పుడుకుఁ దోడుకు] వెల్లమ్రాను = తెల్లనిచెట్టు, ఈవులమ్రాను = కోరికలొసంగెడుచెట్టు - ఈ 3 ను కల్పవృక్షమునకుఁ బేళ్లు.

ఆ. అవని గుడుసుకైదు • వనఁగ వేయంచుల
కైదు వనఁగఁ జుట్టుఁ • గైదు వనఁగ
బటువుఁగైదు వనఁగఁ • బరఁగు సుదర్శన
చక్రమునకుఁ బేళ్లు • (చంద్రమౌళి). 36

టీ. గుడుసుకైదువు = గుండ్రనియాయుధము, వేయంచులకైదువు = వేయి మొనలుగలయాయుధము, చుట్టుఁగైదువు = గుండ్ర మైనయాయుధము, బటువుఁగైదువు = దిట్టమైన యాయుధము - ఈ ౪ ను విష్ణుచక్రమగుసుదర్శనమునకుఁ బేళ్లు.

ఆ. వలమురి యనఁ జుట్టు•వాలుజో డనఁ గల్మి
కొమ్మమగనిబూర•గొ మ్మనంగఁ
దనరుఁ బాంచజన్య•మునకు నభిఖ్యలు
(ధృతకురంగ ధవళ•వృషతురంగ). 37

టీ. వలమురి = కుడితట్టుగాఁ దిరిగియుండునది, చుట్టువాలుజోడు = సుదర్శనమునకుఁ దోడయినది. కల్మికొమ్మమగనిబూరగొమ్ము = లక్ష్మీదేవిభర్తపూరించెడివాద్యవిశేషము - అను నీ 3 ను పాంచజన్య మనెడి శంఖమునకుఁ బేళ్లు.

తే. రిక్క లనఁ జుక్క లనఁగను ♦ ఋక్షములకు
నాఖ్య లై యొప్పుఁ దెఱఁగంటి ♦ యన్ను లనఁగ
నచ్చర లనంగ వేలుపు♦మచ్చకంటు
లనఁగ సురకాంతలకు నాఖ్య ♦ లగు (గిరిశ). 38

టీ. రిక్కలు, (ఋక్షశబ్దభవము.) చుక్కలు-అను నీ ౨ ను నక్షత్రములకుఁ బేర్లు. తెఱఁగంటియన్నులు = అనిమిషస్త్రీలు, అచ్చరలు, [అప్సరశ్శబ్దమునకు వికృతి.] వేలుపుమచ్చకంటులు=దేవతలస్త్రీలు-ఈ 3 ను అప్సరసలకుఁ బేరులు.

తే. పవలు పగ లనఁ బేర్లొప్పు ♦ దివమునకును
రాత్రిపేర్లొప్పు రే రేయి ♦ రాతి రనఁగ
వెలయుచుండును రేయెండ ♦ వెన్నె లనఁగఁ
జంద్రికకును సమాఖ్యలు ♦ (చంద్రమౌళి). 39

టీ. పవలు, పగలు-ఈ ౨ ను దినమునకుఁ బేర్లు. రే, రేయి, రాతిరి-ఈ 3ను రాత్రికిఁ బేర్లు. రేయెండ=రాత్రులందుగాయు నెండ, వెన్నెల= తెల్లని చంద్రుఁడు గలది - [వెలి+నెల గలది] ఈ ౨ ను చంద్రకాంతికిఁ బేరులు.

క. మించు లన మెఱుపు లనఁగను
జంచలలకుఁ బేర్లు దనరు ♦ జలధరములు రా
ణించుం బలుకంగ మొయి
ళ్లుంచు మొగుళ్లంచు మబ్బు ♦ లంచుఁ (భర్గా). 40

టీ. మించులు, మెఱుపులు-ఈ ౨ ను మెఱుపులకుఁ బేర్లు. మొయిలు, మొగులు, మబ్బు-ఈ 3 ను మేఘములకుఁ బేర్లు.

క. తొలుచదువులు ప్రాఁజదువులు
దొలువినుకులు ప్రామినుకులు ♦ దొలుపలుకులు ప్రాఁ

బలుకులు *పెనుమినుకులు నా
వెలయుఁ శ్రుతులకును బేళ్లు • (విశ్వాధిపతీ). 41

టీ. తొలుచదువులు, ప్రాఁజదువులు, తొలుమినుకులు, ప్రామినుకులు, తొలుపలుకులు, ప్రాఁబలుకులు (ఈయాఱుపదములకును "ఆదివాక్యము"లని యర్థము.) పెనుమినుకులు = విస్తారవాక్యములు - అను నీ 2 ను వేదములపేర్లు.

క. ఇది దేవవర్గు దీనిం
జదివిన వ్రాసినను వినిన • జనులకు నిత్యా
భ్యుదయంబు లొసఁగుచుండును
వదలక కాశీనివాస•వాసుఁడు పేర్మిన్. 42

టీ. ఈదేవవర్గు నెవరు వ్రాయుచున్నారో, ఎవరు చదువుచున్నారో, ఎవరు వినుచున్నారో, వారికిఁ గాశీవిశ్వేశ్వరుఁడు గరుణించి యెడతెగని సంపద లొసఁగును.

దేవవర్గు సమాప్తము.

---

## మానవవర్గు.

తే. పాఱుఁ డనఁగఁ బుడమివేల్పు • బాఁపఁ డనఁగ
జన్నిగట్టిన విప్రుండు • జగతిఁ బరఁగు
నొడయఁ డేలిక యొకిమీఁడు • పుడమిఱేఁడు
ఱేఁడు దొర సామి యన నొప్పు • నృపతిపేళ్లు.

టీ. పాఱుఁడు, పుడమివేల్పు=భూదేవుఁడు, బాఁపఁడు, జన్నిగట్టు = యజ్ఞోపవీతము ధరించువాఁడు-ఈ 4 ను బ్రాహ్మణునిపేర్లు. ఒడయఁడు, ఏలిక, ఎకిమీఁడు, పుడమిఱేఁడు = భూపాలుఁడు, ఱేఁడు, సామి, [స్వామిశబ్దభవము.] దొర-ఈ 2 ను క్షత్త్రియునికిఁ బేర్లు.

* పెనుఁబలుకులు అని పా.

సీ. కోమట్లు మూఁడవ♦కొలమువాండ్రన బేరు
లన వైశ్యనామము ♦ ల్దనరుఁ గాఁపు
వాండ్రు నా నాలవ♦వాండ్రు నా బలిజెవాం
డ్రనఁ జను శూద్రస♦మాహ్వయములు
వడుగు నా గోఁచిబాఁ♦పఁడు నాఁగ బ్రహ్మచా
రికిఁ బేళ్లు నడచు ధ♦రిత్రియందు
నాలుబిడ్డలు గల♦యతఁ డిలుఱేఁడు గే
స్తన నొప్పుఁ బేళ్లు గృ♦హాధిపతికి
ఆ. నడవిమనికిపట్టు ♦ జడదారి యన వన
వాసి యొప్పు నిల్లు ♦ వాసి తిరుగు
బోడ తపసి కావి♦పుట్టగోఁచులసామి
యన యతీంద్రుఁ డలరు ♦ (నలికనేత్ర.) 2

టీ. కోమట్లు, మూఁడవకొలమువారు, బేరులు-ఈ ౩ను వైశ్యునికిఁ బేళ్లు. కాఁపువాండ్రు, నాలవవాండ్రు, బలిజెవాండ్రు-ఈ ౩ను శూద్రునికిఁ బేళ్లు. వడుగు, గోఁచిబాఁపఁడు - ఈ ౨ను బ్రహ్మచారికిఁ బేర్లు. ఆలుబిడ్డలు గల యతఁడు=పెండ్లాము బిడ్డలు గలవాఁడు, ఇలు ఱేఁడు = ఇంటియజమానుఁడు, గేస్తు, [గృహస్థశబ్దభవము]. ఈ ౩ ను గృహస్థుని పేళ్లు. అడవిమనికిపట్టు=అరణ్యమునం దుండువాఁడు, జడదారి_జడలను ధరించినవాఁడు- ఈ ౨ ను వానప్రస్థునికిఁ బేరులు. ఇల్లువాసి తిరుగు = ఇంటినివిడిచిపెట్టి తిరుగునట్టివాఁడు, బోడ, తపసి, కావిపుట్టగోఁచులసామి = కావిరంగు గలపుట్టగోఁచులను బెట్టుకొనువాఁడు _ ఈ ౪ ను సన్న్యాసికిఁ బేరులు.

సీ. అమ్మ నాఁ దల్లి నా ♦ నవ్వ నాఁ గన్నది
యన మాతృకాఖ్యలా ♦ (నభ్రకేశ)

అబ్బ నాయన యయ్య • యనఁ దండ్రి యన నప్ప
యన జనకాఖ్య లౌ • (నగనివేశ)
తోడఁబుట్టనఁగ సై • దోడు తోఁబుట్టన
సోదరాహ్వయము లౌ • (నాదిదేవ)
భర్తృసహోదరు • భార్యకుఁ దోడికో
డ లన నేరా లన • నలరు (నభవ)
తే. చెలియ లనఁ జెల్లె లనఁగను • వెలయుచుండు
నాహ్వయములు కనిష్ఠక • న్యకు (గిరీశ)
జ్యేష్ఠకన్యకు నాఖ్యలై • తీతిని వెలయు
నప్ప యన నక్క యనఁగఁ (జం • ద్రార్ధమకుట). 3

టీ. అమ్మ, [అంబాశబ్దభవము.] తల్లి, అవ్వ, కన్నది-ఈ ౪ ను మాతకుఁ బేరులు. అబ్బ, నాయన, అయ్య, (ఆర్యశబ్దభవము.) తండ్రి, అప్ప-ఈ ౫ ను తండ్రికిఁ బేళ్లు. తోడఁబుట్టు-పా. తోడఁబుట్టుగు, తోడఁబుట్టువు, సైదోడు, తోఁబుట్టు-పా. తోఁబుట్టువు, తోఁబుట్టుగు-ఈ 3 ను సోదరునికిఁ బేళ్లు. తోడికోడలు=తనతో సమానురాలగుకోడలు, ఏరాలు = అన్యునిభార్య [ఎరవు + ఆలు]. ఈ ౨ ను తోడికోడలికిఁ బేరులు. చెలియలు, చెల్లెలు - ఈ౨ను చిన్న ఆఁడుతోఁబుట్టునకుఁ బేరులు. అప్ప, అక్క-ఈ౨ను పెద్ద యాఁడుతోఁబుట్టువునకుఁ బేరులు.

సీ. ముగ్ధకుఁ బేళ్లగు • ముగుద యనఁగ ముద్ద
రాలు నా గోల నా • బేల యనఁగ
కట్టివాయి యనంగ • గయ్యాళి యన ఱాఁగ
యన ధూర్తసతికి • నాహ్వయము లమరు
నైదువ నాఁగ ము • త్తైదువ నా నయి
దువరాలు నాఁ బుణ్య • యువతి వెలయు

మృతచిరంటికి నాఖ్య • లెసఁగుఁ బేరంటాలు
  నాఁగను జక్కిని • నా ధరిత్రి
తే. గేస్తురా లనునాఖ్యచే • గృహిణి వెలయు
నాలు పెండ్లాము రాణి యిల్లా లనంగ
భార్య దనరును దొత్తన • బానిసె యన
వరవు డన దాసికాఖ్య లౌ • (గరళకంఠ). 4

టీ. ముగుద, [ముగ్ధశబ్దభవము.] ముద్దరాలు [ముద్ద + ఆలు- "షేడాదిశబ్దంబుల కాలుశబ్దంబు పరం బగునపుడు కర్మధారయమందు రుగాగమం బగు" అను బాల. సంధి. 30 సూ. చే'ర్' అని ఆగమము.] గోల, జేల- ఈ ౨ ను బదునాఱుసంవత్సరముల వయస్సుగల పడుచునకుఁ బేరులు. గట్టివాయి = పెద్దగొంతుగలది, గయ్యాళి, ఱాఁగ - ఈ 3 ను ధూర్తస్త్రీకిఁ బేరులు. ఐదువ, ముత్తైదువ, అయిదువరాలు [అయిదువ + ఆలు-అయిదువరాలు = మంగళసూత్రము, పసుపు, కుంకుమము, గాజులు, చెవ్వాకు అను నైదువస్తువులు గలది.] - ఈ 3 ను సుమంగలియగు స్త్రీకిఁ బేరులు. పేరంటాలు, జక్కిని - ఈ ౨ ను మృతినొందిన దీర్ఘసుమంగలిపేర్లు. గేస్తురాలు [గేస్తు+ఆలు.], ఆలు, పెండ్లాము, రాణి, ఇల్లాలు-ఈ ౫ ను భార్యకుఁ బేర్లు. తొత్తు, బానిసె, వరవుడు-ఈ 3 ను దాసికిఁ బేర్లు.

సీ. కన్నియ కన్నె నాఁ • గన్యకుఁ బే ళ్లొప్పు
  జవరాలు కొమరాలు • జవ్వని యనఁ
దనరు యువతి ప్రౌఢ • యన గట్టివయసుది
  యనఁ బ్రౌఢ దాల్చునీ•యాహ్వయములు
ముసలి మిండలకోర • ముప్పదియాతేండ్లు
  చనినది యనుపేళ్ల • నెనయు లోల

ముసలిది ముదుసలి • ముదియ పెద్దన నివి
యాఖ్య లై తనరు వృ•ద్ధాంగనకును
ఆ. చెడిప యంకులాడి • చెడ్డతొయ్యలి వెలి
చవులు గనిన దనంగ • జార దనరు
నిలను విటులదూత • యెడకాఁడు కుంటెన
కాఁ డనంగఁ దనరుఁ • (గరళకంఠ). 5

టీ. కన్నియ, కన్నె-ఈ ౨ ను పెండ్లికానిపడుచుపేరులు. జవరాలు, కొమరాలు, జవ్వని-ఈ 3 ను యౌవనవతికిఁ బేరులు. ప్రౌఢ, [ప్రౌఢశబ్దవికృతి రూపము.] గట్టివయసుది = దిటవైనవయస్సుగలది - ఈ ౨ ను ముప్పదేండ్ల వయస్సుగలదానిపేరులు. ముసలి, మిండలకోర, ముప్పదియేండ్లు చనినది-ఈ 3 ను లోలస్త్రీకిఁ బేరులు. ముసలిది, ముదుసలి, ముదియ, పెద్ద-ఈ ౪ ను వృద్ధాంగనకుఁ బేర్లు. చెడిప, అంకులాడి, చెడ్డతొయ్యలి = చెడుగుణముగలయాఁడుది, వెలిచవులుగనినది = పరపురుషుల వలని పొందు మరగినది-ఈ ౪ ను వ్యభిచారిణికిఁ బేరులు. ఎడకాఁడు, కుంటెనకాఁడు = స్త్రీపురుషులను జేర్చునట్టివాఁడు-ఈ ౨ ను విటునిదూతపేర్లు.

తే. వేల్పుబానిసె వెలయాలు • వేడ్కకత్తె
లంజె భోగముచాన వె•ల్లాటకత్తె
పడుపుఁజెలి యాటచేడియ • గడనకత్తె
నాఁగ నివి వేశ్య కాఖ్యలౌ • (నగనివేశ). 6

టీ. వేల్పుబానిసె = దేవళలపనికత్తె, వెలయాలు=లెక్కమునకు వచ్చెడి భార్య, [వెల+ఆలు=వెలయాలు-బహుళగ్రహణముచే అకారమునకు సంధిలేదు.] వేడ్కకత్తె, [మతుబర్థమునందు పుంవాచక స్త్రీవాచకములకు క్రమముగా కాఁడు కత్తెయలగు. బా.తద్ధి.౧౧ సూ.చే వేడ్కకత్తెయనురూపము.] లంజె, భోగముచాన=అనుభవించుటకైనస్త్రీ, వెల్లాటకత్తె-పా. వెల్లాటకత్తె=ఎక్కువనాట్యముచేయునది, పడుపుఁజెలి = ద్రవ్యసంపాదనము చేసెడిస్త్రీ.

[పడపు+చెలి = (నుగాగమము) పడపుఁజెలి.] ఆటచేడియ = ఆటాడునట్టి యాఁడుది, గడనకత్తె=సంపాదనచేయుస్త్రీ-ఈ ౯ యు బోగముదానిపేర్లు.

ఆ. వెచ్చకాఁడు బోజుఁగు ♦ వేడుకకాఁడు మిం
డండు ననుపుకాఁడు ♦ మిండగీఁడు
లంజెకాఁడు నా ధ♦రం జనుఁ బల్లవ
నామధేయములు (పి♦నాకహస్త). 7

టీ. వెచ్చకాఁడు=ద్రవ్యవ్యయముచేయువాఁడు, బోజుఁగు, వేడుక కాఁడు = సొగసు గలవాఁడు, మిండండు, ననుపుకాఁడు = మెత్తదనము గల వాఁడు, మిండగీఁడు, లంజెకాఁడు=లంజె గలవాఁడు-ఈ౭ను విటునిపేర్లు.

ఆ. కోడెకాఁ డనంగ ♦ గోవాళ్లు నాఁగను
యువజనాఖ్య లొప్పు♦చుండు రెండు
నాగవాస మనఁగ ♦ నామ మౌ వేశ్యాజ
నంబుమేళమునకు ♦ (నంబికేశ). 8

టీ. కోడెకాఁడు=యౌవనవంతుఁడు, గోవాళ్లు=యౌవనము గలవాఁడు, [గోవ+వారలు-గోవాళ్లు. నిత్యబహువచనాంతము.] ఈ౨ను ప్రాయము గలవానికిఁ బేర్లు. నాగవాసము-ఇది వేశ్యాజనకూటమునకుఁ బేరు.

సీ. నెలఁతుక క్రాల్గంటి ♦ పొలఁతుక ముద్దియ
వాలుఁగంటి మగువ ♦ పడఁతి మడఁతి
చెలి మచ్చెకంటి యు♦గ్మలి యింతి తొయ్యలి
నవలా కలువకంటి ♦ నాతి గోతి
పూఁబోఁడి చిగురాకు♦బోఁడి పైదలి మించు
బోఁడి ముద్దులగుమ్మ ♦ పొలఁతి కొమ్మ
ప్రోయాలువిద తీఁగె♦బోఁడి చేడియ యించు
బోఁడి యన్ను వెలంది ♦ బోటి జోటి

తే. చాన తెఱవ వెలందుక • చామ లేమ
చెలువ యెలనాగ చిలుకల•కొలికి కలికి
తలిరుఁబోఁడి యలరుఁబోఁడి • నెలఁత పొల్తి
గరిత యతివ నా స్త్రీసమా•ఖ్యలు (మహేశ). 9

టీ. నెలఁతుక, కాల్గంటి = ప్రకాశించెడి కన్నులు గలది, పొలఁతుక, ముద్దియ, వాలుఁగంటి=వెడల్పు నేత్రములు గలది, మగువ, పడఁతి, మడఁతి, చెలి, మచ్చెకంటి=మీననేత్ర, ఉగ్మలి, ఇంతి, తొయ్యలి, నవలా, కలువకంటి=కలువలంబోలు కన్నులుగలది, నాతి, గోతి, పూఁబోఁడి = పూవువంటిశరీరము గలది, [పూవు+మేనుగలది. బహువ్రీహి స్త్రీవాచ్యంబగుచో సుషమానంబు మీఁదిమేనునకు బోఁడియగు. బా. సమాస. 23సూ.ఇట్టి చిగురుబోఁడి మొదలైనవి. చిగురాకుబోఁడి=చిగురువంటి మేనుగలది, పైదలి, మించుబోఁడి=మెఱుపువలె వెలిఁగెడి స్వరూపముగలది, ముద్దులగుమ్మ=ముద్దులుమూటగట్టునది, పొలఁతి, కొమ్మ, ప్రోయాలు, ఉవిద, తీఁగెబోఁడి=తీఁగెవంటిసన్నని శరీరముగలది, చేడియ, ఇంచుబోఁడి=చెఱకువలెఁ బ్రియమైనశరీరము గలది, అన్ను, వెలఁది, బోటి, జోటి, చాన, తెఱవ, వెలందుక, చామ, లేమ, చెలువ, ఎలనాగ, చిలుకలకొలికి=చిలుకముక్కులవంటి కన్నులకొనలు గలది, కలికి, తలిరుఁబోఁడి = చిగురువలె మెత్తని దేహము గలది, అలరుఁబోఁడి = పూవువంటి మెత్తని దేహము గలది, నెలఁత, పొల్తి, గరిత, అతివ—ఈ ౫౯ యును స్త్రీకిఁ బేర్లు.

తే. చెలిమి నేస్తంబు పొందు నా • స్నేహ మలరు
నెచ్చెలి యనుంగు సంగాతి • నేస్తకాఁడు
సంగడీఁ డనఁ జెలికాఁ డ•నంగఁ దనరు
స్నేహితునకు సమాఖ్యలు • (శ్రీమహేశ). 10

టీ. చెలిమి, నేస్తము, పొందు—ఈ 3 ను స్నేహమునకుఁ బేర్లు. నెచ్చెలి, అనుంగు, సంగాతి, నేస్తకాఁడు, సంగడీఁడు, చెలికాఁడు [మనుష్యపర్యాయాంతములు.] ఈ ౬ ను స్నేహితునికిఁ బేరులు.

సీ. దొంగ తెక్కలికాఁడు ♦ దొరకోలుసన్యాసి
ముచ్చెత్తుబరికాఁడు ♦ ముడియవిడుపు
తెరువాటుకాఁడు క♦త్తెరదొంగ చేవాఁడి
కాఁడు వల్లడికాఁడు ♦ కన్నగాఁడు
మునిముచ్చు గడిదొంగ ♦ యనఁ దస్కరాఖ్యలౌఁ
జెండిపోతు గరాసు ♦ మొండికట్టె
టకటొంకు టాటోటు ♦ టక్కులాడు పిసాళి
టక్కరి ముడికాఁడు ♦ తవళికాఁడు
తే. కల్లరియు గొంటు కైలాట♦కాఁడు చెడుగు
పేరజము కుచ్చితుఁడు దోస♦కారి చెనఁటి
పాలసుఁడు నాలిబూతంబు ♦ పలువ తులువ
కూళ గడు సన వర్తిల్లుఁ ♦ గుజనుపేళ్లు. 11

టీ. దొంగ, తెక్కలికాఁడు = బందిపోటు వేయువాఁడు, దొరకోలు సన్యాసి = వేషము దాల్చి యితరులను నమ్మించి సొమ్మపహరించుకొనిపోవువాఁడు, ముచ్చు, ఎత్తుబరికాఁడు, ముడియవిడుపు = ముడివిచ్చి యెత్తుకొనిపోవువాఁడు, తెరువాటుకాఁడు = దారి యడ్డగించి కొట్టి తీసికొని పోవువాఁడు, కత్తెరదొంగ = కత్తిరించి దొంగిలించువాఁడు, చేవాఁడికాఁడు = చేతిచుఱుకుతనముగలవాఁడు, వల్లడికాఁడు = కొల్ల పెట్టువాఁడు, కన్నగాఁడు = కన్నము వేసి దొంగిలించువాఁడు, మునిముచ్చు = మునివలె మౌనముతో నేమి తెలియనట్లుండువాఁడు, గడిదొంగ = ఆంతర్యము నెఱిఁగినవాఁడు—ఈ ౧౩ ను దొంగకుఁ బేరులు. చెండిపోతు = మూఢబుద్ధి గలవాఁడు, గరాసు, మొండికట్టె, టకటొంకు, టాటోటు, టక్కులాడు = కల్లలాడువాఁడు, పిసాళి, టక్కరి, [మత్వర్థమం దరిప్రత్యయము.] ముడికాఁడు, తవళికాఁడు = మోసము గలవాఁడు, కల్లరి = బొంకులాడువాఁడు, గొంటు, కైలాటకాఁడు = మాయోపాయముల నెఱిఁగినవాఁడు, [కైలాటము + కాఁడు—మువర్ణలోపము.] చెడుగు,

బేరజము, కుచ్చితుఁడు, [కుత్సితశబ్దభవము.] దోసకారి = పాపములు చేయుం వాఁడు, చెనఁటి, పాలసుఁడు, నాలిబూతము, పలువ, తులువ, కూళ, గడుసు—ఈ ౨౪ ను కుత్సితునికిఁ బేర్లు.

ఆ. పాప బుడుత చిఱుత • పట్టి సిసువు కందు
కూన నిసువు బిడ్డ • కుఱ్ఱ బొట్టె
యనఁగ శిశుసమాఖ్య • లగు గొమరుండు నాఁ
గొడుకు నాఁ గుమార•కుండు వెలయు. 12

టీ. పాప, బుడుత, చిఱుత, పట్టి, సిసువు, [శిశుశబ్దభవము] కందు, కూన, నిసువు, బిడ్డ, కుఱ్ఱ, బొట్టె—ఈ ౧౧ ను శిశువునకుఁ బేర్లు. కొమరుఁడు, [కుమారశబ్దభవము.] కొడుకు—ఈ ౩ ను పుత్త్రుని పేళ్లు.

ఆ. వటుసమాఖ్య లగును • వసుధలోఁ గొండిక
వాఁ డనంగఁ బడుచు•వాఁ డనంగఁ
బిన్నవాఁ డనంగఁ • జిన్నవాఁ డనఁగను
(వినుతగుణసనాథ • విశ్వనాథ). 13

టీ. కొండికవాఁడు, బడుచువాఁడు, పిన్నవాఁడు, చిన్నవాఁడు—ఈ ౪ ను బాలునికిఁ బేళ్లు.

సీ. గిటక పొట్టి కుఱుచ • గిట్ట గు జ్జనఁగ వా
మనుఁ దొప్పుఁ జను నప•స్మారి పేళ్లు
వెడఁగు వేఁదుఱు వెఱ్ఱి • వీఱిఁడి వేఱిఁడి
వెంగలి వెంబర•వి త్తనంగ
జతురునకును బేళ్లు • జాణ దంట వలంతి
వెరవరి ప్రోడ నే•ర్పరి యనంగ
ప్రన్ననివాఁడు రూ•పరి చూడఁగలవాఁడు
చక్కనివాఁడు నా • జగతిఁ బరఁగు

తే. సుందరాకారవంతుండు ♦ సొగసుకాఁడు
వన్నెకాఁ డన శృంగారి ♦ వసుధ వెలయు
నంధకుని పేళ్లు చీకు గ్రు ♦ డ్డనఁగ మూఁగ
మూవ యన మూకనామముల్ ♦ (దేవదేవ). 14

టీ. గిటక, పొట్టి, కుఱుచ, గిట్ట, గుజ్జు-ఈ ౫ ను పొట్టివాని పేళ్లు. వెడఁగు, వేఁదుఱు, వెఱ్ఱి, పీఱిఁడి, పేఱిఁడి, వెంగలి, వెంబరవిత్తు-ఈ ౭ ను మూర్ఖునికిఁ బేళ్లు. జాణ, దంట, వలంతి, వెరవరి=[వెరవు+అరి, మత్వర్థమునం దరి యగు.] ఉపాయముగలవాఁడు, ప్రోడ,[ప్రౌఢశబ్దవికృతి.] నేర్పరి=[నేర్పు+అరి - మత్వర్థీయకతద్ధితాంతము.] నేర్పు గలవాఁడు. ఈ ౬ ను సమర్థునికిఁ బేళ్లు. ప్రన్ననివాఁడు, రూపరి [రూపు+అరి] = అందముగలవాఁడు, చూడఁ గలవాఁడు = ఇతరులచేఁ జూడఁదగినవాఁడు, చక్కనివాఁడు - ఈ ౪ ను సౌందర్యవంతునికిఁ బేళ్లు. సొగసుకాఁడు [సొగసు+కాఁడు] = వేడుకగల వాఁడు, వన్నెకాఁడు = వన్నె గలవాఁడు - ఈ ౨ ను సింగారించుకొన్న వానికిఁ బేళ్లు. చీకు, గ్రుడ్డి - ఈ ౨ ను అంధునినామములు. మూఁగ, మూవ-ఈ ౨ ను మూఁగవాని పేళ్లు.

క. కాయము పేళ్లై వెలయును
మే యన నొడ లనఁగ మేను ♦ మెయి యన భోగ్య
ప్రాయము పేళ్లగుఁ బరువము
పాయము జవ్వన మనంగ ♦ (భావజదమనా). 15

టీ. మే, ఒడలు, మేను, మెయి - ఈ ౪ ను శరీరమునకు నామములు. పరువము, పాయము, జవ్వనము[యౌవనశబ్దభవము.]-ఈ ౩ ను యౌవనమునకు నామములు.

తే. నెఱులు కురులు వెండ్రుకలు నా ♦ నెఱిక లనఁగ
కొప్పు తుఱుము మన వేనలి ♦ క్రొవ్వెద యనఁ

గేశధమ్మిల్లములు మించుఁ • గీలుగంటు
క్రొమ్ముడి యనంగఁ గేశబంధ మ్మగు (భవ). 16

టీ. నెఱులు, కురులు, వెండ్రుకలు, నెఱికలు-ఈ ౪ ను కేశముల నామములు. కొప్పు, తుఱుము, వేనలి, క్రొవ్వెద [క్రొత్త+వెద, ఆద్యక్షర శేషంబగు క్రొత్తశబ్దమునకుఁ బర మగుపరుషసరళస్థిరములకు ద్విత్వము గలుగును.]-ఈ ౪ ను స్త్రీలకొప్పునకుఁ బేళ్లు. కీలుగంటు, క్రొమ్ముడి [క్రొత్త+ముడి—చూ-క్రొవ్వెద]-ఈ ౨ ను వెండ్రుకలముడికిఁ బేళ్లు.

తే. నొసలు నెన్నొసల్ నుదురు నెన్నుదు రనంగఁ
దనరు ఫాలంబు చూడ్కి చూ • పనఁగ నొప్పు
నాహ్వయము లీక్షణమునకు • నక్షికాఖ్య
లలరుఁ గ‌ఁ గను కన్ను నా • (నభ్రకేశ). 17

టీ. నొసలు, నెన్నొసలు, నుదురు, నెన్నుదురు-ఇవి ౪ ను ఫాలభాగమునకుఁ బేళ్లు. చూడికి. ప. చూడ్కి, [చూచుధాతుపుకృదం.] చూపు ఈ ౨ ను చూచుటకుఁ బేళ్లు. కఁ, కను, కన్ను-ఈ 3 ను నేత్రములకుఁ బేళ్లు.

క. వీను లనఁ జెవు లనంగా
జానుగు లన నాహ్వయములు • శ్రవణంబులకుఁ
గౌ నన నడు మనఁగా నభి
ధానము లగు మధ్యమునకుఁ • (దరుణేందుధరా). 18

టీ. వీను, చెవి, జానుగు-ఈ 3 ను చెవులకునామములు. కౌను, నడుము-ఈ ౨ ను నడుమునకుఁ బేళ్లు.

తే. అక్కు ఱొమ్మెద బోర నా • నలరు వక్ష
మాస్యమున కొప్పుచుండు నాఖ్యలు మొగంబు
మోర మో మనఁ బే ళ్లొప్పు • నూరువునకుఁ
బెందొడ యనంగఁ గుఱువు నా • (నందివాహా). 19

టీ. అక్కు, ఱొమ్ము, ఎద, [హృదయము-వికృ. ఎద.] బోర-ఈ ౪ ను వక్షస్థలమునకుఁ బేళ్లు. మొగంబు, [ముఖశబ్దభవము] మోర, మోము [ముఖము-వికృ. మోము]-ఈ ౩ ను ముఖమునకుఁ బేరులు. పెందొడ, కుఱువు-ఈ ౨ ను ఊరువునకు నామములు.

తే. వదనగుహ యొప్పు నోరు నా • వాయి యనఁగఁ
బల్లు పలు నాఁగ దంతంబు•పేళ్లు వెలయుఁ
బెదవి వాతెఱ మోవి య•న్పేళ్లఁ దనరు
చుండు నోష్ఠంబు (శీతాంశు•ఖండమౌళి). 20

టీ. నోరు, వాయి - ఈ ౨ ను నోటిరంధ్రమునకుఁ బేరులు. పల్లు పలు-ఈ ౨ ను దంతనామములు. పెదవి, వాతెఱ, మోవి - ఈ ౩ ను ఓష్ఠమునకు నామములు.

క. కయి యనఁ గై నాఁ గే లనఁ
జెయి యనఁ జై నాఁగఁ జెయ్యి • చే నా హస్తా
హ్వాయము లగు (సన్నపూర్ణా
ప్రియవల్లభ కాశికాపు•రీవరనిలయా). 21

టీ. కయి, కై, కేలు, [కేలు-నిత్యైకవచనాంతము.] చెయి, చై, చెయ్యి, చే-ఈ ౭ ను హస్తములు.

క. ఎద యన డెందం బనఁగా
మది యనఁగా నెడఁ దనంగ • మఱి యుల్లము నా
హృదయమునకు నివి యొసఁగును
విదితంబుగ నాహ్వాయములు • (విశ్వాధిపతీ). 22

టీ. ఎద, డెందము, మది, [మతిశబ్దభవము.] ఎడఁద-పా. ఎడ, [హృదయశబ్దభవము.] ఉల్లము-ఈ ౫ ను మనస్సునకుఁ బేర్లు.

క. లోఁజె య్యన నఱచె య్యనఁ
గాఁ జెల్లును బేళ్లు రెండు♦కరతలమునకున్
మీఁజె య్యన వెడచెయ్యియు
నాఁ జనుఁ గరచరమభాగ♦నామములు (శివా). 23

టీ. లోఁజెయ్యి = చేతియొక్క లోపలిభాగము, అఱచెయ్యి= లోపలి చెయ్యి-ఈ ౨ ను అఱచేతికిఁ బేరులు. మీఁజెయ్యి = చేతియొక్క మీఁదిభాగము, (మీఁదు+చెయ్యి = మీఁజెయ్యి) వెడచెయ్యి= చేతికి వెనుకటిభాగము-ఈ ౨ ను హస్తముయొక్క వెనుకటిభాగమునకుఁ బేరులు.

ఆ. పొట్ట డొక్క కడుపు ♦ బొజ్జ బొఱ్ఱ యనంగ
నొప్పుచుండు నాఖ్య ♦ లుదరమునకు
నాభిబిలమునకును ♦ నామధేయము లగు
బొడ్డు నాఁగ మఱియుఁ ♦ బొక్కిలనఁగ. 24

టీ. పొట్ట, డొక్క, కడుపు, బొజ్జ, బొఱ్ఱ-ఈ ౫ ను ఉదరమునకుఁ బేళ్లు. బొడ్డు, పొక్కిలి-ఈ ౨ ను నాభికిఁ బేళ్లు

తే. వె న్ననంగను వీఁపు నా ♦ వెనుకమేను
నాఁగఁ జరమాంగమున కొప్పు ♦ నామములుగఁ
బుఱ్ఱె తలపాల నాఁ బున్క ♦ పుఱియ నాఁ గ
పాలమున కాఖ్య లై యొప్పు ♦ (ఫాలనేత్ర). 25

టీ. వెన్ను, వీఁపు, వెనుకమేను = శరీరముయొక్క వెనుకటి భాగము-ఈ 3 ను వీఁపునకుఁ బేరులు. పుఱ్ఱె, తలపాల, పునుక, పుఱియ - ఈ ౪ ను కపాలమునకుఁ బేళ్ళు.

క. అడు గంజ హొజ్జ యనఁగాఁ
బుడమిఁ బదంబునకు నామ♦ములు విలసిల్లున్

మెడ కుత్తు కట్టు గొం తన
నడరు గళంబునకుఁ జే (ళ్లనంగధ్వంసీ). 26

టీ. అడుగు, అంజ, హజ్జ-ఈ 3 ను పాదమునకుఁ బేర్లు మెడ, కుత్తుక, అట్టు, గొంతు-ఈ 4 ను గొంతునకుఁ బేర్లు.

ఆ. బువ్వ వంటకంబు ♦ బోనంబు మెతుకు కూ
డోగిరము పసాద ♦ మోరె మనఁగ
నన్న మొప్పుఁ జేల ♦ మలరుఁ బుట్టంబు దు
వ్వలువ చీర కోక ♦ వలువ యనఁగ. 27

టీ. బువ్వ, వంటకము, బోనము, మెతుకు, కూడు, ఓగిరము, పసాదము, ఓరెము-ఈ 8 యును అన్నమునకు నామములు. పుట్టము, దువ్వలువ, చీర-పా. చీరె, కోక, వలువ-ఈ 6 ను వస్త్రమునకు నామములు.

తే. మెసవె నారోగిణ మొనర్చె ♦ మెక్కెఁ దినియెఁ
గుడిచె నారగించెను బసా♦పడియె నమలె
సాపడె ననంగ నొప్పు భో♦జనము సేసె
ననుట కివి యాఖ్యలై (యాశ ♦ యభ్రకేశ). 28

టీ. మెసవెను-పా. మెసఁగెను, ఆరోగిణ మొనర్చెను-పా. ఆరోగణ మొనర్చెను, మెక్కెను, తినియెను, కుడిచెను, ఆరగించెను, పసాపడియెను, నమలెను, సాపడెను-ఈ 10 యును భోజనము చేసె ననుటకుఁ బేరులు.

క. నాన యన సిగ్గు సిబ్బితి
నా నివి వ్రీడాపదంబు ♦ నామంబు లగుం
బానము సేయుటపే ళ్లగు
నానుట త్రావు టనఁ ద్రాగు ♦ టనఁ గ్రోలు టనన్. 29

టీ. నాన, సిగ్గు, సిబ్బితి-ఈ 3 ను లజ్జకుఁ బేరులు. ఆనుట, త్రాగుట, త్రావుట, క్రోలుట [ఈనాలుగును భావార్థకములు.] ఈ 4 ను మద్యాది ద్రవద్రవ్యములఁ బానము సేయుటకుఁ బేరులు.

ఆ. తళియ పళ్లెరంబు ♦ తెలె హారివాణంబు
తట్టి కంచ మనఁగఁ ♦ దనరుఁ బాత్ర
చెల్లుఁ జషకమునకుఁ ♦ బేళ్లు డబ్బుర కోర
గిన్నె యనఁగ (రజత♦గిరినివాస). 30

టీ. తళియ, పళ్లెరము, తెలె, హారివాణము, తట్టి, కంచము - ఈ ౬ ను భోజనపాత్రమునకుఁ బేరులు. డబ్బుర, కోర, గిన్నె-ఈ 3 ను పానపాత్రమునకుఁ బేరులు.

తే. నతికిఁ బేళ్లొప్పు జోత దం♦డము జోహారు
మ్రొక్కు జేజే యనంగఁ గేల్♦మొగిచెఁ గొలిచె
నెఱఁగెఁ జేమోడ్చె నన నమ♦స్కృతి యొనర్చె
ననుట కివి యాఖ్య లగు (నీశ ♦ యభ్రకేశ). 31

టీ. జోత, దండము, జోహారు, మ్రొక్కు, జేజే-ఈ ౫ను నమస్కారమునకుఁ బేరులు. కేల్మోగిచెన్=చేతులు జోడించెను, కొలిచెను, ఎఱఁగెన్-పా. ఎరఁగెన్, చేమోడ్చెను=చేతులు జోడించెను-ఈ ౪ ను నమస్కారము చేసె ననుటకుఁ బేరులు.

తే. ఒప్పు శయనించుటకును బ♦న్నుండెఁ బండెఁ
బవ్వడించెఁ బరుండెను ♦ బవ్వళించె
నత్తమిల్లె నన న్మఱి ♦ మెత్త సెజ్జ
పఱుపు పా న్పనఁ దగు శయ్య ♦ (ఫాలనేత్ర). 32

టీ. పన్నుండెను, పండెను, పవ్వడించెను, పరుండెను, పవ్వళించెను, అత్తమిల్లెను-ఈ ౬ ను శయనించె ననుటకుఁ బేళ్లు. మెత్త, సెజ్జ, [శయ్యా-వికృ. సెజ్జ.] పఱుపు, పాన్పు-ఈ ౪ ను శయ్యకుఁ బేరులు.

తే. ఒప్పు ధ్వనిపేళ్లు రొద యన ♦ నులివు నాఁగ
స ద్దనంగను గూఁత నాఁ ♦ జప్పు డనఁగ

నలుకు డన రోదనము సేసె ♦ ననుట కాఖ్య
లెసఁగు నఱచెను వాపోయె ♦ నేడ్చె ననఁగ. 33

టీ. రొద, ఉలివు, సద్దు, [శబ్దశబ్దవికృతి.] కూఁత, చప్పుడు, అలుకుడు-ఈ ౬ ను శబ్దమునకుఁ బేరులు. అఱచెను, వాపోయెను, ఏడ్చెను-ఈ 3 ను రోదనము చేసె ననుటకుఁ బేరులు.

క. అగుఁ బేళ్లు నీరువట్టన
దగ దప్పియు దూప యనఁగ ♦ దాహంబునకున్
నగవు నగు నవ్వు నవు నా
నగు నాఖ్యలు హాసమునకు ♦ (నగజాధీశా). 34

టీ. నీరువట్టు, దగ, దప్పి, దూప-ఈ ౪ ను దాహమునకుఁ బేరులు. నగవు, నగు, నవ్వు, నవు - ఈ ౪ ను హాసమునకుఁ బేరులు.

క. చాగము నాఁ బుడుకు కనఁగా
నీగి యనఁగ నిడుట యనఁగ ♦ నీవి యనంగాఁ
దేగము నాఁ బెట్టుడు నాఁ
ద్యాగమునకు నాఖ్య లగుచు ♦ ధరఁ బరఁగు (శివా).35

టీ. చాగము, పుడుకు, ఈగి, [ఇచ్చుధా. కృ.] ఇడుట, [ఇచ్చుధా. భావార్థకము.] ఈవి, తేగము, [త్యాగశబ్దభవము.] పెట్టుడు-ఈ ౭ ను దానమునకుఁ బేరులు.

ఆ. ఎలసె బెరసె హత్తె ♦ నెనసె నదికెఁ జెందె
బొందె దొరసెఁ గూడె ♦ నొందె చెనకె
ననఁగ సక్తమయ్యె ♦ ననుటకు నివి యాఖ్య
లగు (గిరిశ యీశ ♦ యభ్రకేశ). 36

టీ. ఎలసెన్, బెరసెన్, హత్తెన్, ఎనసెన్, అదికెన్, చెందెన్, పొందెన్, దొరసెన్, కూడెన్, ఒందెన్, చెనకెన్-ఈ ౧౧ ను కలిసికొనె ననుటకుఁ బేర్లు.

ఆ. ఎడసెఁ బాసె వేఱు•పడెఁ బురివిచ్చె నా
నలరు భేద మయ్యె • ననుట పేళ్లు
స్వవశ మయ్యె ననుట • కవుఁ బేళ్లు లోనయ్యె
నగ్గమయ్యె ననఁగ • (ససమనేత్ర). 37

టీ. ఎడసెన్, పాసెన్, వేఱుపడెన్, పురివిచ్చెన్-ఈ ౪ ను వియోగమయ్యె ననుటకుఁ బేరులు. లోనయ్యెన్, అగ్గమయ్యెన్-ఈ ౨ ను స్వాధీనపడె ననుటకుఁ బేళ్లు.

ఆ. అగు గృహీత మయ్యె • ననుటకుఁ బేళ్లగ
పడియెఁ జేపడియెను • బట్టువడియెఁ
జిక్కువడియెఁ దగిలెఁ • జిక్కెఁ దగుల్పడె
ననఁగ (నగనివేశ • యభ్రకేశ). 38

టీ. అగపడియెన్ (అగ్గము+పడియెను)=అధీన మయ్యెను, చేపడియెను(చే+పడియెను) = చేతఁజిక్కెను, పట్టువడియెను=పట్టుచిక్కెను, చిక్కువడియెను, తగిలెను, చిక్కెను, తగుల్పడెను-ఈ ౭ యును గృహీతమయ్యె ననుటకుఁ బేరులు.

తే. అనియె నొడివె వక్కాణించె • నాడెఁ జెప్పె
వినిచె వాక్రుచ్చెఁ బలికె నాఁ • జను వచించె
ననుట కాలించె నాలకిం•చెను వినె నన
నలరు నవధరించె నటంట • కాఖ్య (లీల). 39

టీ. అనియెను, నొడివెను, వక్కాణించెను, ఆడెను, చెప్పెను, వినిచెను, వాక్రుచ్చెను, పలికెను-ఈ ౮ యును చెప్పె ననుటకుఁ బర్యాయములు. ఆలించెను, ఆలకించెను, వినెను-ఈ 3 ను అవధరించె ననుటకుఁ బేరులు.

క. కనియెను చూచెను కాంచెను
కనుఁగొనెఁ గన్గొనె ననంగఁ • గలయవి పేళ్లై

చను వీక్షించె నటంటకు
(ఘనతరగోరాజగమన ♦ కాయిజదమనా). 40

టీ. కనియెను, చూచెను, కాంచెను, కనుఁగొనెను, కన్గొనెను—ఈ ౫ ను దర్శించె ననుటకుఁ బేర్లు.

క. చనుఁ గృతగమనుఁడ నయ్యెద
ననుటకు గామంబు లగుచు ♦ నవని నరిగెదఁ
జనియెదఁ బోయెద నేగెద
పనివినియెద ననెడునట్టి ♦ పలుకులు (రుద్రా). 41

టీ. అరిగెను, చనియెను, పోయెను, ఏగెను, పనివినియెను—ఈ ౫ ను బయలుదేఱె ననుటకుఁ బేర్లు.

ఆ. ద్విగుణమున కభిఖ్య ♦ లగు నిబ్బ డిమ్మడి
జంట దంట దుగయు ♦ జమిలి రెట్టి
యినుమడి యన మిథున♦మున కాఖ్య లగు జోడు
దోయి కవ యనంగ ♦ (ధూతకలుష). 42

టీ. ఇబ్బడి, ఇమ్మడి, జంట, దంట, దుగ, జమిలి, రెట్టి—పా. రెంట, ఇనుమడి—ఈ ౯ యు రెండింతలకుఁ బేర్లు. జోడు, దోయి, కవ—ఈ 3 ను మిథునమునకుఁ బేర్లు.

సీ. ఒం డొక్కఁ డొకటి యొ♦క్కొండన నగు నేక
మీరు రెండిరు నాఁగ ♦ నెసఁగు ద్వయము
తిగ మూఁడు మూ ర్నాఁగఁ ♦ దగు త్రయి తీవంచ
నలు నాల్గు చౌ యన ♦ నగుఁ జతుష్క
మెసఁగుఁ జౌవంచ రైు ♦ దే ననఁ బంచకం
బా ఆఱిరుమూఁ డిత్రి ♦ గనఁగ నొప్పు

షట్కంబు ఋషిసంఖ్య ♦ సత చక్కపగడ యే
డన నొప్పు సప్తసం♦ఖ్యకును బేళ్లు
తే. దనరు నిరునాలు గెనిమిది ♦ దచ్చి యనఁగఁ
బరఁగు నీరాలు పండ్రెండు ♦ బార యనఁగ
ద్వాదశమునకు నాఖ్యలు ♦ ధరణియందు
(వినుతకరుణాసనాథ శ్రీ♦విశ్వనాథ). 43

టీ. ఒండు, ఒక్కఁడు, ఒకటి, ఒక్కండు-ఈ ౪ ను ఏకసంఖ్యకు నామములు. ఈరు, రెండు, ఇరు-ఈ 3 ను ద్వయమునకుఁ బేరులు. తిగ, మూఁడు, మూరు-త్రితయమునకుఁ బేర్లు. తీపంచ = మూఁడునొక్కటియుం, నలు, నాలుగు, చౌ - ఈ ౪ ను నాలుగునకుఁ బేర్లు. చౌపంచ = నాలుగు నొక్కటియుం, ఐదు-రూ. అయిదు, ఏను-ఈ 3ను పంచసంఖ్యానామములు. ఆఱు, ఇరుమూఁడు=రెండుమూఁడులు, ఇత్తిగ=(ఇరు+తిగ=ఇత్తిగ) రెండుమూఁడులు-ఈ 3 ను షట్సంఖ్యానామములు. సత (సప్తశబ్దభవము.) చక్కపగడ=ఆఱునొకటియుం, ఏడు-ఈ 3 ను సప్తసంఖ్యకుఁ బేరులు. ఇరు నాలుగు=రెండునాలుగు, ఎనిమిది, దచ్చి-ఈ 3 ను అష్టసంఖ్యకుఁ బేరులు. ఈరాఱు=రెండాఱులు, పండ్రెండు, బార - ఈ 3 ను ద్వాదశసంఖ్యకుఁ బేరులు.

తే. జరిగె నూడెను జాఱెను ♦ నుఱికె వెళ్లెఁ
బాఱెఁ బఱచెను దొలఁగె న♦ప్పలుకు లెల్ల
నవనిలోనఁ బలాయితం ♦ డయ్యె ననుట
కాఖ్యలై యొప్పుఁ (జంద్రరే♦ఖావతంస). 44

టీ. జరిగెను, ఊడెను, జాఱెను, ఉఱికెను, వెళ్లెను, పాఱెను, బఱచెను, తొలఁగెను-ఈ ౮ యుం బరుగెత్తె ననుటకుఁ బేర్లు.

క. వేంచేసెను వచ్చెం జను
దెంచెను విచ్చేసె నరుగు♦దెంచె ననఁగ నె

తెంచె నన నయ్యె నాగతుఁ
డంచుం బలుకుటకు నాఖ్య • (లంబరకేశా). 45

టీ. వేంచేసెను, వచ్చెను, చనుదెంచెను (చను+తెంచెను), విచ్చేసెను, అరుగుదెంచెను = రూ. అరుదెంచెను, ఏతెంచెను-పా. ఏగుదెంచెను-ఈ౭ను ఆగతుఁడయ్యెననుటకుఁ బేర్లు.

తే. నాఁటిసుత నాఁటినుండియు • నాఁటఁగోలె
నాఁటఁబట్టి నాఁడుమొదలు • నాఁగ నాహ్వ
యమ్ము లయ్యెఁ దదారభ్య • యనుట కవని
(వినుతకరుణాసనాథ శ్రీ•విశ్వనాథ). 46

టీ. నాఁటిసుత, నాఁటినుండి, నాఁటఁగోలె, నాఁటఁబట్టి, నాఁడుమొదలు-ఈ౫ను, అదిమొదలు=ఆదినమునుండి యనుటకుఁ బేర్లు.

తే. వైరమునకును ధర సమా•హ్వయము లమరుఁ
గంటు పగ మచ్చరంబు సూ • డొంటమి యన
వలపు కూరిమి మేలు నా • నలరుఁ బేళ్లు
మోహమునకును (శారదాం•బుదనిభాంగ). 47

టీ. కంటు, పగ, మచ్చరము, (మత్సరశబ్దభవము.) సూడు, ఒంటమి-ఈ౫ను విరోధమునకుఁ బేర్లు. వలపు, (వలచుధాతువు కృదంతము.) కూరిమి-రూ. కూర్మి, మేలు-ఈ౩ను మోహమునకుఁ బేర్లు.

క. పెనఁకువ జగడము కయ్యం
బని బవరము కలను చివ్వ • యాలము పోట్లా
టన దురము పోరు నాఁగాఁ
జను యుద్ధంబునకుఁ బేళ్లు • (చంద్రార్ధధరా) 48

టీ. పెనఁకువ, (పెనఁగు-కృదం.) జగడము, కయ్యము, (కలహశబ్దభవము.) అని, బవరము, కలను, చివ్వ, ఆలము, పోట్లాట, (పోట్లాడు-కృదం.) దురము, పోరు-ఈ ౧౧ ను యుద్ధమునకుఁ బేరులు.

ఆ. సదమదంబు సేసెఁ ♦ జక్కాడె నుగ్గాడె
జదిపెఁ బీఁచమడఁచెఁ ♦ జంపెఁ గెడపె
నుఱుముసేసెఁ ద్రుంచెఁ ♦ బరిమార్చెఁ దెగటార్చె
మన్నిగొనియెఁ దునిమె ♦ మడిపె ననఁగ. 49

తే. హతము గావించె ననుటకు ♦ నాఖ్య లయ్యె
మనిపె నేలెను బ్రతికించె ♦ మంచెఁ బ్రోచె
సాఁకె నన నొప్పు నాఖ్యలు ♦ సరవితోడ
నరయఁ బోషించె ననుటకు ♦ (నంబికేశ). 50

టీ. సదమదంబు సేసె, చక్కాడె, నుగ్గాడెన్, చదిపెన్, పీఁచమడఁచెను, చంపెన్, కెడపెన్, నుఱుముచేసెన్, త్రుంచెన్, తెగటార్చెను, మన్నిగొనియెన్, తునిమెను, మడిపెను - ఈ ౧౪ ను సంహరించెననుటకుఁ బేళ్లు. మనిపెను, ఏలెను, బ్రతికించెను, మంచెను, ప్రోచెను, సాఁకెను-ఈ ౬ ను రక్షించెననుటకుఁ బేళ్ళు.

క. ధరలోఁ శూరాహ్వయములు
పరఁగున్ మొనకాఁ డనంగ ♦ బంటనఁగాఁ బో
టరి యన వడిగలవాఁ డన
బిరు దన వాఁడిమగఁ డనఁగ ♦ (భీమకపర్ది). 51

టీ. మొనకాఁడు, బంటు, [భటశబ్దభవము.] పోటరి[పోటు+అరి]=శౌర్యము గలవాఁడు, [మత్వర్థమందు 'అరి' యగు.] వడిగలవాఁడు, బిరుదు, వాఁడిమగఁడు-ఈ ౬ ను శూరునికిఁ బేళ్ళు.

తే. బాసట యనంగఁ దోడ్పాటు • నా సమాహ్వ
యంబు లగుచుండు రెండు సా•హాయ్యమునకు
నాఖ్యలు శుభంబునకును ల • గ్గనఁగ బా గ
నంగ మే లన లెస్స య•నంగ (నీశ). 52

టీ. బాసట, తోడ్పాటు-ఈ ౨ ను సాహాయ్యమునకుఁ బేళ్లు. లగ్గు, బాగు, మేలు, లెస్స-ఈ ౪ ను క్షేమమునకుఁ బేళ్లు.

ఆ. కూలె నీల్గెఁ జచ్చెఁ • గాలంబు సేసెను
గెడసె సమసె నాఱె • మడిసెఁ జెల్లెఁ
బెద్దనిదురవోయె • బిద్దె దోరెను గంతు
గొనియె ననుట పే ళ్ల•గును మృతునకు. 53

టీ. కూలెను, నీల్గెను, చచ్చెను, కాలంబు చేసెను, కెడసెను, సమసెను, ఆఱెను, మడిసెను, చెల్లెను, పెద్దనిదురపోయెను, బిద్దెను, దోరెను, గంతు గొనియెను-ఈ ౧౩ ను మృతినొందె ననుటకుఁ బేరులు.

సీ. తిమ్మనైనది యనఁ • దిన్ననైనది యన
జానైన దనఁగ బా•గైన దనఁగ
నాణెమైన దన వి•న్నాణమైనది యన
మానైన దనఁగ లె•స్సైన దనఁగ
బిన్ననైనది యనఁ • జెన్నైన దన్న నలు
వైనది యనఁగఁ జె•లువైన దనఁగఁ
బొనరినయది యన • నొనరిన దనఁగఁ జొ
క్కటమైన దనఁగ జ•క్కని దనంగ
సొబగైన దనఁగను • సొంపైన దనఁ గోమ
లైనది యన గొన•బైన దనఁగఁ

దోరమైన దన సిం♦గారమైనది యన
మేలైన దనఁగ ♦ మెచ్చైన దనఁగ

తే. మురువుగలయది యొప్పైన ♦ దొఱపుగలది
యందమైనది తనరిన ♦ దలరినట్టి
దనఁగఁ బరఁగిన దనఁ బేళ్లు ♦ తనరుచుండు
మంజులంబైన దనుటకు ♦ (మదనదమన). 54

టీ. తిమ్మనైనది, తిన్ననైనది, జాణైనది, బాగైనది, సాణెమైనది, విన్నాణమైనది, మానైనది, లెస్సైనది, పిన్ననైనది, చెన్నైనది, నలువైనది, చెలువైనది, పొనరినయది, ఒనరినది, చొక్కటమైనది, చక్కనిది, సొబగైనది, సొంపైనది, కొమరైనది, గొనబైనది, తోరమైనది, సింగారమైనది, మేలైనది, మెచ్చైనది, మురువుగలయది, ఒప్పైనది, ఒఱపుగలది, అందమైనది, తనరినది, అలరినట్టిది, పరఁగినది-ఈ ౩౧ యూ సౌందర్యము గలదానికిఁ బేరులు.

తే. కపుర మనఁ గప్పురం బనఁ ♦ గప్ర మనఁగఁ
బుడమిఁ గర్పూర మొప్పుఁ దాం♦బూల మొప్పు
వీడియము వక్కలాకులు ♦ విడెను తమ్మ
లంబు వీడెంబు వీడ్య మ♦నం (బురారి). 55

టీ. కపురము, కప్పురము, కప్రము-ఈ ౩ ను కర్పూరమునకుఁ బేళ్లు. వీడియము-రూ. విడియము, వక్కలాకులు, విడెము, తమ్మలము, వీడెంబు, వీడ్యము-ఈ ౬ ను తాంబూలమునకుఁ బేరులు.

తే. వెలయుచుండును సిరి లచ్చి ♦ కలిమి యనెడు
పేళ్ల సంపద యొద్దడి ♦ పేదతికము
లేమి నిప్పచ్చరము నెవ్వ ♦ లేమి డనఁగ
నలరు దారిద్ర్యమునకు నా♦ఖ్యలు (గిరీశ). 56

టీ. సిరి, [శ్రీశబ్దభవము.] లచ్చి, కలిమి-ఈ 3 ను సంపదకుఁ బేరులు. ఎద్దడి, పేదఱికము, లేమి, నిప్పచ్చరము, నెవ్వ, లేమిడి-ఈ ౬ ను దారిద్ర్యమునకుఁ బేరులు.

తే. మగతనం బన గం డన ♦ మగఁటిమి యనఁ
బౌరుషంబున కాఖ్య లై ♦ పరఁగుచుండు
నుక్కు చేగ దిటము చేవ ♦ యుదుటు గట్టి
దిట్ట ముఱిది బిగువు నాఁగ ♦ ధృతికిఁ బేళ్లు. 57

టీ. మగతనము, గండు, మగఁటిమి-ఈ 3 ను బౌరుషమునకుఁ బేరులు. ఉక్కు, చేగ, దిటము, చేవ, ఉదుటు, గట్టి, దిట్టము, ఉఱిది, బిగువు-ఈ ౯ యుం ధైర్యమునకుఁ బేరులు.

తే. బద్దు నా బొంకు నాఁగ ద♦బ్బర యనంగఁ
గల్ల నాఁగ హుళిక్కి నాఁ ♦ జెల్లుఁ బేళ్లు
ధర నసత్యమునకును స♦త్యంబు పరఁగు
నిజ మనఁగ నిక్కువం బన ♦ నిక్క మనఁగ. 58

టీ. బద్దు, బొంకు, దబ్బర, కల్ల, హుళిక్కి-ఈ ౫ ను అసత్యమునకుఁ బేరులు. నిజము, నిక్కువము, నిక్కము-ఈ 3 ను సత్యమునకుఁ బేరులు.

క. బెడఁద దెస చేటు చేడ్పా
డ్గొడ వాత్రం బంగలార్పు ♦ గోరంబు దొసం
గిడుమ వెత కస్తి యంగద
కడగం డ్లనఁ జను విపత్తు ♦ (గౌరీరమణా). 59

టీ. బెడఁద, దెస, చేటు, చేడ్పాటు, గొడవ, ఆత్రము, అంగలార్పు, [అంగలార్చుధా. కృ.] గోరము, [ఘోరశబ్దభవము]దొసంగు,ఇడుమ, వెత, కస్తి, అంగద, కడగండ్లు [ఈశబ్దము నిత్యబహువచనాంతము.] - ఈ ౧౪ ను ఆపదకుఁ బేరులు.

క. వెల జట్టి విలువ రో యనఁ
గలనుడువులు దనరుచుండుఁ • గ్రయనామము లౌ
వెలయంగ వంగసము నాఁ
గొల మన వంగడము నాఁగఁ • గులమొప్పు (శివా). 60

టీ. వెల, జట్టి, విలువ, రో [రై గ్లౌ శబ్దముల కోత్వంబు విభాషనగు. బా. తత్స. సూ. 64.] ఈ ४ ను క్రయమునకుఁ బేరులు. వంగసము, కొలము, [ప్రకృతి-కులము.] వంగడము - [ఇదియు, వంగసమును వంశశబ్దభవములు.] ఈ 3 ను కులమునకుఁ బేరులు.

క. క్రమ్మఱ నెప్పటి వెండియుఁ
గ్రమ్మఱి తిరుగన్ మఱిన్ మ•రల మగుడను నా
నిమ్మహిఁ బునగిపదంబున
కిమ్ముల నివి యాఖ్య లగు (మ•హీధరచాపా). 61

టీ. క్రమ్మఱన్, నెప్పటి, వెండియున్, క్రమ్మఱి, తిరుగన్, మఱి, మరలను, మగుడను-ఈ ౮ యుం ఇంకను అనునర్థము గలవి.

క. ఒకమరి యొకపరి యొకమా
టొకసా రొకతేప యనఁగ • నొకపా రనఁగా
నొకవిడుత యొక్కతూ కన
నొకతడవ యనంగ మఱియు • నొకతూరి యనన్. 62

తే. ఏకవారం బనుట కొప్పు • నిన్ని పేళ్లు
జగతిఁ బల్మాఱు వేమాఱు • సారె పెక్కు
మాఱు లెన్నేనిమా ర్లనఁ • బరఁగు నాఖ్య
లగుచు నివి బహువారంబు • లనుట (కీశ). 63

టీ. ఒకమరి, ఒకపరి, ఒకమాటు, ఒకసారి, ఒకతేప, ఒకసారి, ఒకవిడుత, ఒకతూకు, ఒకతడవ, ఒకతూరి - ఈ ౧౦ యుం ఏకపర్యాయమను

టకుఁ బేరులు. పల్మాఱు - రూ. పలుమఱు, పలుమాఱు, వేమాఱు, సారె, పెక్కుమాఱులు, ఎన్నేనిమాఱులు - ఈ ౫ ను మాటిమాటికి ననుటకుఁ బర్యాయములు.

తే. త్వరితమున గొప్పఁ బెళ్లు చె♦చ్చెరను సరగ
వేగిరము వేగ వేళము ♦ వెసను వడిగ
గ్రక్కునను గ్రద్దన ననంగఁ ♦ గ్రన్న ననఁగ
గొబ్బునను దిగ్గున ననంగఁ ♦ (గుధరచాప). 64

టీ. చెచ్చెర, (చెర+చెర=చెచ్చెర) సరగ, వేగిరము, వేగ, వేళము, వెసన్, వడిగన్, గ్రక్కునన్, గ్రద్దనన్, క్రన్నన, గొబ్బునను, దిగ్గనన్ - ఈ ౧౨ ను శీఘ్రముగా ననుటకుఁ బేరులు.

క. కలవు వివరింపఁగా నా
ఖ్యలు వరుసన్ నిర్గమించె ♦ ననుటకు ధరలో
వెలువడియె వెళ్లె వెడలెను
వెలలె ననం (జిత్ప్రికాశ ♦ విశ్వాధిపతీ). 65

టీ. వెలువడియెను, వెళ్లెను, వెడలెను, వెలలెను_ఈ ౪ ను పయనమయ్యెననుటకుఁ బేరులు.

క. వినుతి యొనరించె ననుటకుఁ
దనరున్ నామంబు లగుచు ♦ ధరపై నగ్గిం
చెను కైవారము సేసెన్
గొనియాడెను బొగడె ననఁగఁ ♦ గొండాడె ననన్. 66

టీ. అగ్గించెను, కైవారముసేసెను=స్తోత్రముచేసెను, కొనియాడెను, పొగడెను, కొండాడెను-ఈ ౫ ను స్తోత్రముచేసెననుటకు నామములు.

సీ. చుట్టలు విందులు ♦ చుట్టాలు బందుగు
లనఁ జను బంధుస♦మాహ్వయములు

వఱలు నన్యుఁడు లాతి • వాఁ డనఁగా వింత
వాఁ డనఁగాఁ బెఱ • వాఁ డనంగ
వ్యాజంబునకు నామ • మౌ నెపం బనఁగ న
న్వేషించె ననుట కౌ • వెదకె నెమకె
నరసె రోసె ననంగ • నారసెఁ దడవె నాఁ
గాంక్షకుఁ బేరు లౌఁ • గ్రమముతోడఁ
తే. గ్రచ్చు కోరిక తమి కోర్కి • యిచ్ఛ యనఁగ
నెపుడు నెడపక యుడుగక • యెల్లపు డన
నిచ్చ యనయంబు నాఁగను • నిచ్చ లనఁగఁ
దనరు నాఖ్యలు సంతతం • బనుట (కీశ). 67

టీ. చుట్టలు, [ఏక. చుట్టము. బహు. మువర్ణలోపము] విందులు, చుట్టాలు, [మువర్ణలోప ఆకారదీర్ఘములు] బంధుగులు [బంధుశబ్దభవము] - ఈ ౪ ను బంధువునకుఁ బేరులు. లాతివాఁడు, వింతవాఁడు, పెఱవాఁడు-ఈ 3 ను అన్యుఁడనుటకు బేరులు. నెపము-[ప్రకృతి-నిభము.] వ్యాజమునకుఁ బేరు. వెదకెను, నెమకెను, అరసెను, రోసెను, ఆరసెను, తడవెను-ఈ౬ను విచారించెననుటకుఁ బేరులు. క్రచ్చు, కోరిక, [కోరుధా. కృదం.] తమి, కోర్కి, ఇచ్ఛ [ఇచ్ఛాశబ్దభవము.] - ఈ ౫ ను అపేక్షకుఁ బేరులు. ఎపుడు, ఎడపక, ఉడుగక, ఎల్లపుడు, నిచ్చ, అనయము, నిచ్చలు - ఈ ౭ను సర్వదా యనుటకుఁ బర్యాయములు.

సీ. తనరుఁ బ్రవేశించె • ననుటకు నాఖ్యలు
తూకొనెఁ జొచ్చెను • దూఱె ననఁగ
నంఘ్రితాడితుఁ జేసె • ననుటకుఁ జే ళ్లగుఁ
దాఁచెఁ గాళ్లఁ గ్రుమ్మెఁ • దన్నె ననఁగ

నాలస్య మొనరించె ♦ ననుటకుఁ జెల్లు నా
మమ్ములు తడసెను ♦ మసలె ననఁగఁ
ద్యక్తంబు గావించె ♦ ననుటకు నాఖ్య లౌ
వీడెను వదలెను ♦ విడిచె ననఁగ

తే. దాఱుమాఱయ్యె వీడ్వడెఁ ♦ దడఁబడె నన
నాఖ్యలొప్పు విపర్యస్త ♦ మయ్యె ననుట
కలరుఁ బ్రహారించె ననుట కాహ్వాయము లడిచెఁ
గొట్టె మొత్తెను మోఁదె నాఁ ♦ (గుధరనిలయ). 68.

టీ. తూఁకొనెను, చొచ్చెను, తూఱెను — ఈ 3 ను ప్రవేశించెననుటకుఁ బేర్లు. తాఁచెను, కాళ్లఁగ్రుమ్మెను, తన్నెను—ఈ 3 ను కాలితోఁదన్నె ననుటకుఁ బేరులు. తడసెను, మసలెను - ఈ ౨ ను ఆలస్యముచేసెననుటకుఁ బేరులు. వీడెను, వదలెను, విడిచెను—ఈ 3 ను పరిత్యజించె ననుటకు నామములు. తాఱుమాఱయ్యెను, వీడ్వడెను, తడఁబడెను—ఈ 3 ను హెచ్చుతక్కువయ్యెననుటకుఁ బేరులు. అడిచెను, కొట్టెను, మొత్తెను, మోఁదెను—ఈ ౪ ను. ప్రహారించెననుటకుఁ బేరులు.

సీ. ముందట నెదుటను ♦ మ్రోల ముంగల నాఁగ
నాఖ్యలౌ సముఖమం ♦ దనుట (కభవ)
యలయిక బడలిక ♦ యలపు సేద యనంగ
శ్రమమున కాఖ్యలౌ ♦ (శమనదమన)
తాలిమి యోరుపు ♦ తాలిక నాఁగను
క్షమకు నాహ్వాయము లౌః ♦ (జర్మవసన)
తవలి బవంతంబు ♦ టక్కు దుత్తారంబు
వెడ్డు నా ఛద్మ మౌ ♦ (విషమనేత్ర)

తే. వెఱ పనఁగ నెద యనఁగను ♦ వెఱ యనంగ
అళుకు కనఁగ భీతి కాఖ్య లౌ ♦ (నసితకంఠ)
నిమ్మళం బన నెమ్మి నా ♦ నెమ్మది యనఁ
దనరుఁ బేళ్లు నిరాతంక♦మునకు (నిశ). 69

టీ. ముందటను, ఎదుటను, మ్రోలన్, ముంగలన్ - ఈ ౪ ను సమ్ముఖమందనుటకుఁ బేరులు. అలయిక, బడలిక, [అలయు, బడలు - కృదంతములు.] అలపు, [అలయు-కృదం.] సేద-ఈ ౪ ను శ్రమమునకుఁ బేరులు. తాలిమి - రూ. తాల్మి. ఓరుపు - రూ. ఓర్పు, తాలిక - ఈ 3 ను క్షమకుఁ బేరులు. తపశి,[ఇది యన్యదేశము ] బసంతము, టక్కు, దుత్తూరము, వెస్లు-ఈ ౫ ను కపటమునకుఁ బేరులు. వెఱపు, ఎద, వెఱ, అళుకు - ఈ ౪ ను భయమునకుఁ బేర్లు. నిమ్మళము, నెమ్మి, నెమ్మది (నెఱ+మది=నిండుమనస్సు)-ఈ 3 ను నిర్భయమునకుఁ బేరులు.

సీ. అసదు కొంచెము సైక ♦ మలఁతి యన్నువ చిన్న
నలికంబు సన్నంబు ♦ నాఁ దనర్చు
స్వల్ప మెక్కుడు నాఁగఁ ♦ జాల నెంతేనియు
మిగులఁ దద్దయుఁ దగ్గ ♦ మిక్కిలి యనఁ
బెద్దయు ననునివి ♦ పేళ్లగు భృశముగా
ననుటకు నుత్కట♦మయ్యె ననుట
కగుఁ బేళ్లు వెగ్గలం♦బయ్యెఁ గ్రిక్కిఱిసె వె
క్కసమయ్యె నునునివి ♦ క్రమముతోడ
ఆ. స గ్గఁ గుందె డొంకెఁ ♦ దగ్గెను సడలెను
క్రుంగె నుబ్బణంగె ♦ స్రుక్కె ననఁగఁ
దనరుఁ బేళ్లు క్షీణ♦దశ నొందె ననుటకు
(నీశ్వరీసనాథ ♦ విశ్వనాథ). 70

టీ. అసదు, కొంచెము, సైకము, అలఁతి, అన్నువ, చిన్న, నలికము, సన్నము - ఈ ౮ యును కొంచెమనుటకుఁ బేరులు. ఎక్కుడు, చాలఁ, ఎంతేనియుఁ, మిగులఁ, తద్దయుఁ, తద్ద, మిక్కిలి, పెద్దయుఁ - ఈ ౮ యును అధికముగా ననుటకు బేరులు. వెగ్గలమయ్యెను, క్రిక్కిఱిసెను, వెక్కసమయ్యెను - ఈ 3 ను హెచ్చయ్యెననుటకుఁ బేరులు. స్రగ్గె, కుందె, డొంకె, తగ్గె, సడలె, క్రుంగె, ఉబ్బణఁగె, స్రుక్కె - ఈ ౮ యును క్షీణదశనొందె ననుటకుఁ బేరులు.

ఆ. మించు వాసి మేలు ♦ మేటి పెచ్చెచ్చన
నధికమునకు నాఖ్య ♦ లగుచు వెలయుఁ
బనులు నాఁగఁ జేయువు ♦ లనఁ జేత లన నొప్పుఁ
గర్మమునకుఁ బేళ్లు ♦ (చర్మవసన). 71

టీ. మించు, వాసి, మేలు, మేటి, పెచ్చు, ఎచ్చు-ఈ ౬ ను అధికమనుటకుఁ బేరులు. పనులు, చెయువులు, చేఁతలు (చేయుధా. కృదం.ఈ]- 3 ను కార్యమునకుఁ బేర్లు.

ఆ. అనిపె ననిచెఁ బనిపెఁ ♦ బనిచె నంపెను బంపెఁ
బుచ్చె గెలువుమనియెఁ ♦ బొమ్మటనియె
ననఁగ నివి సమాఖ్య ♦ లగును ప్రస్థాపించె
ననెడు క్రియకు (నీశ ♦ యభ్రకేశ). 72

టీ. అనిపెను, అనిచెను, పనిపెను, పనిచెను, అంపెను, పంపెను, పుచ్చెను, గెలువుమనియె, పొమ్మటనియె-ఈ ౯ యును పయనముచేసి పంపెను. అనుటకు నామములు.

తే. కొదవ కొద కుందు తగ్గు త♦క్కువ కొఱంత
వెలితి కొఱ లొచ్చు కడమ నా ♦ వెలయు న్యూన
సమభిధానము లర సాము ♦ సగము సవము
నాఁగ నర్ధాహ్వయంబు లౌ ♦ (నాగభూష). 73

టీ. కొదవ, కొద, కుందు, తగ్గు, తక్కువ, కొఱఁత, వెలితి, కొఱ, లొచ్చు, కడమ-ఈ ౧౦ యును న్యూనతకుఁ బేరులు. అర, సామ్ము, సగము, సవము-ఈ ౪ ను అర్ధమనుటకుఁ బేరులు.

తే. వేళ్లు పశ్చాత్తనుటకును • జెల్లు వెనుకఁ
బిదపఁ దర్వాతఁ బదపడి • పిమ్మట నన
మునుపు మును మున్ను తొలి తొల్లి • ముందు తొలుత
ననఁగఁ బూర్వపదార్థాఖ్య • లొ (గిరీశ). 74

టీ. వెనుకన్, పిదపన్, తర్వాతన్, పదపడి, పిమ్మటన్ - ఈ ౫ ను అనంతరం బనుటకుఁ బేరులు. మునుపు, మును, మున్ను, తొలి, తొల్లి, ముందు, తొలుత-ఈ ౭ ను పూర్వమనుటకుఁ బేరులు.

ఆ. పాఱుఁబోతు పిఱికి • పంద కోఁచ యనంగఁ
బేళ్లు దనరు సమరభీరువునకు
దిట్ట యుక్కుతునియ • గట్టిడెందంబువాఁ
డనఁగ ధైర్యవంతుఁ • డలరు (నీశ). 75

టీ. పాఱుఁబోతు, పిఱికి, పంద, కోఁచ-ఈ ౪ ను యుద్ధమున భయపడువానికిఁ బేరులు. దిట్ట, ఉక్కుతునియ, గట్టిడెందమువాఁడు - ఈ 3 ను ధైర్యవంతునకుఁ బేరులు.

తే. పౌఁజు చేరువ మొత్తంబు • బారు తుటుము
దండు పరి గమి కూటువ • పిండు దాఁటు
మూఁక దళమును బేళ్లు స•మూహమునకు
(భుజగవరహార యవిముక్త•పురవిహార). 76

టీ. పౌఁజు, చేరువ, మొత్తము, బారు, తుటుము, దండు, పరి, గమి, కూటువ, పిండు, [బృందము-ప్రకృతి.] దాఁటు, మూఁక, దళము-ఈ ౧3 ను సమూహమునకుఁ బేరులు.

సీ. పూనె నూనెను దాల్చె ♦ నానెను మోచె నా
వహియించె ననుట కౌ ♦ (నహివిభూష)
నామము లుచ్చాట♦నము చేసె ననుటకు
వరుసతోఁ దఱిమెను ♦ బఱపె వెలిచెఁ
దోలెను ఱొప్పె నా ♦ (ద్రుహిణాదిసురనుత)
త్రిప్పెను నాఁ గ్రమ్మ♦ఱించె ననఁగ
మగిడించె ననఁగను ♦ మరలించె నన సమా
హ్వాయములై పరఁగు ని♦వర్తితంబు
తే. చేసె ననుటకు (సురముని♦సిద్ధసేవ్య)
యడ్డగించెను నా నిల్పె ♦ ననఁగ నాఁగె
నన నివారించె ననుటకు ♦ నాఖ్య లమరు
(నగసుతానాథ గుహగజా♦ననసనాథ). 77

టీ. పూనెను, ఊనెను, తాల్చెను, ఆనెను, మోచెను-ఈ ౫ ను ధరించె ననుటకుఁ బేరులు. తఱిమెను, పఱపెను, వెలిచెను, తోలెను, ఱొప్పెను - ఈ ౫ ను ఉచ్చాటనము చేసె ననుటకుఁ బేరులు. త్రిప్పెను, క్రమ్మఱించెను, మగిడించెను, మరలించెను-ఈ ౪ ను వెనుకకుఁ బొమ్మనె ననుటకుఁ బేరులు. అడ్డగించెను, నిల్పెను, ఆఁగెను - ఈ 3 ను నిరోధించెననుటకుఁ బేరులు.

తే. దండ చేరువ సంగడి ♦ దాపు చెంత
సరస చెంగట యొద్ద డ♦గ్గఱ కురంగ
టండ పజ్జయు నా సమీ♦పాఖ్య లమరు
(రమ్యధవళాంక కలశనీ♦రధినిషంగ). 78

టీ. దండ, చేరువ, సంగడి, దాపు, చెంత, సరస, చెంగట, ఒద్ద, డగ్గఱ, కురంగట, అండ, పజ్జ [పశ్చాచ్ఛబ్దభవము.] - ఈ ౧౨ ను సమీపమందనుటకుఁ బేరులు.

తే. అచట నచ్చట నచ్చోట • నందు నాడ
నచోట నచ్చోట నక్కడ • నయ్యెడ నట
ననఁగఁ దత్ప్రదేశంబునం • దనుట కాఖ్య
లయ్యె (భక్తవిధేయ యాం • జనేయసహాయ). 79

టీ. అచట, అచ్చట, అచ్చోట, అందు, అడ, అచోట, అచ్చోట, అక్కడన్ (అ+కడన్) = అదిక్కున, అయ్యెడన్ (అ+ఎడన్) = అప్రదేశమున, అటన్ = ఈ ౧౦ యును అప్రదేశమం దనుటకుఁ బేరులు.

క. ఇరుగెలఁకుల నిరువంకల
నిరుదెస నిరుచక్కియందు • నిరుపక్కియలం
దిరుగ్రేవల నిరుగడ నన
బొరిఁ బెల్లగు నుభయపార్శ్వ • ముల ననుట (కజా). 80

టీ. ఇరుగెలఁకులన్, ఇరువంకలన్, ఇరుదెసన్, ఇరుచక్కియందున్, ఇరుపక్కియలందున్, ఇరుగ్రేవలన్, ఇరుగడన్—ఈ ౭ ను రెండువైపులందు ననుటకుఁ బేరులు.

క. నవముగ ధరలో నీమా
నవవర్గువు వేడ్కఁ జదివి • నను వ్రాసిన మా
నవులకు ననవరతంబును
శివుఁ డవిముక్తేశ్వరుండు • చెలువం బొసఁగున్. 81

తా. ఎవ రీమానవవర్గు వ్రాయుచున్నారో, లేక చదువుచున్నారో, వారికిఁ గాశీవిశ్వేశునిదయవలన సకలసంపదలు గలుగును.

మానవవర్గు సమాప్తము.

---

# స్థావరవర్గు.

సీ. వలిదిప్ప వడఁకుగు♦బ్బలి చలిమిరిమల
గట్టులఱేఁడు ము♦క్కంటిమామ
మంచుఁగొం డన హిమ♦త్క్ష్మాధ రాఖ్యలు చను
వేలుపుఁగొండ జే♦జేలగట్టు
పుత్తడిగుబ్బలి ♦ పునుకకంచమువాని
విల్లు నా మేరువు ♦ పేళ్లు వెలయు
వెలిదిప్ప ముక్కంటి♦మల వెండికొండ నాఁ
గైలాసపర్వతా♦ఖ్యలు సెలంగు
తే. వెలయుఁ దరిగొండ కవ్వంపు♦మల యనంగ
మంథ రాఖ్యలు కడపటి♦మల యనంగఁ
జుట్టుఁగొం డనఁ దనరు సీ♦త్క్షోణియందుఁ
జక్రవాళాద్రి (వృషవాహ♦శైలగేహ). 1

టీ. వలిదిప్ప (వలి=చల్లఁదనముగల, తిప్ప=కొండ), వడఁకుగుబ్బలి, పా. వణఁకుగుబ్బలి=వడఁకునట్లు చేయుపర్వతము, చలిమిరిమల=చల్లనికొండ, గట్టులఱేఁడు = పర్వతములకురాజు, ముక్కంటిమామ = శివునకుమామ, మంచుఁగొండ=హిమము గలపర్వతము – ఈ ౬ ను హిమవత్పర్వతమునకుఁ బేరులు. వేలుపుఁ గొండ (వేలుపు+కొండ)=దేవతలు నివసించుపర్వతము, జేజేలగట్టు=దేవతలపర్వతము, పుత్తడిగుబ్బలి=బంగారుపర్వతము, పునుకకంచమువానివిల్లు=ఈశ్వరుని ధనుస్సు - ఈ ౪ ను మేరుపర్వతముపేరులు. వెలిదిప్ప (వెలి+తిప్ప)=తెల్లనిపర్వతము, ముక్కంటిమల=శివుని కునికిపట్టగు పర్వతము, వెండికొండ=వెండివలెఁ దెల్లనిపర్వతము - ఈ 3 ను కైలాసపర్వతముపేరులు. తరి

గొండ (తరి+కొండ), కన్వంపుమల (కవ్వము+మల)-ఈ ౨ను మందరపర్వత ముపేరులు. కడపటిమల = కడగానుండెడుపర్వతము, చుట్టుఁగొండ(చుట్టు+కొండ)=భూమిచుట్టునుండెడుపర్వతము -ఈ ౨ను చక్రవాళపర్వతముపేర్లు.

ఆ. తూర్పుఁగొండ నాఁగఁ • దొలుగట్టు నాఁగను
బొడుపుగుబ్బ లనఁగఁ • బూర్వశిఖరి
పరఁగుఁ గ్రుంకుమెట్టు • పడమటికొండ నా
వెలయు న స్తశిఖరి • (విశ్వనాథ). 2

టీ. తూర్పు గొండ (తూర్పు+కొండ) = పూర్వదిక్కునందుండెడు పర్వతము, తొలుగట్టు=పూర్వదిక్కునందలిపర్వతము, పొడుపుగుబ్బలి = సూర్యుఁ డుదయించెడు పర్వతము - ఈ 3 ను ఉదయపర్వతమునకుఁ బేరులు. క్రుంకుమెట్టు=సూర్యుఁడ స్తమించుపర్వతము, పడమటికొండ=పడమటిదిక్కునందుండెడు పర్వతము - ఈ ౨ను అ స్తమయపర్వతముపేరులు.

తే. ఒప్పు గిరిపేళ్లు మల గట్టు • తిప్ప మెట్టు
కొండ గుబ్బలి నా మేరు • (కుధరచాప)
ఱాయి నాఁ గ ల్లనంగను • ఱా యనంగ
శిల కభిఖ్యలు దగు నిల • (శేషభూష). 3

టీ. మల, గట్టు, తిప్ప, మెట్టు, కొండ, గుబ్బలి - ఈ ౬ ను పర్వతమునకుఁ బేరులు. ఱాయి, కల్లు, ఱా - ఈ 3 ను శిలకుఁ బేరులు.

తే. పల్లె కొట్టిక కొటిక కుప్పము నాఁగ
నూ రనఁగ గ్రామనామంబు • లొప్పుచుండుఁ
బట్టణంబున కాఖ్యలు • పరఁగుచుండుఁ
బ్రో లనఁగ వీ డనంగను • (శూలపాణి). 4

టీ. పల్లె-రూ. పల్లియ, కొట్టిక, కొటిక, కుప్పము, ఊరు-ఈ ౫ ను గ్రామముపేరులు. ప్రోలు, వీడు - ఈ ౨ను పట్టణముపేర్లు.

ఆ. ఉనికిపట్టు తావు • మనికిప ట్టిర విల్లు
తెంకి యిక్క నట్టు • టెంకి యిమ్ము
నెలవు గీము నాఁగ • నలరు నివాసదే
శంబునకును బేళ్లు • (చంద్రమౌళి). 5

టీ. ఉనికిపట్టు, తావు, మనికిపట్టు, ఇరవు, ఇల్లు, తెంకి, యిక్క, నట్టు, టెంకి, ఇమ్ము, నెలవు, గీము [గృహాశబ్దభవము.] - ఈ ౧౨ ను నివాసస్థానమునకుఁ బేరులు.

సీ. తెంకాయచెట్టనఁ • డెంకాయమ్రానన
నారికేళం బొప్పు • (నగనివేశ)
మావిమ్రాననఁగను • మామిడిచెట్టన
నామ్రభూజం బొప్పు • (నభ్రకేశ)
అత్తిమ్రాననమేడి • యనఁగ నౌదుంబర
ధారుణీజం బొప్పు • (మేరుచాప)
యరఁటి యనఁటి నాఁగ • నంశుమత్ఫలధారు
ణీరుహం బగు (ధర•ణీశతాంగ)

తే. యలఁతుఁ దుంబీశలాటుస•మాఖ్య లౌను
గంబు సొఱకాయ వదరు నా • (గరళకంఠ)
తా డనంగను దాడి నా • తాళభూరు
హంబునకు నాఖ్య లై యొప్పు • (నంబికేశ). 6

టీ. తెంకాయచెట్టు, టెంకాయమ్రాను - ఈ ౨ ను కొబ్బరిచెట్టుపేరులు. మావిమ్రాను, మామిడిచెట్టు - ఈ ౨ ను చూతవృక్షముపేరులు. అత్తిమ్రాను, మేడి - ఈ ౨ ను అత్తిచెట్టుపేరులు. అరఁటి, అనఁటి - ఈ ౨ ను కదళీవృక్షమునకు నామంబులు. అనుగము, సొఱకాయ, వదరు - ఈ 3 ను సొఱకాయపేరులు. తాడు, తాడి - ఈ ౨ ను తాటిచెట్టుపేరులు.

సీ. మొక్క మోక నిసువు ♦ మొలక మో సనఁగ నం
కురమునకును బేళ్లు ♦ (కుధరచాప)
యిగు రనఁ దలిరు నా ♦ చిగురు నాఁ చివు రనఁ
బల్లవనామముల్ ♦ పరఁగు (నీశ)
మ్రా ననఁ జెట్టన ♦ మ్రాఁ కన భూరుహ
నామధేయము లగు ♦ (వామదేవ)
పువు పువ్వు పూ నాఁగఁ ♦ బుష్పము విరి యల
రనఁ గుసుమాఖ్య లై ♦ యలరు (నీశ)
తే. గుబురు దట్టము జొంపంబు ♦ గుంపు తఱచు
నాఁగ నిబిడంబు పేళ్లొప్పు ♦ (నందివాహ)
వల్లరిసమాఖ్య లగుచు వ♦ ర్తిల్లుఁ దీఁగ
తీవ తీవియ తీవె నాఁ ♦ (త్రిపురవైరి). 7

టీ. మొక్క, మోక, నిసువు, మొలక, మోసు - ఈ ౫ ను అంకురము పేరులు. ఇగురు, తలిరు, చిగురు, చివురు - ఈ ౪ ను పల్లవము పేరులు. మ్రాను - రూ. మాను, చెట్టు, మ్రాఁకు - ఈ 3 ను చెట్టునకునామములు. పువు, పువ్వు, పూ, పుష్పము, [పుష్పశబ్దభవము.] విరి, అలరు - ఈ ౬ ను పుష్పము పేరులు. గుబురు, దట్టము, జొంపము, గుంపు, తఱచు - ఈ ౫ ను సందులేకయుండువానికిఁ బేరులు. తీఁగ, తీవ, తీవియ, తీవె-రూ. తీఁగె- ఈ ౪ ను తీఁగకుఁ బేరులు.

ఆ. అగ్రమున శిఖాఖ్య ♦ లగుచుండుఁ దుద సుద
కొన యనంగ వృక్ష♦కోటరమున
కలరుఁ బేళ్లు తొఱట ♦ తొలి తొఱ్ఱ తొఱ నాఁగ
(నాగహార రజత♦నగవిహార). 8

టీ. తుద, సుద, కొన-ఈ 3 ను అగ్రమునకుఁ బేరులు. తోఁట, తోఁపు, తోఁట, తోఁటు-ఈ 4 ను చెట్లుతోఁట్లకుఁ బేరులు.

ఆ. ఇతువున కభిఖ్య • లీచెతిఁ గన్నుల
మ్రాను చెఱకు తియ్యమ్రా • నసంగఁ
దనరు దవ యనంగఁ • దలవాఁడె నాఁగఁ ద
దగ్రమున కభిఖ్య • లగు (గిరీశ). 9

టీ. కన్నులమ్రాను = గనుపులుగల చెట్టు, చెఱకు, తియ్యమ్రాను= మధురమైనవృక్షము-ఈ 3 ను చెఱకునకుఁ బేరులు. దవ, తలవాఁడె - ఈ 2 ను చెఱకుకొనకుఁ బేరులు.

క. అగుఁ బేళ్లుత్పలమునకుం
దొఁగ తొఁవ గల్వ గలు వనఁగఁ • దోయజ మొప్పం
దగఁ దమ్మి తామ రనఁగా
మొగ డన మొగ్గ యనఁ దనరు • ముకుళంబు (శివా).

టీ. తొఁగ, తొఁవ, కల్వ, కలువ-ఈ 4 ను ఉత్పలమునకుఁ బేరులు. తమ్మి, తామర-ఈ 2 ను తామరపువ్వునకుఁ బేరులు. మొగడ, మొగ్గ - ఈ 2 ను ముకుళమునకుఁ బేరులు.

తే. ఎసఁగుఁ జెందొవ చెందొఁగ • యెఱ్ఱగలువ
యనఁగ రక్తోత్పలంబు ర•క్తాబ్జ మొప్పు
నిలను గెందమ్మి కెందామ • రెఱ్ఱదామ
రనఁగఁ జెందమ్మి చెందామ • రన (మహేశ). 11

టీ. చెందొవ, చెందొఁగ (చెన్ను+తొఁవ-గ)నువర్ణలోపము. చెందొవ (గ), ఎఱ్ఱగలువ (ఎఱ్ఱ+కలువ)-ఈ 3 ను ఎఱ్ఱనికలువకుఁబేరులు. కెందమ్మి (కెంపు+తమ్మి = కెందమ్మి), కెందామర (కెంపు+తామర = కెందామర), [బాల. సంధి. 36, 37 సూత్రములు చూడుఁడు.] ఎఱ్ఱదామర (ఎఱ్ఱ+తా

మర), చెందమ్మి (చెన్ను + తమ్మి), చెందామర (చెన్ను + తామర) - ఈ
౫ ను ఎఱ్ఱదామరపువ్వునకుఁ బేరులు.

క. గొడుగు గొడుగు వెల్లి యనఁ జె
న్నడరును ఛత్రంబు కేత•నాహ్వయము లగుఁ
సిడె మనఁగఁ డెక్కె మనఁగాఁ
బడగ యనఁ డా లనంగఁ • (బర్వతధన్వి). 12

టీ. గొడుగు, గొడువు, ఎల్లి-ఈ 3 ను ఛత్రమునకుఁ బేరులు. సిడె
ము, డెక్కెము, పడగ [పతాకాశబ్దభవము], డాలు-ఈ ౪ ను ధ్వజము
నకుఁ బేరులు.

క. మఱుఁ గనఁగ నోల మనఁగాఁ
మఱు వనఁగాఁ జా టనంగ • మా టన వరుసం
బరఁగు ని వెల్ల నగోచర
ధరణీనామంబు లగుచు • (దర్పకదమనా). 13

టీ. మఱుఁగు, ఓలము, మఱువు, చాటు, మాటు - ఈ ౫ ను కన్నుల
కగపడని ప్రదేశమునకు నామములు.

క. పొసఁగుఁ దృణాఖ్యలు పులు నాఁ
గస వనఁగాఁ బూరి యనఁగ • గడ్డి యనంగా
వసుమతిలో నెన్నంబడు
ససి సస్సెము పైరనంగ • సస్యం (బభవా). 14

టీ. పులు, కసవు, [ఘాసశబ్దభవము.] పూరి, గడ్డి - ఈ ౪ ను తృణ
మునకుఁ బేళ్లు. ససి, సస్సెము, [సస్యశబ్దభవము] పైరు - ఈ 3 ను ధాన్యము
నకు నామములు.

ఆ. తెలుపు దెల్ల వెల్ల • తెలి వెలి నాఁగ నా
హ్వయము లమరు ధవళ•వర్ణమునకుఁ

గప్పు నలుపు నల్ల ♦ కఱ యన నాఖ్యలొ
నీలవర్ణమునకు ♦ (నీలకంఠ). 15

టీ. తెలుపు, తెల్ల, వెల్ల, తెలి, వెలి - ఈ ౫ ను ధవళవర్ణమునకుఁ బేరులు. కప్పు, నలుపు, నల్ల, కఱ - పా. కఱి-ఈ ౪ ను నీలవర్ణమునకుఁ బేరులు.

ఆ. కెంపు దొగరు దొవరు ♦ గెంజాయ యెఱు పెఱ్ఱ
యనఁగ నరుణకాంతి ♦ కాఖ్య లయ్యె
నళిది పసుపుచాయ ♦ యనఁగ హారిద్రవ
ర్ణమున కాఖ్య లగుఁ (బి♦నాకహస్త). 16

టీ. కెంపు, తొగరు, తొవరు, కెంజాయ (కెంపు+చాయ), ఎఱు పు, ఎఱ్ఱ - ఈ ౬ ను ఎఱ్ఱనికాంతికిఁ బేరులు. అళిది-రూ. హాళది, పసుపుచాయ-ఈ ౨ ను హారిద్రవర్ణమునకుఁ బేరులు.

ఆ. శ్యామవర్ణమునకు ♦ నామంబు లగుచుండుఁ
బసరుచాయ యనఁగ ♦ బచ్చ యనఁగ
వన్నె డాలు రంగు ♦ వన్నియ జిగి జోతి
చాయ యనఁగఁ బరఁగు ♦ జగతిఁ గాంతి. 17

టీ. పసరుచాయ, పచ్చ-ఈ ౨ ను ఆకుపచ్చవన్నెకు నామములు. వన్నె, [వర్ణశబ్దభవము.] డాలు, రంగు, వన్నియ, [ప్ర. వర్ణము.] జిగి, జోతి, [ప్ర. జ్యోతిస్సు.] చాయ [ప్ర. ఛాయ] - ఈ ౭ ను కాంతికిఁ బేరులు.

తే. మానికము లన రతనముల్ ♦ నా నెసంగు
నవని మాణిక్యములకు స♦మాహ్వయములు
మెఱుఁగు గనంగను నిగ్గు నా♦ మెఱయుచుండు
నాఖ్య లుత్కృష్టకాంతికి ♦ (నభ్రకేశ). 18

టీ. మానికము [ప్రకృ. మాణిక్యము], రతనము [ప్రకృ. రత్నము]- ఈ ౨ను రత్నములకు: పేరులు. మెఱుఁగు, నిగ్గు-ఈ ౨ను విశేషకాంతికిఁ బేరులు.

తే. జడధిపేళ్లగు మున్నీరు • కడలి సంద్ర
మనఁగ మడుఁగన మడువు నా • హ్రదము దనరుఁ
బరఁగు నాఱవసంద్రంబు • పాలవెల్లి
జిడ్డుకడలి పాల్కడలి నా • క్షీరజలధి. 19

టీ. మున్నీరు (మును + నీరు) = మొదటిసృష్టి, కడలి, సంద్రము (ప్రకృ. సముద్రము.] - ఈ 3 ను సముద్రమునకు నామములు. మడుఁగు, మడువు-ఈ ౨ను హ్రదముపేర్లు. ఆఱవ సంద్రము, [లవణ, ఇక్షు, సురా, సర్పి, దధి, క్షీర, నీరసముద్రములలో నిది యాఱవది.] పాలవెల్లి (పాలు + వెల్లి)= క్షీరప్రవాహము, జిడ్డుకడలి = జిడ్డుగల సముద్రము, పాలకడలి=క్షీరసముద్రము-ఈ ౪ ను క్షీరసముద్రమునకుఁ బేరులు.

క. నంజె యన మడి యనంగను
మంజుల కేదారభూస • మాఖ్యలు వెలయుం
బుంజె యనఁ జేను పొల మనఁ
గం జన మరుభూమిపేళ్లు • (కాయజదమనా). 20

టీ. నంజె, మండి-ఈ ౨ను మాగాణికిభూమికిఁ బేరులు. పుంజె, చేను, పొలము-ఈ 3 ను మెట్టభూమిపేర్లు. కంజ-ఈ ౧ నిర్జలప్రదేశమునకుఁ బేరు.

క. ధరణిన్ వివరాఖ్య లగున్
బొఱియ కలుగు లాఁగ బొక్క • బొంద యనంగా
దరి యొడ్డు గట్టనంగాఁ
బరఁగుం దీరంబు పేళ్లు • (ప్రమథగణేశా). 21

టీ. బొఱియ, కలుఁగు, లాఁగ, బొక్క, బొంద-ఈ ౫ ను బొంద పేర్లు. దరి, ఒడ్డు, గట్టు-ఈ ౩ ను తీరమునకుఁ బేరులు.

తే. అస లనంగను అొంపి నా • నడు సనంగ
బుఱద నా నొప్పుఁ గర్దమం•బునకుఁ బేళ్లు
భూమికి సమాఖ్య లగు బువి • పుడమి నేల
మన్ను పంటవలంతి నా • (మదనదమన). 22

టీ. అసలు, అొంపి, అడుసు, బుఱద - ఈ ౪ ను అడుసునకుఁ బేరులు. బువి [ప్రకృ. భువి.], పుడమి [ప్రకృ. పృథివి.], నేల, మన్ను, పంటవలంతి =పంటలనొసఁగు దేవి-ఈ ౫ ను భూమి పేర్లు.

తే. జగిలె యనఁగ నరుఁగు నాఁగ • జగతి నాఁగఁ
దిన్నె యన వేదికాఖ్య లై • యెన్నఁ దనరు
మి ఱ్ఱనంగను మెరక నా • మిట్ట యనఁగ
నున్నతక్షితికాఖ్యలై • యొప్పు (నభవ). 23

టీ. జగిలె-రూ. జగ్గిలె, అరుఁగు, జగతి, తిన్నె-ఈ ౪ ను తిన్నెకుఁ బేరులు. మిఱ్ఱు, మెరక, మిట్ట-ఈ ౩ ను ఎత్తయినచోటికిఁ బేరులు.

తే. తనరు నిశ్శ్రేణి తాప ని•చ్చెన యనంగఁ
దెప్ప తేపను నాఖ్యల • నొప్పుఁ బ్లవము
పరఁగు నోడనఁ గల మనఁ • దరణి ధరణిఁ
(దరణిశీతాంశుశిఖినేత్ర • ధవళగాత్ర). 24

టీ. తాప, నిచ్చెన-ఈ ౨ ను నిచ్చెనకుఁ బేరులు. తెప్ప, తేప-ఈ ౨ ను ప్లవమునకుఁ బేరులు. ఓడ, కమలము-ఈ ౨ ను నావకుఁ బేరులు.

తే. కార్ముకం బొప్పు విల్లు సిం•గాణి యనఁగఁ
దూణ మొప్పు బత్తళిక నా • దొన యనంగఁ

దరకసం బనఁ బొది యనఁ ♦ దనరు శరసు
కోల ములి కమ్ము తూఁపు నా ♦ (శూలపాణి). 25

టీ. విల్లు, సింగాణి–ఈ ౨ ను ధనస్సునకుఁ జేరులు. వత్తళిక, దొన, తరకసము, పొది–ఈ ౪ ను అమ్ములపొదిపేర్లు. కోల, ములికి, అమ్ము, తూఁపు–ఈ ౪ ను శరము పేర్లు.

తే. తనరుఁ జేళ్లు తనుత్రాణ♦మునకుఁ గత్త
ళంబు జోడు జిరా దుప్ప♦టంబు బొంద
ళం బనఁగ నాఖ్య లగు శతాం♦గంబునకును
దేరు నా నరదము నాఁగ ♦ (మేరుచాప). 26

టీ. కత్తళంబు, జోడు, జిరా, దుప్పటంబు, బొందళంబు–ఈ ౫ ను కవచమునకుఁ దేళ్లు. తేరు, ఆరదము [ప్రకృ...రథము.] - ఈ ౨ ను రథము పేళ్లు.

క. కన్నా కన్నను దలక
ట్టన్నను మఱి మేలుబంతి ♦ యన్నను ధరలో
నిన్నియు శ్రేష్ఠను పేళ్లై
యెన్నంబడు రాజసభల ♦ (నిభద్రైత్యహరా). 27

టీ. కన్నాకు, తలకట్టు, మేలుబంతి–ఈ 3 ను ఉత్తముని పేర్లు.

క. సొమ్మనఁ దొడ వనఁగా రవ
ణ మ్మన నగుఁ బేళ్లు భూష♦ణమ్ములకును హా
రమ్ములకు నగును నభిధా
నమ్ములు పేరు లన సరులు ♦ నా(శితికంఠా). 28

టీ. సొమ్ము, తొడవు, రవణము–ఈ 3 ను భూషణములకుఁ బేరులు. పేరు, సరి–ఈ ౨ ను హారమునకుఁ బేరులు.

తే. సరము లెత్తులు దండలు ♦ సరు లనంగ
నామధేయంబు లగుఁ బుష్ప♦దామములకు
వాసనకు నాఖ్యలై యొప్పు ♦ వలపు కంపు
తావి కమ్మన యనఁగ (గా♦త్యాయనీశ). 29

టీ. సరములు, ఎత్తులు, దండలు, సరులు-ఈ ४ ను పూవులదండలకుఁ బేర్లు. వలపు, కంపు, తావి, కమ్మన-ఈ ४ ను వాసనకుఁ బేరులు.

క. ఒడమె యన సొమ్మనంగా
విడిముడి యన రొక్క మనఁగ ♦ విత్తంబునకుం
బుడమిని నామము లగు నివి
(యుడురాజకళావతంస ♦ యురగాభరణా). 30

టీ. ఒడమె, సొమ్ము, విడిముడి, రొక్కము(రుక్మశబ్దభవము]-ఈ४ను ధనమునకుఁ బేర్లు.

తే. మచ్చు లన మిద్దె లనఁగను ♦ మాడుగు లన
దారునిర్మితగేహముల్ ♦ దనరుచుండుఁ
బరఁగు సౌధంబు మేడ యు♦ప్పరిగ యనఁగఁ
(నాగకేయూర మౌనిమా♦నసవిహార). 31

టీ. మచ్చులు, మిద్దెలు, మాడుగులు-రూ. మాడువులు - ఈ 3 ను కొయ్యలతోఁ గట్టఁబడినయిండ్లకుఁ బేర్లు. ఉప్పరిగ, మేడ-ఈ౨ను రాచనగళ్లకుఁ బేర్లు.

తే. పెట్టి యన మందసం బనఁ ♦ బెట్టె యనఁగఁ
బెట్టియ యనంగఁ బేటికా♦భిఖ్య లమరు
మ్రో డనంగను మోటు నా ♦ మొద్దనంగ
వెలయు స్థాణుసమాఖ్యలు ♦ (విశ్వనాథ). 32

టీ. పెట్టె, మందసంబు, పెట్టె, పెట్టియ-ఈ ౪ ను పేటికపేర్లు. ప్రోడు, మోటు, మొద్దు-ఈ 3 ను స్థాణువుపేర్లు.

ఆ. విస్తృతాఖ్య లొప్పు • విప్పు తనర్పు నా
వెడఁద విరివి పఱపు • వెడలు పనఁగ
దీర్ఘమునకు నామ•ధేయంబు లై యొప్పు
నిడుద చాఁపు నిడివి • నిడు పనంగ. 33

టీ. విప్పు, తనర్పు, వెడఁద, విరివి, పఱపు, వెడలుపు-ఈ ౬ను వెడలుపు పేర్లు. నిడుద, చాఁపు, నిడివి, నిడుపు-ఈ ౪ ను నిడివికిఁ బేర్లు.

ఆ. ఈడు దినుసు సాటి • యెన దొర సరి జోడు
సవతు మాద్రి యుద్ది • జత తరంబు
పురుడు నాఁగ సదృశ•మున కివి యాఖ్య లౌ
(వివిధగుణసనాథ • విశ్వనాథ). 34

టీ. ఈడు, దినుసు, సాటి, ఎన, దొర, సరి, జోడు, సవతు, మాద్రి-రూ. మాదిరి, ఉద్ది, జత, తరంబు, పురుడు-ఈ ౧3ను సమానమునకుఁ బేర్లు.

తే. పసిఁడి బంగరు బంగారు • పైఁడి పొన్ను
జాళువా పుత్తడి యనంగ • స్వర్ణ మమరుఁ
దప్తకాంచన మమరుఁ గుం•దన మనంగ
డాని యపరంజి నా (గజ•దానవారి). 35

టీ. పసిఁడి, బంగరు, బంగారు, పైఁడి, పొన్ను - రూ. పొన్ను, జాళువా, పుత్తడి-ఈ ౭ ను బంగారమునకుఁ బేర్లు. కుందనము, కడాని, అపరంజి-ఈ 3 ను పుటముదీసిన బంగారమునకుఁ బేర్లు.

ఆ. చిదుర తునుక తునియ • చిదురుప వ్రక్క వ
లనఁగ ఖండమునకు • నాఖ్య లమరుఁ

బ్రోగు గుప్ప వామి ♦ ప్రోవు దిట్ట యనంగ
రాశి కాఖ్య లగు (ధ♦రాశితాంగ). 36

టీ. చిదుర, తునుక, తునియ, చిదురుప, వ్రక్క, పాలు - ఈ౬ను ఖండమునకుఁ బేర్లు. ప్రోగు, కుప్ప, వామి, ప్రోవు, తిట్ట-ఈ౫ను రాశికిం బేరులు.

క. ఈస్థావరవర్గుం గడు
నాస్థఁ వినఁ జదువ వ్రాయ ♦ నవనీస్థలిలో
నాస్థాణునికృప నఖిలశు
భస్థితులును జనుల కొదవు ♦ భాసురలీలన్. 37

స్థావరవర్గు సమాప్తము.

---

## తిర్యగ్వర్గు.

సీ. వెడఁదమోముమెకంబు ♦ జడలమెకం బేనుఁ
గులగొంగ మెకముల♦కొలముసామి
తెల్లడాలుమెకంబు ♦ తెఱనోటిమెకము సిం
గంబు నాబొబ్బమె♦కం బనంగఁ
బరఁగును మృగరాజు ♦ పసిదిండి పులి మెకం
బులతిండిపోతు చా♦ఱలమెకంబు
మువ్వన్నె మెక మన ♦ నివ్వసుంధరయందు
వ్యాఘ్రంబునకు సమా♦ఖ్యలు చెలంగుఁ
ఆ. బుట్టకూడుదిండి♦పో తన వెనుకచూ
పులమెకంబు నాఁగ ♦ నెలు వనంగ

నెలుఁగు నాఁగ మోరతెలుపు మేకంబు నా
భల్లుకంబు దనరు (ఫాలనేత్ర). 1

టీ. పెద్దదమోముమెకము = విశాలముఖముగలమృగము, జడలమెకము = జటలుగలమృగము, ఏనుఁగులగొంగ = గజములకువిరోధి, మెకముల కొలముసామి = మృగములవంశమునకు రాజు, తెల్లడాలుమెకము = శ్వేతకాంతిగలది, తెఱనోటిమెకము = తెఱచియుండెడునోరుకలది, సింగము, [సింహశబ్దభవము.] బొబ్బమెకము = బొబ్బలువేసెడుమృగము - ఈ ౮ రును సింహమునకుఁ బేళ్లు. పసిదిండి = (పసుల+తిండి) పశువును భక్షించునది, పులి, మెకంబులతిండిపోతు = మృగములను భక్షించునది, చాఱలమెకము = చాఱలుగలమృగము, మువ్వన్నెమెకము = మూఁడువన్నెలుగల మృగము-ఈ ౫ ను వ్యాఘ్రమునకుఁ బేరులు. పుట్టకూడుదిండిపోతు = పుట్టకూడుతినునది, వెనుకచూపులమెకము = వెనుకదృష్టిగలది, ఎలువు, ఎలుఁగు, మోరతెలుపు మెకము=ముఖమందు తెలుపుగలమృగము-ఈ ౬ ను భల్లుకమునకుఁ బేళ్లు.

క. పలుగొమ్ములమెక మనఁగా
నిల నెక్కుడుమెక మనంగ నేనుఁ గనంగా
బలువంజమెకము నాఁ జే
గలమెక మన గొరనంగఁ గరి యొప్పు (శివా). 2

టీ. పలుగొమ్ములమెకము = దంతములే కొమ్ములుగాఁగలమృగము, ఎక్కుడుమెకము=ఎక్కుటకుయోగ్యమైనమృగము,ఏనుఁగు,బలువంజమెకము (బలువు+అంజ+మెకము), రూ. బలుహజ్జమెకము = బలువైన పాదములు గలమృగము, చేగలమెకము=హస్తము (తొండము) గలమృగము, గొరు- ఈ ౭ ను గజమునకుఁ బేరులు.

తే. వాజికి సమాఖ్య లగుఁ దేజి వారువంబు
మావు గుఱ్ఱంబు తట్టువ వావురంబు

కత్తలాని బాబా జక్కి • తత్తడి యన
(విగతభవపాశ కాశీని•వేశ యీశ). 3

టీ. తేజి, వారువము, మావు, గుఱ్ఱము, తట్టువ, వావురము, కత్తలాని బాబా, జక్కి, తత్తడి-ఈ౧౧ యుం గుఱ్ఱమునకుఁ బేరులు.

క. తగ రేడిక పొట్టే లన
నగు మేషసమాఖ్య లెనిమి•దడుగులమెక మే
నుఁగుగొంగసూఁ డనంగా
జగతిఁ శరభాఖ్య లొప్పుఁ • (జంద్రార్ధధరా). 4

టీ. తగరు, ఏడిక, పొట్టేలు-ఈ 3 ను మేఁకకుఁ బేరులు. ఎనిమిదడుగులమెకము = ఎనిమిదికాళ్లుగల మృగము, ఏనుఁగుగొంగసూఁడు = సింహమునకు విరోధి-ఈ ౨ ను శరభమృగమునకుఁ బేరులు.

క. సంగతి నుష్ట్రాఖ్యలు నొ
ప్పొంగడు నొంటె లన లొట్టి•పిట్ట లనఁగ సా
రంగాఖ్య లలరు నిఱ్ఱు ల
నంగా జింక లన లేళ్లు • నా (సర్వజ్ఞా). 5

టీ. ఒంటె, లొట్టిపిట్ట-ఈ ౨ ను ఉష్ట్రమునకుఁ బేరులు. ఇఱ్ఱి, జింక, లేడి-ఈ 3 ను జింకలకుఁ బేరులు.

క. నులిగొమ్ములమెక మి • ఱ్ఱన
నిల మృగమున కొప్పుఁ బేళ్లు • మృగి లేడి యనఁగ
వెలయును రెంటికి దగు నా
ఖ్యలు జింక యనంగ నీశ • (యంబరకేశా). 6

టీ. నులిగొమ్ములమెకము = మెలికలుతిరిగియుండు కొమ్ములు గలమృగము, ఇఱ్ఱి-ఈ ౨ ను మగజింకపేర్లు. లేడి - అను నీ ౧ యుం ఆఁడుజింకకు పేరు. జింక-ఈ ౧ యుం ఆఁడు మగదుప్పులు రెంటికినిఁ బేరు.

తే. పసులు తొడుకులు పసరముల్ ♦ పసి యనంగఁ
బశువులకును సమాఖ్యలై ♦ పరఁగు నాల
పోతు బసవఁడు గిబ్బ యాఁ♦బో తనంగ
వృషభమున కాఖ్యలై యొప్పు ♦ (వృషభవాహ). 7

టీ. పసులు, తొడుకులు, పసరము-రూ. పసలము, పసి-ఈ ౪ ను పశువులకుఁ బేరులు. ఆలపోతు=పశువులకుఁ బతి, బసవఁడు, గిబ్బ, ఆఁబోతు [ఆవు+పోతు]-ఈ ౪ ను వృషభమునకుఁ బేరులు.

సీ. తొట్టుపట్టు లనంగ ♦ దొడ్డనఁగా నివి
గోష్ఠదేశమునకుఁ ♦ గొఱలు (నీశ)
కదుపులు మొదవులు ♦ పదువులు మందలు
నా ధేనుగణ మొప్పు ♦ (నగనివేశ)
యలరు నాఖ్యలు లేఁగ ♦ లన దూడ లనఁ గ్రేపు
లన వత్సములకును ♦ (ధనదమిత్ర)
యా వనఁగా గిడ్డి ♦ యనఁ దొడు కన మొద
వన ధేనునామముల్ ♦ దనరు (నభవ)
తే. యుక్షమునకు సమాఖ్యలై ♦ యొప్పుచుండు
గిత్త యె ద్దనఁ గోడె నాఁ ♦ (గృత్తివాస)
యా లనఁగ ధేనువుల కాఖ్య ♦ యలరు చుండు
(శైలజానాథ ప్రమథసం♦చయసనాథ). 8

టీ. తొట్టుపట్టులు, దొడ్డు - ఈ ౨ ను కొట్టమునకుఁ బేర్లు. కదుపులు, మొదవులు, పదువులు, మందలు - ఈ ౪ ను ఆవులగుంపునకుఁ బేర్లు. లేఁగ, దూడ, క్రేపు - ఈ 3 ను దూడలకుఁ బేర్లు. ఆవు, గిడ్డి, తొడుకు, మొదవు-ఈ ౪ ను గోవుల పేర్లు. గిత్త, ఎద్దు, కోడె - ఈ 3 ను ఎద్దునకుఁ బేర్లు. ఆలు [ఆవు+లు (వువర్ణలోపము)=ఆలు-బహువచనము.]-ఈ ౧ యుం ధేనువుల పేరు.

తే. అలరుఁ గుందేలు చెవులపో♦ తనఁగ శశక
మొప్పుఁ బొడలమెకంబు నా♦ దుప్పి యనఁగఁ
గాఱుకొమ్ములమెక మనం♦గను ధరిత్రి
రామనామమృగంబు (ధ♦రాశతాంగ). 9

టీ. కుందేలు, చెవులపోతు-ఈ ౨ ను కుందేటికిఁ బేర్లు. పొడలమెకము=మచ్చలుగలమృగము, దుప్పి, కాఱుకొమ్ములమెకము = సాంద్రశృంగములు గల మృగము-ఈ 3 ను దుప్పికిఁ బేర్లు.

తే. దుంత యెనుపోతు జమునెక్కి♦రింత దున్న
యనఁగ మహిషంబునకు సమా♦హ్వయము లమరుఁ
బరఁగు నెనుపెంట్లు గేదెలు ♦ బఱ్ఱె లెనుము
లనఁగ మహిషీసమాఖ్యలు ♦ (ధనదమిత్ర). 10

టీ. దుంత, ఎనుపోతు, జమునెక్కిరింత=యమునివాహనము, దున్న-ఈ ౪ ను మహిషంబునకుఁ బేర్లు. ఎనుపెంట్లు (ఎనుము+పెంటి = ఎనుపెంటి), గేదె, బఱ్ఱె, ఎనుము-ఈ ౪ ను మహిషీనామములు.

తే. పక్కి పులుఁగు పిట్ట యనంగఁ ♦ బక్షి యొప్పు
గఱులు ఱెక్కలు చట్టుప ♦ లెఱక లనఁగఁ
బక్షముల కివి పేళ్ళగుఁ ♦ బర్ణములకు
నాఖ్య లగు లావు లన నీఁక ♦ లనఁగ (నీశ). 11

టీ. పక్కి, (ప్రకృతి. పక్షి.) పులుఁగు, పిట్ట-ఈ 3 ను పక్షికిఁ బేర్లు. గఱులు, ఱెక్కలు, చట్టుపలు, ఎఱకలు-ఈ ౪ ను ఱెక్కలకు నామములు. లావు, ఈఁక-ఈ ౨ ను ఈఁకలకు నామములు.

సీ. తొలకరికలుగుపు♦ల్గులు నల్వతేజీలు
పాలు నీరును నేరు♦పఱచుపులుఁగు

లంచలు తెలిపిట్ట • లన నొప్పు హంసలు
క్రౌంచముల్ దనరారుఁ • గొంచ లనఁగఁ
గొక్కురా లనఁగను • గొక్కు లనంగను
గొక్కెర లనఁగను • గొంగ లనఁగఁ
బరఁగు నభిఖ్యలు • బకవిహంగములకు
నట్టువపులుఁగు నా • జుట్టుపులుఁగు
తే. నాఁగ నెమ్మన నెమిలి నా • నమ్మి యనఁగఁ
గేకికి సమాఖ్య లగుఁ జంచ•రీకములకు
నాఖ్యలు జమిలిముక్కాలి • యనఁగ దేఁటి
యనఁగఁ దుమ్మెద నా (నీశ • యభ్రకేశ). 12

టీ. ఱాలకరికలుగుపుల్గులు=వర్షాకాలమునఁ బాఱిపోవుపక్షులు, నల్వ తేజీలు=బ్రహ్మకు వాహనములు, పాలు నీరును నేరుపఱుచు పులుఁగులు= క్షీరోదకములను వేఱుపఱుచునట్టిపక్షులు, అంచలు, (ప్రకృతి. హంసలు.) తెలిపిట్టలు = తెల్లనిపక్షులు-ఈ ౫ ను హంసలకు నామములు. క్రౌంచలు-ఈ ౧ యు క్రౌంచపక్షులకుఁ బేరు. గొక్కురా, గొక్కు, గొక్కెర, గొంగ-ఈ ౪ ను బకమునకుఁ బేర్లు. నట్టువపులుఁగు=నాట్యముచేయుపక్షి, జుట్టుపులుఁగు = సిగగలపక్షి, నెమ్మి, నెమిలి, నమ్మి-ఈ ౫ ను కేకికి నామములు. జమిలిముక్కాలి=ఆఱుకాళ్లు గలది, తేఁటి, తుమ్మెద-ఈ ౩ ను భ్రమరము పేరులు.

తే. పరఁగు నొడ్డీలు కూకీలు • పల్లటీలు
పావురాలును బకదార్లు • పావురములు
నాఁగఁ గలరవపక్షిబృం•దముల పేళ్ళు
(పంకజాతాక్షసన్మిత్ర • ఫాలనేత్ర). 13

టీ. ఒడ్డీలు, కూకీలు, పల్లటీలు, పావురాలు(పారావతశబ్దభవము), బక శార్ఙ్గ, పావురములు-ఈ ౬ ను పావురములకుఁ బేరులు.

తే. పుడమిలోపలఁ జదువుల•పులుఁ గనంగఁ
జిగురువిల్కాని తేజి నాఁ • దొగరుముక్కు-
పులుఁ గనఁగ బచ్చ టెక్కల•పులుఁ గనంగఁ
జిలుక యన నొప్పుఁ గీరంబు • (శ్రీమహేశ). 14

టీ. చదువులపులుఁగు=మాటాడుపక్షి, చిగురువిలుకాని తేజి=మన్మథుని వాహనము, తొగరుముక్కుపులుఁగు = యెఱ్ఱనిముక్కుగలపక్షి, పచ్చ టెక్కలపులుఁగు = పచ్చనిటెక్కలుగలపక్షి, చిలుక-ఈ ౫ ను చిలుకకుఁ బేళ్లు.

తే. బట్టికాఁ డన గొరవంక•పిట్ట యనఁగఁ
బరఁగు శారిక యేట్రింత • పసులపోలి
గాఁడు కూఁకటిమూఁగ నాఁ•గను జెలంగు
నిల భరద్వాజవిహగంబు • (నీలకంఠ). 15

టీ. బట్టికాఁడు-పా. బట్టుకాఁడు, గొరవంకపిట్ట-ఈ ౨ ను గోరువంకకుఁ బేళ్లు. ఏట్రింత, పసులపోలిగాఁడు, కూఁకటిమూఁగ-ఈ 3 ను భరద్వాజపక్షికిఁ బేళ్లు.

తే. జాలె డేగనఁ గురుజు నా • సాళ్వ మనఁగఁ
గణుజు నాఁగను జలకట్టె • యనఁగ వేస
డం బనఁగ గిడ్డు నా నోర•ణం బనంగ
శ్యేనభేదంబు లగు (మహా•సేనజనక). 16

టీ. జాలె, డేగ, కురుజు, సాళ్వము, కణుజు, జలకట్టె, వేసడము, గిడ్డు, ఓరణము-ఈ ౯ యును శ్యేనవిశేషములకుఁ బేళ్లు.

తే. కోటఁ డనఁగను గూబ నా • ఘూక మమరుఁ
జిఱుతగూబ యనంగఁ బ•సిండికంటి
యనఁగ సకినాలపులుఁ గన • నలరుచుండుఁ
బృథివిఁ గనకాక్షి యనుపక్షి • (శ్రీమహేశ). 17

టీ. కోటఁడు, గూబ-ఈ ౨ ను గుడ్లగూబకుఁ బేరులు. చిఱుతగూబ=చిన్నగూబ, పసిఁడికంటి=బంగారమువంటి నేత్రములుగలది[సమాసాంతము.], సకినాలపులుఁగు=శకునములపక్షి-ఈ 3 ను బంగరుకంటిపిట్టకుఁ బేళ్లు.

తే. పాము సప్పంబు నిడుపఁడు • పడగదారి
గాలిమేఁతరి విసదారి • కానరాని
కాళ్ళయది చిల్వ వీనుల•కంటి పుట్ట
పెట్టెపట్టనఁ జను సహి • వేళ్ళ భర్గ. 18

టీ. పాము, సప్పము,[ప్రకృతి సర్పము.]నిడుపఁడు=దీర్ఘముగానుండునది, పడగదారి=పడగనుధరించినది, గాలిమేఁతరి=వాయుభక్షణముసేయునది, విసదారి = విషమునుధరించినది, కానరానికాళ్లయది = అగపడనిపాదములుగలది, చిల్వ-రూ. చిలువ, వీనులకంటి=చెవులే కన్నులుగాఁగలది, పుట్టపెట్టె పట్టు=వల్మీకమును బెట్టెయును నివాసముగాఁగలది-ఈ౧౦ యు సర్పమునకు నామములు.

క. ఇల నెంచ రుధిరమున కా
ఖ్యలు నల్ల యనంగ నెత్తు • రనఁగ ధరిత్రిం
బొల యీరు వెఱచి నంజుడు
పొల సన నివి పరఁగు మాంస•మునకు (మహేశా). 19

టీ. నల్ల, నెత్తురు-ఈ ౨ ను రక్తమునకుఁ బేళ్లు. పొల, ఈరువు, ఎఱచి, నంజుడు, పొలసు-ఈ ౫ ను మాంసమునకుఁ బేళ్లు.

క. భర్గుఁడు కాశీనిలయుఁడు
దుర్గాపతి యొసఁగు ముదము♦తో నీతిర్య
గ్వర్గ లిఖించినఁ జదివిన
దార్గత్యము లణఁచి సంప♦దలు నిత్యంబున్. 20

టీ. ఈతిర్యగ్వర్గ వ్రాసినను, జదివినను, కాశీవిశ్వేశునిదయవలన దారిద్ర్యములు దొలఁగి సంపదలు గలుగును.

తిర్యగ్వర్గ సమాప్తము.

---

## నానార్థవర్గ.

క. కలు పనఁ జే రగు దధికిం
గలు పన సస్యంబులోని ♦ గాదముపే రౌ
*వెలు గండ్రు కంపకోటను
వెలుఁ గందురు ప్రభను జనులు ♦ (విశ్వాధిపతీ). 1

టీ. 1. కలుపు=పెరుఁగు, పైరులోనికసవు. 2. వెలుగు=కంచె, వెలుఁగు=వెలుతురు.

మావు లనం దగు హయములు
మావు లనం బరఁగు నామ్ర♦మహీజంబు లిలం
దావు లన స్థల మొప్పును
వావు లనన్ వాసనలకుఁ ♦ దగుఁ బేరు (శివా). 2

టీ. 1. మావులు=గుఱ్ఱములు, మామిడిచెట్లు. 2. తావులు=చోటులు,

---

* ఇది అరసున్న గలప్పుడు కాంతికిని, లేనప్పుడు కంపకోటకును పేరగును.

వానలు. [పైరెండుపదములకును బహువచనమందే యీయర్థభేదంబు చెప్ప వీలగునుగాని యేకవచనంబున నివి వేర్వేఱు అంతములుగలవి గావున నర్థద్వయము చెప్ప వీలుగాదు. ఏకవచనమున గుఱ్ఱమునకు "మావు" మామిడిచెట్టునకు "మావి" యని రూపములు.]

క. ఇమ్మహిలోపలఁ బేరగుఁ
గొమ్మ యనఁగ వృక్షశాఖ♦కును భామినికిం
దమ్ము లనం బేరగుఁ బ
ద్మముల కనుజన్ములకును ♦ (దరుణేందుధరా.) 3

టీ. 1. కొమ్మ= చెట్టుయొక్క కొమ్మ, ఆఁడుది. 2 తమ్ములు=తామరలు, అనుజులు. [ఏకవచనమున నర్థద్వయమురాదు. తామరకు 'తమ్మి' అనుజునికి 'తమ్ముఁడు' అని రూపభేదము.]

క. ఇమ్ములఁ బేరగుఁ దాటం
కమ్ములకున్ లేఖలకును ♦ గమ్మ లనఁగ నా
మమ్ము దగుం గంఠాభర
ణమ్మునకును లతకుఁ దీఁగె ♦ నా (గౌరీశా). 4

టీ. 1. కమ్మ=చెవికమ్మ,ఉత్తరము(జాబు). 2. తీఁగె=మెడనూలు,లత.

క. చెల్లును బేళ్లై ధరలోఁ
దాళ్లన సూత్రంబులకును ♦ దాళంబులకుం
గోళ్లనఁ గుక్కుటములకును
బేళ్లగు ఖట్వాంగములకుఁ ♦ బేళ్లగు (నభవా). 5

టీ. 1. తాళ్లు=పగ్గములు, తాటిచెట్లు,[ఏకవచనములోఁ రాదు. పగ్గము=తాడు,తాటిచెట్టు=తాడి.]. 2. కోళ్లు=కుక్కుటములు, మంచపుఁగోళ్లు. [ఈ యర్థమౌ ఏకవచనములోఁ రాదు. కుక్కుటము=కోడి,మంచపుఁగోడు=కోడు.]

క. చామ యన సస్యమునకును
భామినికిని నాఖ్య యగుచుఁ • బరఁగు ధరిత్రిన్
నామము లగుచును వెలయును
బాము లనన్ జన్మములకు • భంగమ్ములకున్. 6

టీ. 1. చామ=ధాన్యవిశేషము, ఆఁడుది. 2. బాము=పుట్టుక, తిరస్కారము.

తే. దంట యనఁగ నభిఖ్య యై • దనరుచుండు
జగతిలోపలఁ బ్రౌఢకు • యుగళమునకుఁ
బఱ పనంగ నభిఖ్య యౌఁ • బానుపునకు
విస్తృతమునకు (శైలని•వేశ యీశ). 7

టీ. 1. దంట=ప్రౌఢాంగన, జంట. 2. పఱపు=పానుపు, వ్యాపించుట.

క. తొలి యనఁగా నగు నామం
బులు పూర్వంబునకు సుషిర•మునకును ధరలో
వెలి యనఁగ బహిర్థవళం
బులకును నామంబు (శేష•భుజగవిభూషా). 8

టీ. 1. తొలి=మునుపు, బెజ్జము. 2. వెలి=బయలు, తెలన.

క. నెమ్మి యనన్ వంజులవృ
క్షమ్మునకున్ బర్హికిని సు•ఖస్థితికిని నా
మమ్ముగఁ దగు (నళిధీర య
హమ్మతిజనదూర పన్న•గాధిపహారా). 9

టీ. నెమ్మి=వంజులవృక్షము, నెమిలి, సౌఖ్యము గలిగియుండుట.

క. పోలం బే రగుచుండును
బా లనఁగా క్షీరమునకు • భాగంబునకుం

గా లనఁ జే రగు నాలవ
పాలికిఁ బాదంబునకును ♦ (బాలేందుధరా). 10

టీ. 1. పాలు=క్షీరము, భాగము. 2. కాలు=పాదము, నాలవభాగము.

క. మే లన శుభంబు పే రగు
మే లన నుపరికిని గూరి♦మికినిం జే రా
మే లన మెచ్చునఁ బల్కిన
యాలాపంబునకు నాఖ్య ♦ యగు (జగదీశా). 11

టీ. మేలు=శుభము, పైభాగము, ప్రేమ, మంచిగాఁ జెప్పినమాట.

క. ధారుణిఁ బేరు వహించును
బూరుగు నా నూఁదువాద్య♦మును శాల్మలియుం
బే రన నభిధానం బగు
హారమునకు నామమునకు ♦ (నంబరకేశా). 12

టీ. 1. బూరుగు=వాద్యవిశేషము, బూరుగుచెట్టు. 2. పేరు=ఒకసామము, దండ.

క. క ప్పన నీలిమ పే రగుఁ
గ ప్పనఁగా నింటిమీఁది♦కసవుకుఁ జే రౌఁ
గొ ప్పనఁ దగుఁ జూపాగ్రము
నొ ప్పగు ధమ్మిల్లమును గృ♦హోపరియు (శివా). 13

టీ. 1. కప్పు=నలుపు, ఇంటిమీఁదవేయుపూరి. 2. కొప్పు=ఇంటికొన, స్త్రీలకొప్పు, ఇంటియొక్కనడికొప్పు.

క. ఒకభూరుహమునకును ధమ
నికిఁ బే రగుఁ గ్రోవి యనఁగ ♦ నెఱి నట్టుల వే
ఱొకభూజమునకు నధరము
నకుఁ బే రగు మోవి యనిన ♦ (నగరాట్చాపా). 14

టీ. 1. క్రోవి=గోరింట చెట్టు, గొట్టము. 2. మోవి=ఒక చెట్టు, పెదవి.

క. చవు లనఁగా నభిధానము
లవు షడ్రుచులకును ము త్తి•యపు పేరులకున్
భువిలోపల నామము లగు
గవు లన గుహాలకునుఁ బూతి•గంధంబులకున్ 15

టీ. 1. చవులు = ఆఱురుచులు, ముత్యాలసరము. 2 గవులు=గుహాలు, దుర్వాసన, కంపు. (మొదటియర్థమున బహువచనము. దీనికి ఏక. గవి. రెండవయర్థమున నిది ఏకవచనము.)

తే. ఆఖ్య యై యొప్పు ధరణిలో • నపరదివస
మునకు ఛత్త్రంబునకు నెల్లి • య నెడినుడువు
జక్కి యను పేరు పరఁగును • సైంధవంబు
నకు ఘురట్టంబునకును (గం•దర్పదమన). 16

టీ. 1. ఎల్లి=రేపు అనుట, గొడుగు. 2. జక్కి=గుఱ్ఱము, తిరుగలి.

తే. ఆడె ననుమాట నటియించె • ననుటకును వ
చించె ననుటకు మఱియు నిం•దించె ననుట
కాఖ్య యగుచును శోభిల్లు • నాలు నాఁగ
గోవులకు భార్యకును బే ర•గు (స్మహేశ). 17

టీ. 1. ఆడెను=నాట్యము చేసెను, పలికెను, నిందించెను. 2. ఆలు = (బహువచనము) గోవులు, (ఏకవచనము) భార్య. (దీనికి బహువచనము అండ్రు).

సీ. రజతపునగపదా•ర్థములకు నభిధాన
మగు వెండి యన బంతి • యనఁగఁ గందు
కమునకు శ్రేణికి • నమరు నాహ్వయముగా
దండ యనం బుష్ప•దామమునకు

[illegible] బ • ంగారు ద రి యన నాఖ్య
యగు సదృశమునకు • నవనిపతికి
నస్త్రసంఖ్యకు నహ • మ్మనుటకు నాహ్వయం
బగు నే ననఁగ సరి • యనఁగ సదృశ
తే. మునకు సమసంఖ్యకును నామ•ముగ నెసంగు
గొం తనఁగ నాహ్వయం బగుఁ • గుక్కుటాస
నంబునకుఁ గంఠమునకును • నల్ల యనిన
ర_క్తనీలాఖ్య యై యొప్పు • (రాజమకుట). 18

టీ. 1. వెండి=రజతము, మరల. 2. బంతి=చెండు, వరుస. 3. దండ=పూలదండ, సమీపము. 4. దొర=సమానము, రాజు. 5. ఏను=అయిదు, నేను. 6. సరి=సమానము, సమసంఖ్య. 7. గొంతు=కుక్కుటాసనము, మెడ. 8. నల్ల=నెత్తురు, నలుపు.

సీ. తీరంబునకు ధరి• త్రీధరంబునకు స
మాఖ్య యై యొప్పు గ • ట్టనఁగ (నీశ)
కేతువునకుఁ గాంతి•కిని సమాహ్వయ మగు
డా లనంగను (మేరు•శైలచాప)
శౌర్యధుర్యునకు లాం•ఛనమునకును నామ
మగు బిరు దనఁగఁ (బ•న్నగవిభూష)
గూబ నా నాఖ్య యా • ఘూకంబునకుఁ గర్ణ
మూలంబునకు (నవి•ము_క్తనిలయ)
తే. యంతికంబునకును సమూ•హంబునకును
నామ మై యొప్పుఁ జేరువ • నాఁగ (నభవ)
సమభిధాన మై యొప్పుఁ బి•శాచమునకు
బవనమునకును గాలి య•న్పలుకు (రుద్ర). 19

టీ. 1. గట్టు=తీరము, పర్వతము. 2. డాలు=ఖేటకము, కాంతి. 3. బిరుదు = కార్యము, గుఱుతు. 4. గూబ=గుడ్లగూబ, చెవిమొదలు. 5. చేరువ=దగ్గఱ, గుంపు. 6. గాలి=దయ్యము, వాయువు.

క. ఇలలోపల నామం బగు
బలుకులు నాశకలములకు ♦ భాషణములకున్
నెల యన నభిధానం బగు
జలజారికి మాసమునకు ♦ (శైలనిశాంతా). 20

టీ. 1. పలుకు=మాట, తునుక, 2. నెల=చంద్రుఁడు, మాసము.

సీ. అంతర్హితుం డయ్యె ♦ ననుటకు నాగతుం
డయ్యె ననుటకు స♦మాఖ్య యగుచు
నలరును విచ్చేసె ♦ ననుట (యంబరకేశ)
నెఱి సమాహ్వయ మగుఁ ♦ గఱచె ననఁగ
నభ్యాస మొనరించె ♦ ననుటకు దంతపీ
డ యొనర్చె ననుటకు ♦ (నయుగనయన)
వెలయుఁ దప్తక్షీర♦ములకు నభిజ్ఞకు
నాఖ్యయై యానవా ♦ లనుట (యీశ)
తే. పఱచె ననఁగ సమాఖ్యయౌ ♦ బాధ చేసెఁ
బ్రచలితుం డయ్యె ననుటకుఁ ♦ (బాండురాంగ)
పరఁగ మోహించె ననుటకుఁ ♦ బరిమళించె
ననుట కొప్పును వలచె నా ♦ (నళికనేత్ర). 21

టీ. 1. విచ్చేసెను-రూ. వేంచేసెను=వచ్చెను, కనఁబడకపోయెను. 2. కఱచెను=నేర్చుకొనెను, కొఱికెను. 3. ఆనవాలు=కాఁగినపాలు, గుఱుతు. 4. పఱచెను = ఇడుమలఁబెట్టెను, ప్రయాణమాయెను. 5. వలచెను=కోరెను, పరిమళించెను.

సీ. ఆనెనంట సమాఖ్య • యగాను వహించెఁ బా
నము చేసె ననుటకు • (నగనివేశ)
చషకంబునకును దం • ష్ట్రకు నాఖ్య యగుఁ గోర
యనఁగ (శశాంకక • ళావతంస)
మొక్కలీఁ డనఁగఁ గొ • మ్ములు లేనికరికి ము
ష్కరునకుఁ బే రగు • (గరళకంఠ)
మరకతచ్ఛవికి నం • బరమున కగుఁ బేరు
పచ్చడం బనిన (నం • బాకళత్ర)
తే. క్షితిని దురగీపతికి వృత్త • శిలకు నామ
ధేయ మై యొప్పు గుండు నాఁ • (త్రిపురహరణ)
నామ మగు నొక్కసస్యంబు • నకును లోప
మునకుఁ గొఱ్ఱ యనంగ (నం • బుదనిభాంగ). 22

టీ. 1. ఆనెను = మోచెను, త్రాగెను 2. కోర=గిన్నె, పెద్దపన్ను. 3. మొక్కలీఁడు=కొమ్ములులేనియేనుఁగు, మూర్ఖుఁడు. 4. పచ్చడము=పచ్చల కాంతి, పైవేసికొనువస్త్రము. 5. గుండు=మగగుఱ్ఱము, గుండ్రనిబండ. 6. కొఱ్ఱ=ధాన్యవిశేషము, కొఱఁత.

సీ. తాల్పు నాఖ్యను వధూ • ధమ్మిల్లభారంబుఁ
గోణంబు మూల నాఁ • (గుధరచాప)
గాలి యనునాఖ్యచేఁ • గాలిలు లోపంబు మ
నోజ్ఞవస్తువు (దక్ష • యజ్ఞమథన)
నెఱి హేయపడిరియు న • న్వేషించె ననురెంటి
కాఖ్య యగు రోసె నా • (నసితకంఠ)
నరసె నాఁ బే రగు • నార్తి వారించె వి
మర్శించె ననుటకు • (మదనదమన)

తే. చరణమునకు నధరప్రదేశంబునకు స
మాఖ్యయై యొప్పు నడుగు నా ♦ (నళినేత్ర)
మహిని బేరగుచుండుఁ బ్రమాణికంబు
నకును భాషకు బాస నా ♦ (నగనివేశ). 23

టీ. 1. మూల=స్త్రీకొప్పు, విడిక్కు. 2. కొఱ=కొఱ్ఱలనుధాన్యము, మనోజ్ఞవస్తువు. 3. రోసెను=వెగటొందెను,వెదకెను. 4. అరసెను=బాధనివారించెను, విచారించెను. 5. అడుగు,పాదము,క్రిందిభాగము. 6. బాస=ఒట్టు, భాష.

సీ. నాగవాస మన ఘంటాప్రతీకమునకు
వేశ్యల కగుఁ బేరు ♦ (విశ్వనాథ)
నామ మానందంబునకు నంధకునకును
గ్రుడ్డనంగను (రౌప్యకుధరనిలయ)
చర్మవాద్యమున కుష్ణమునకుఁ బేరగు
నుడుకనియెడునాఖ్య ♦ యుడుపమకుట)
యభిధానమగు మేడి ♦ యన హలాంగమునకు
దుంబరమునకును ♦ (ధూతకలుష)
తే. కల్లనఁగ శిల సురయు నౌ ♦ (గరళకంఠ)
పరఁగు నాఖ్యయు లాంగలపద్ధతికిని
శ్రేణికిని జాలనంగ (భాసితసితాంగ)
(వారిధినిషంగ కాశీనివాసలింగ). 24

టీ. 1. నాగవాసము = గంటలోనిచీల, వేశ్యలు. 2. గ్రుడ్డు=కన్నులు తెలియనివాఁడు, అండము. 3. ఉడుకు=ఒకవాద్యము, వేఁడిమి. 4. మేఁడి =నాఁగేటి వెనుకటి పట్టుకొయ్య, (మేడి) = అత్తిచెట్టు. 5. కల్లు = ఱాయి, మద్యము. 6. చాలు=వరుస, నాఁగేటిచాలు.

తే. జననికిని మాతృజననికి ♦ జనకజనని
కాఖ్య యగు నవ్వ యనఁగ (నా♦ర్యాసహాయ)
భగినికిని జనకునకు నా♦హ్వాయము దనరు
నప్ప యనఁగను (జంద్రరే♦ఖావతంస). 25

టీ. 1. అవ్వ=తల్లి, తల్లితల్లి, తండ్రితల్లి. 2. అప్ప=అక్క, తండ్రి

క. పోతనఁగఁ బరఁగు మహిషము
భూతలమునఁ బురుషమృగము ♦ బురుషఖగంబుం
దా తన ధాతృ పితామహ
మాతామహులకును నగు స♦మాఖ్య (మహేశా). 26

టీ. 1. పోతు=దున్నపోతు, పురుషమృగము, మగపక్షి. 2. తాత=బ్రహ్మ, తండ్రితండ్రి, తల్లితండ్రి (తండ్రి).

క. పుడమిని బేరు వహించును
వడిగలవాఁ డనఁగ శౌర్య♦వంతుఁడు జవియుక్
నడు మన నవలగ్నముఁ జె
న్నడరఁగ మధ్యస్థలంబు ♦ నగు (నగధన్వీ). 27

టీ. 1. వడిగలవాఁడు = శౌర్యవంతుఁడు, వేగము గలవాఁడు. 2. నడుము=మధ్యము, మధ్యప్రదేశము.

క. ఎద యనఁగఁ బరఁగు భీతికి
హృదయమునకు వక్షమునకు ♦ నిల జోడనఁగా
నది దనరు నామ మగుచును
సదృశమునకు వర్మమునకు ♦ (జంద్రార్ధధరా). 28

టీ. 1. ఎద=భయము, హృదయము. 2. జోడు=సమానము, కవచము.

క. నానార్థవర్గు విదిత
స్థానముతో దీనిఁ జదివి◆నను వ్రాసిన నా
మానవుల కబ్బు నెప్పుడు
నానార్థంబులును విశ్వ◆నాథునికరుణన్. 29

**టీ.** ఈనానార్థవర్గును చదివినవారికి, వ్రాసినవారికి సకలసంపదలును కలుగును.

గద్యము. ఇది శ్రీమదేకామ్రమంత్రిపుత్త్ర కౌండిన్యగోత్రపవిత్ర సదారాధిత మహేశ్వర పైఁడిపాటి లక్ష్మణకవిప్రణీతంబైన యాంధ్రనామసంగ్రహం బను నిఘంటువునందు సర్వంబు నేకాశ్వాసము.

సటీకాంధ్రనామసంగ్రహము

**స మా ప్త ము.**

---

శ్రీ ర స్తు.

# సటీకాంధ్రనామశేషము.

---

అవతారిక.

ఆంధ్రనామశేష మనెడు నీనిఘంటువును రచియించిన అడిదము సూరయ యనెడు కవి తాను జేయఁబూనినగ్రంథము నిర్విఘ్న పరిసమాప్తి నొందుటకుఁగాను గృతినాయకుఁడగునీశ్వరుని సంబోధనరూపముగాఁ బ్రార్థించి, తదంకితముగా గ్రంథనామపూర్వక ప్రతిజ్ఞను రెండుపద్యములచేతఁ జేయుచున్నాఁడు.—

క. శ్రీగౌరీప్రియవల్లభ
రాగద్వేషాదిరహిత • రమ్యచరిత్రా
యోగిధ్యేయపదాంబుజ
భోగివలయ రామచంద్ర•పురవరనిలయా.

టీ. శ్రీగౌరీప్రియవల్లభ = శోభాయుక్తురాలయిన పార్వతీదేవికిఁ బ్రియనాథా! రాగద్వేషాదిరహిత=రాగద్వేషాదిదోషములు లేనివాఁడా! రమ్య చరిత్రా=మనోహరమైనచరితములుగలవాఁడా! యోగిధ్యేయపదాంబుజ = నిష్ఠగలవారిచేధ్యానముసేయఁదగిన పాదారవిందములుగలవాఁడా! భోగివలయ = సర్పములు హస్తకంకణములుగాఁగలవాఁడా! రామచంద్రపురవరనిలయా = శ్రేష్ఠమైనరామచంద్రపురము నివాసముగాఁగలవాఁడా! (ఓపార్వతీశా!)

వ. అవధరింపుము.

టీ. నాచేయఁబోవు గ్రంథమును సావధానమనసుగలవాఁడవై యాల కింపుము.

ఆ. ఆంధ్రనామసంగ్ర ♦ హామునందుఁ జెప్పని
కొన్ని తెలుఁగు మఱుఁగు ♦ లన్నిగూర్చి
యాంధ్రనామశేష ♦ మనుపేరఁ జెప్పెద
దీనిఁ జిత్తగింపు ♦ దేవదేవ. 3

తా. దేవదేవా! ఆంధ్రనామసంగ్రహమునఁ జెప్పకవిడిచిన కొన్ని తెలుఁగు కఠినపదములనుగూర్చి యాంధ్రనామశేష మనుపేరుతోఁ జెప్పఁ బూనితిని. దానిని మనఃపూర్వకముగా నాలకింపుము.

క. తఱి యజ్జ దన నన సమయం
బుఱఁ డనఁగను సరకుసేయ ♦ కుండె ననఁగ బే
ళ్ళొఱ పగు గణింపఁ డనుటకుఁ
(గరిచర్మాంబరత్రినేత్ర ♦ గౌరిమిత్రా). 4

టీ. తఱి, అజ్జ, అదను - ఈ 3 ను సమయమునకుఁ బేరులు. ఉఱఁ డు, సరకుసేయకుండెను-ఈ ౨ ను లక్ష్యపెట్టఁడనుటకుఁ బేర్లు.

తే. పెంపుసెందెను దామర ♦ తంపరయ్యెఁ
బ్రబలె నెగడెను గొనసాగె ♦ బలిసె పెరిఁగె
ననఁగ రేకెత్తె ననఁగ బే ♦ ళ్ళయ్యె వృద్ధి
బొందె ననుటకు (శేషాహి ♦ భూషితాంగ). 5

టీ. పెంపుసెందె, తామరతంపరయ్యె, ప్రబలె, నెగడె, గొనసాగె, బలిసె, పెరిఁగె, రేకెత్తె-ఈ ౮ యుఁను వృద్ధిఁబొందె ననుటకుఁ బేర్లు.

తే. పేర్మి యర్మిలి మక్కువ ♦ కూర్మి నెమ్మి
నెనరు గాదిలి గారాము ♦ నెయ్య మింపు

ప్రేముడి యనుంగు ముద్దనఁ • బ్రియమునకును
నామధేయంబు లయ్యెఁ (బి•నాకపాణి). 6

టీ. పేర్మి, ఆర్మిలి, మక్కువ, కూర్మి, నెమ్మి, నెనరు, గాదిలి, గారాము-చూ. గారము, నెయ్యము, ఇంపు, ప్రేముడి, అనుంగు, ముద్దు-ఈ ౧౩ ను ప్రియమునకుఁ బేర్లు.

క. ఒనఁగూర్చె ననఁగ సమకూ
ర్చె ననఁగ వీల్పఱిచె ననఁగఁ • జేకూర్చెను నా
ననుకూలపఱిచె ననుటకుఁ
దనరును నామంబు లై (సు•ధాకరమకుటా). 7

టీ. ఒనఁగూర్చెను, సమకూర్చెను; వీల్పఱిచెను-రూ. వీలుపఱిచెను. చేకూర్చెను-ఈ౫ ను అనుకూలపఱిచె ననుటకుఁ బేర్లు.

క. చరియించె ననుట కాఖ్యలు
తిరిగెను జెరలాడె ననఁగఁ • ద్రిమ్మరె ననఁ గ్రు
మ్మరె ననఁగ మసలె ననఁగా
(బురదానవహరణ శేష•భుజగాభరణా). 8

టీ. తిరిగె, చెరలాడె, త్రిమ్మరె, క్రుమ్మరె, మసలె-ఈ ౫ ను చరియించె ననుటకుఁ బేర్లు.

తే. ఆఱుమూఁడయ్యెఁ గచ్చువి•చ్చయ్యె ననఁగ
బెడిసె బుసివోయె ననఁగను • జెడియె ననఁగ
నాఖ్య లగుఁ గార్యవైకల్య • మయ్యె ననుట
(కంధకాసురహరణ రౌ•ప్యాద్రిశరణ). 9

టీ. ఆఱుమూఁడయ్యె, కచ్చువిచ్చయ్యె, బెడిసె, బుసివోయె, చెడియె-ఈ ౫ ను కార్యముచెడె ననుటకుఁ బేర్లు.

క. అలజడి నెంజిలి పిమ్మట
సిలు గుత్తలపాటు వంత • సేగి నెగుల్ గొం
దల మలమ టడరు గోడు
మ్మలిక వనటఁ గుందు నా న•మరు దుఃఖాఖ్యల్. 10

టీ. అలజడి, నెంజిలి, పిమ్మట, సిలుగు, ఉత్తలపాటు (ఉత్తలము+పాటు), వంత, సేగి, నెగులు, కొందలము, అలమట, అడరు, గోడు, ఉమ్మలిక-రూ. ఉమ్మలికయు, వనట, కుందు-ఈ౧౫ను దుఃఖమునకుఁ బేర్లు.

క. అరిది వెఱఁ గచ్చెరు వ
బ్బురమబ్రం బనఁగ జిత్ర•మునకుం బేర్లౌ
సరణికిఁ బేళ్లగుఁ ద్రోవనఁ
దెరు వన దారి యన బాట • తెన్నన (నభవా). 11

టీ. అరిది, వెఱఁగు, అచ్చెరువు, అబ్బురము, అబ్రము-ఈ౫ను చిత్రమునకుఁ బేర్లు. త్రోవ, తెరువు, దారి, బాట, తెన్ను-ఈ౫ను మార్గమునకుఁ బేర్లు.

తే. ఐదుపదిచేసె వెనుకముం•దయ్యె జుణిఁగె
వీఁగె వెన్నిచ్చె వెనుకంజ•వేసె ననఁగ
నోహటించె ననంగఁ బే•ర్లొప్పుచుండు
నాహవపరాఙ్ముఖుం డయ్యె • ననుట (కభవ). 12

టీ. అయిదుపదిచేసె (ముందునకొకయడుగుపెట్టి యుద్ధముసేయనున్నవాఁడు జడిసి కాలు వెనుకఁబెట్టుట), వెనుకముందయ్యె, జుణిఁగె, వీఁగె, వెన్నిచ్చె = వీఁపుచూపెను, వెనుకంజవేసె (వెనుక+అంజ+వేసెను) = వెనుకడుగుపెట్టెను, ఓహటించె - ఈ ౭ ను యుద్ధమందు పరాఙ్ముఖుఁ డయ్యె ననుటకుఁ బేరులు.

తే. మోహరించెను దండెత్తె • మొనసె దాడి
చేసెఁ బోటొగ్గెఁ గోల్తలు•చేసె మాఱు

కొనియు దళమెత్తె ననఁగ బే • ర్లొనరుచుండు
నాహవోద్యోగ మొనరించె • ననుట (కభవ). 13

టీ. మోహరించె, దండెత్తె, మొనసె, దాడిచేసె, పోటొగ్గె, కొట్లలు చేసె, మాఱుకొనియె, దళమెత్తె - ఈ ౮ యు యుద్ధప్రయత్నముచేసెననుటకుఁ బేర్లు.

తే. ఆహవోన్ముఖతకు నోల•మాసగొనక
పిఱుతివియ కీడఁబో కనఁ • బేళ్లు దనరు
నజ్జెసమొనర్చఁ గఱచె నా • నభ్యసించె
ననుట కభిధానములు (చంద్ర•మావతంస). 14

టీ. ఓలమాసగొనక, పిఱుతివియక, ఈడఁబోక - అన నీ ౩ను యుద్ధాభిముఖతకుఁ బేర్లు. అజ్జెసమొనర్చె, కఱచె - ఈ ౨ ను అభ్యసించె ననుటకు నామములు.

క. వేఱొకటనఁ బైపెచ్చన
మాఱట యిమ్మడి యనఁగ స•మాహ్వయములు పెం
పారును వస్త్వంతరమున
(కారగకేయూరసహిత•హాత మారజితా). 15

టీ. వేఱొకటి, పైపెచ్చు, మాఱట, ఇమ్మడి-ఈ ౪ను వస్త్వంతరమునకుఁ బేర్లు.

సీ. ఆఱడిపోయెను • బీఱువోయెను రిత్త
వోయెను పీసర•వోయె ననఁగ
నుడివోయెఁ బొలివోయె • సుడివోయె ననఁగను
వ్యర్థ మయ్యె నటంట • కాఖ్య లయ్యెఁ
గడిమి బీరంబు మ•గంటిమి గండన
విక్రమాహ్వయములై • వెలయుచుండు

నాస్ఫాలన మొనర్చె • ననుటకుఁ జఱచె నా
నప్పళించె ననంగ • నాఖ్య లయ్యె
తే. నొగివరుస నోలి సొరిది నా • నోజ నాఁగఁ
క్రమమునకు నాఖ్యలయ్యెను • (గాలకంఠ)
కొఱ కొఱఁత తక్కువ వెలితి • కొదవ కడమ
యనఁగ నూనంబునకు నాఖ్య • లై తనర్చు. 16

టీ. ఆఱడివోయె, బీఱువోయె, రిత్తవోయె, పిసరవోయె, ఉడివోయె, సోలివోయె, సుడివోయె-ఈ ౭ ను వ్యర్థమయ్యె ననుటకుఁ బేర్లు. కడిమి, బీరము, మగఁటిమి, గండు-ఈ ౪ను విక్రమమునకుఁ బేళ్లు. చఱచె, అప్పళించె-ఈ౨ను అరచేతితో బాఁదె ననుటకుఁ బేళ్లు. ఒగి, వరుస, ఓలి[ప్ర. ఆళి.], సొరిది, ఓజ-ఈ ౫ ను క్రమమునకు బేళ్లు. కొఱ, కొఱఁత, తక్కువ, వెలితి, కొదవ, కడమ-ఈ ౬ ను ఊనమునకుఁ బేర్లు.

తే. నెట్టుకొనెఁ బాలుపడె నొడి•గట్టె ననఁగఁ
గడఁగెఁ దొడఁగెను జెలరేఁగెఁ • గాలుద్రొక్కెఁ
గవిసెఁ గదిసె ననంగ నా•ఖ్యలయి యొప్పు
నభిముఖుం డయ్యె ననుటకు • (నగనివేశ). 17

టీ. నెట్టుకొనె, పాలుపడె, ఒడిగట్టె, కడఁగె, తొడఁగె, చెలరేఁగె, కాలుద్రొక్కె, కవిసె, కదిసె-ఈ ౯ యును అభిముఖుం డయ్యె ననుటకుఁ బేర్లు.

తే. అగపడకపోయె విచ్చుమొ•గ్గయ్యె ననఁగఁ
గంటఁబడదయ్యెఁ బంచబం•గాళమయ్యె
ననఁగ దృగగోచరం బయ్యె • ననుట పేళ్లొ
(శయఘటితశూల వైయాఘ్ర•చర్మచేల). 18

టీ. అగపడకపోయె, విచ్చుమొగ్గయ్యె, కంటఁబడదయ్యె, పంచబంగాళమయ్యె-ఈ ౪ ను కంటికిఁ గనఁబడలేదనుటకుఁ బేర్లు.

క. వెలిచవి చీఁకటితప్పనఁ
బొలుపారఁగ జారభావ•మునకుం బే ర్లౌఁ
బులు కసటు చిలు మనంగను
మలిన మనుట కాఖ్య లయ్యె • (మనసిజదమనా). 19

టీ. వెలిచవి, చీఁకటితప్పు-ఈ ౨ ను జారభావమునకుఁ బేర్లు. పులు, కసటు, చిలుము-ఈ 3 ను మలినమనుటకుఁ బేర్లు.

ఆ. వింగడం బనంగ • విపరీత మగు నుక్కి-
వం బనఁగను గుత్సి•తంబు పరఁగు
నాఖ్య యగుచుఁ దనరు • నామని యనఁగను
మదమునకును (జంద్ర•మగకలాప). 20

టీ. వింగడము-ఈ ౧ యు విపరీతమునకుఁ బేరు. ఉక్కివము-ఈ ౧ యు కుత్సితమునకుఁ బేరు. ఆము-ఈ ౧ యు మదమునకుఁ బేరు.

క. ఎల యం్రదు తరుణ మనుటకు
గొల యన దురితంబు పేరు • కుడియెడమ లనన్
వలపలదాపల లనఁగను
బొలుపుగ నపసవ్యసవ్య•ములకుం బే ర్లౌ. 21

టీ. ఎల-ఈ ౧ యు తరుణమునకుఁ బేరు. కొల-ఈ ౧ యు దురితమునకుఁ బేరు. కుడియెడమలు, వలపలదాపలలు-ఈ ౨ ను క్రమముగా దక్షిణవామభాగములకుఁ బేర్లు.

క. తగు సౌధత్యము పేళ్లై
పొగ రన నా మనఁగఁ ద్రుళ్లు • పోతర మనఁగా

నెగడును భయంబుపేళ్లై
బెగడు దిగులు వెఱపు జంకు • బీ తలు కనఁగన్. 22

టీ. పొగరు, ఆము, త్రుళ్ళు, పోతరము—ఈ ౪ ను గర్వమునకుఁ బేరులు. బెగడు, దిగులు, వెఱపు, జంకు, బీతు, అలుకు—ఈ ౬ ను భయమునకుఁ బేరులు.

క. అరి యనఁ గప్పం బనఁగాఁ
గరమునకుం బేళ్లు కాఁగు • కడవ పనఁటి నాఁ
బరఁగు ఘటాఖ్యలు (నమితా
మరమానినికాయ భూతి•మండితకాయా). 23

టీ. అరి, కప్పము—ఈ ౨ను పన్నునకుఁ బేళ్ళు. కాఁగు, కడవ, పనఁటి—రూ. పంటి—ఈ ౩ ను ఘటమునకుఁ బేళ్లు.

క. అలరుచుండును గొండ్లి రం • తనఁగఁ గేళి
హాని కాఖ్యలు చేటు కీ • డఱ యనంగ
హెచ్చరిక హాళి సంతసం • బెలమి వేడ్క
యనఁగ నానందమున కాఖ్య • లై తనర్చు. 24

టీ. గొండ్లి, రంతు — ఈ ౨ ను కేళికిఁ బేళ్లు. చేటు, కీడు, అఱ—ఈ ౩ను హానికిఁ బేరులు. హెచ్చరిక, హాళి, సంతసము, [ప్రకృతి. సంతోషము.] ఎలమి, వేడ్క—రూ. వేడుక—ఈ ౫ ను ఆనందమునకుఁ బేళ్లు.

క. సాహిణ మనఁ బాగా యన
వాహాగారంబునకును • వర్తిలుఁ బేళ్లై
వ్యూహమున కాఖ్య లయ్యెను
మోహర మన నొడ్డనంగ • మొగ్గర మనఁగన్. 25

టీ. సాహిణము, పాగా-ఈ 2 ను హయమునకుఁ బేరులు. మోహరము, ఒడ్డు, మొగ్గరము-ఈ 3 ను వ్యూహమునకుఁ బేరులు.

క. ఒనరించె ననఁగఁ గావిం
చె ననంగను సలిపె ననఁగఁ ♦ జేసె ననంగాఁ
జను నాచరించె ననుటకుఁ
(గనకాచలచాప చంద్ర♦ఖండకలాపా). 26

టీ. ఒనరించె, కావించె, సలిపె, చేసె-ఈ 4 ను ఆచరించె ననుటకు నామములు.

తే. చీఁకువా లిరు లనఁగను ♦ జీఁకటి యనఁ
దిమిరమునకు నభిఖ్య లై ♦ తేజరిల్లు
నాఖ్య లై తనరారు ను♦పాయమునకు
సుళు వనఁగ వెర వనఁగను ♦ సూటి యనఁగ. 27

టీ. చీఁకువాలు, ఇరులు (ఏకవచన.), చీఁకటి-ఈ 3 ను అంధకారమునకుఁ బేరులు. సుళువు, వెరవు, సూటి-ఈ 3 ను ఉపాయమునకుఁ బేరులు.

తే. చేరువయ్యెను డాసెను ♦ దారసిల్లె
ననఁగ సన్నిహితం బౌట ♦ కాఖ్య లయ్యె
స్థూల మనుటకుఁ బేళ్లగుఁ ♦ దోర మనఁగఁ
గడిఁది వలుఁద యనంగను ♦ (గాలకంఠ). 28

టీ. చేరువయ్యె, డాసె-రూ. దాసె, తారసిల్లె-ఈ 3 ను సమీపించె ననుటకుఁ బేరులు. తోరము, కడిఁది, వలుఁద-ఈ 3 ను స్థూలమనుటకుఁ బేళ్లు.

తే. వాఁడెఁ గసుగందె ననఁ బుయి♦లోఁడె ననఁగ
విన్నవోయె ననంగను ♦ జిన్నవోయె
ననఁగఁ బేళ్లగు నివి ఖిన్నుఁ♦డయ్యె ననుట
(కంధకాసురహరణ రా♦హ్యాద్రిశరణ). 29

టీ. వాడె, కసుగందె, పుయిలోడె, విన్నవోయె, చిన్నవోయె-ఈ 5 ను ఖిన్నుఁడయ్యె ననుటకుఁ బేరులు.

క. గరువము మురిపం బనఁగను
బరఁగుఁ గర్వంబు పేళ్లు • భటనామను లొం
టరి లెంక బం టనంగను
(బురదానవహరణ శేష•భుజగాభరణా). 30

టీ. గరువము, మురిపము-ఈ 2 ను గర్వమునకు నామములు. ఒంటరి, లెంక, బంటు [భటశబ్దభవము.]-ఈ 3 ను భటుని పేర్లు.

క. అరదంబు తే రనంగను
బరఁగు రథంబునకుఁ బేళ్లు • పరి యన్నను గా
లరు లనఁ బదాతిసంహతి
(పురదానవహరణ శేష•భుజగాభరణా) 31

టీ. అరదము, [రథశబ్దభవము.] తేరు-ఈ 2 ను రథమునకు నామములు. పరి, కాలరులు-ఈ 2 ను కాల్బలమునకు నామములు.

క. సందియ మన ననుమాన మ
నం దనరును సంశయంబు•నకు బేళ్లై గో
బృందాహ్వయంబు లలరును
మం దనఁ గోన యనఁగ (జంద్ర•ఖండధరా). 32

టీ. సందియము, [సందేహశబ్దభవము.] అనుమానము-ఈ 2 ను సంశయమునకుఁ బేళ్లు. మంద, కోన-ఈ 2 ను గోసమూహమునకుఁ బేర్లు.

క. మొన వాఁగు దండు దళ మనఁ
దనరుఁ సైన్యంబు పేళ్లు • దళవాయి యనఁ

మొనకాఁ డనంగఁ బడవా
లనఁగఁ సేనాధిపతికి ♦ నాఖ్యలు వొలుచున్. 33

టీ. మొన, వాఁగు, దండు, దళము-ఈ ४ ను సైన్యమునకుఁ బేర్లు. దళవాయి, మొనకాఁడు, పడవాలు-ఈ 3 ను సేనాధిపతికిఁ బేర్లు.

తే. మైకొనియె నియ్యకొనె నొడం♦బడియె నొప్పె
ననఁగ నంగీకరించుట ♦ కాఖ్య లయ్యె
సంఘటించుట కాఖ్యలై ♦ జానుమీఱుఁ
జెరివెఁ దుఱిమెను గీల్కొల్పెఁ ♦ జెక్కె ననఁగ. 34

టీ. మైకొనియె, ఇయ్యకొనె, ఒడంబడె, ఒప్పె-ఈ ४ ను అంగీకరించె ననుటకుఁ బేరులు. చెరివె, తుఱిమె, కీల్కొల్పె, చెక్కె-ఈ ४ ను సంఘటించె ననుటకుఁ బేరులు.

తే. దిట్టపడియె ముక్కాఁకలు♦దీరె ననఁగ
నాఱితేఱె ననం గడి♦దేఱె ననఁగ
గసిమసంగె ననంగ నా♦ఖ్యలు దనర్చు
నిపుణుఁ డయ్యె నటంటకుఁ ♦ (త్రిపురవైరి). 35.

టీ. దిట్టపడియె, ముక్కాఁకలుదీరె, ఆఱితేఱె, గడిదేఱె, కసిమసంగె-ఈ ౫ ను నిపుణుఁడయ్యె ననుటకుఁ బేరులు.

క. తడవు వడి కా రనంగా
నడరుం గాలంబు శిథిల ♦ మయ్యె ననుట యా
విడె వీడె నూడె విచ్చెను
సడలె నురలె వదలె బ్రిదిలె ♦ జాఱె ననంగన్. 36

టీ. తడవు, వడి, కారు - ఈ 3ను కాలమునకుఁ బేరులు. విడె, వీడె, ఊడె, విచ్చె, సడలె, ఉరలె, వదలె, ప్రిదిలె, జాఱె-ఈ ౯ యుం శిథిలమయ్యె ననుటకుఁ బేరులు.

క. మది డెంద ముల్ల మెద యన
హృదయంబున కాఖ్య లయ్యె • నీఱం బనఁగాఁ
బొదరి ల్లనఁగ నికుంజము
(సదయాంతగకరణ తరుణ • చంద్రాభరణా). 37

టీ. మది, [ప్ర. మతి.] డెందము,ఉల్లము,ఎద-ఈ౪ను హృదయము నకుఁ బేరులు. ఈఱము, పొదరిల్లు [పొద+ఇల్లు-రేఫాదేశము.] - ఈ౨ను నికుంజము పేరులు.

క. తెగ దినుసు తోయ మనఁగను
నెగడుఁ బ్రకారంబునకును • నెఱి నామము లై
మెగ మనఁగ మెక మనంగను
మృగమునకు నభిఖ్యలయ్యె • (మేరుశరాసా). 38

టీ. తెగ, దినుసు, తోయము-ఈ 3ను ప్రకారమునకు నామములు. మెగము, మెకము - [ఈ రెండును మృగశబ్దభవములు.] ఈ ౨ ను మృగమునకుఁ బేరులు.

క. ఎడ దవ్వు కేళ వనంగా
నడరుఁ దూరంబునకు స•మాఖ్యలు నలి నాఁ
బొడి నుగ్గు తుమురు నురు మన
బెడఁగడరుం జూర్ణమునకుఁ • బేళ్లై (శర్వా). 39

టీ. ఎడ, దవ్వు, కేళవు-ఈ 3 ను దూరమునకుఁ బేరులు. నలి, పొడి, నుగ్గు, తుమురు, నుఱుము-ఈ౫ను చూర్ణమునకుఁ బేరులు.

క. ప్రేరేచెను బురికొలిపెను
దారిచె ననఁ జోదనకును • దగు నాఖ్యలు పెం

పారును జంబూద్వీపము
నేరెడుదీవి తొలుదీ ♦ వనెడునామములన్. 40

టీ. ప్రేరేచెను, పురికొలిపెను, తారిచెను-ఈ 3ను ప్రేరణచేసెననుటకుఁ బేరులు. నేరెడుదీవి=నేరేడుచెట్టుగలద్వీపము, తొలుదీవి = మొదటిద్వీపము-ఈ 2 ను జంబూద్వీపమునకుఁ బేరులు.

క. తొలఁగెం బాసె ననంగా
నలరున్ విముఖతకుఁ బ్రాప్త ♦ మయ్యె ననుటపే
ళ్లలమె నొదవె దక్కెనియెను
నెలకొనియెన్ జెందె ననఁగ ♦ నెక్కొనియె ననన్. 41

టీ. తొలఁగెను, పాసెను-ఈ 2ను దూరముగాఁబోవుటకు పేరులు. అలమె, ఒదవె, దక్కెనియె, నెలకొనియె, చెందె, నెక్కొనియె-ఈ 6 ను లభించె ననుటకుఁ బేరులు.

క. వెనుకఁ దరువాతఁ బిమ్మట
ననఁగా నంతట ననంగ ♦ నంత ననంగాఁ
దనరుం బశ్చాదర్థము
(కనకాచలచాప చంద్ర♦ఖండకలాపా). 42

టీ. వెనుకన్, తరువాతన్, పిమ్మటన్, అంతటన్, అంతన్-ఈ 5ను అనంతర మనుటకుఁ బేరులు.

క. పల్లఅపులు రజ్జు లనం
బ్రల్లదము లనంగ వ్యర్థ♦భాషణములకున్
బేళ్లై వర్తిలు నోలిగ
(నుల్లోకజయాభిసరణ ♦ యురగాభరణా). 43

టీ. పల్లఅపులు, రజ్జులు, ప్రల్లదములు - ఈ 3ను పనికిమాలినమాటలకుఁ బేరులు.

క. కైసేఁ తలంకరించుట
జేసి యనఁగ విషమమునకుఁ ♦ జేరై వెలయుఁగ
సేసలు దీవనఁబ్రా లన
భాసిలు మంత్రాక్షతలకుఁ ♦ బర్యాయములై. 44

టీ. కైసేఁత, [కై + చేఁత]-ఈ౨ యు అలంకరించుట. జేసి = సరికాని. సంఖ్య. సేసలు, దీవనఁబ్రాలు-ఈ౨ను మంత్రాక్షతలకు నామములు.

క. కోరనఁ బాలన నంశం
బేఱన వాఁక యన నదికి ♦ నెసఁగును జేళ్లై
నీరాజనంబుపే ళ్ళగు
నారతి నివ్వాళి యనఁగ ♦ (నంగజదమనా). 45

టీ. కోరు, పాలు - ఈ ౨ ను భాగమునకు నామములు. ఏఱు, వాఁక- ఈ ౨ ను నదికి నామములు. ఆరతి [ప్ర. హారతి.], నివ్వాళి - ఈ ౨ ను నీరాజనమునకు నామములు.

ఆ. మొఱవవోయె ననఁగ ♦ మొద్దువోయె ననంగఁ
గుంఠ మయ్యె ననుట♦కుం దనర్చు
శాతమునకు నాఖ్య ♦ లై తనరారును
జుఱుకు వాఁడి తెగువ ♦ కఱ కనంగ. 46

టీ. మొఱవవోయె [మొఱవ+పోయె], మొద్దువోయె [మొద్దు + పోయె]-ఈ ౨ ను పదునులేనివయ్యెననుటకుఁ బేరులు. చుఱుకు, వాఁడి, తెగువ, కఱకు-ఈ ౪ ను పదునుకుఁ బేరులు.

సీ. యామికులకు నాఖ్య ♦ లై ప్రవర్తిలుచుండు
నారెకు లనఁగఁ ద♦లారు లనఁగఁ
గళ్లెంబు వాగె నాఁ♦గను ఖలీనంబుపే
ళ్ళలరు దంతంబుపే ♦ రౌ డనంగఁ

దఱపి నా ముదురు నాఁ • దరుణేతరం బంట
యిం చనఁ జెఱ కన • నిక్షు వలరు
నష్టం బోనర్చె నం•టకు నాహ్వాయము లయ్యె
బోకార్చె ననఁగఁ గో•ల్పుచ్చె ననఁగఁ
తే. గుదె యనఁగ దు డ్డనంగను • గదకుఁ బేళ్లు
ఇవ మనఁగ మం చనంగను • హిమముపేళ్లు
కాన యన నడవి యనంగఁ • గాననంబు
షడ్ఢకుఁడు తోడియల్లుఁడు • జగిలెఁ డనఁగ. 47

టీ. ఆరెకులు, తలారులు-ఈ ౨ ను తలవర్లకుఁ బేరులు. కళ్లెము, వాగె-ఈ ౨ ను ఖలీనమునకుఁ బేరులు. ఔడు-రూ. అవుడు - ఈ ౧ యు దంతము పేరు. తఱపి, ముదురు-ఈ ౨ ను లేఁతది కానిదానికి నామములు. ఇంచు, [ప్రకృతి. ఇక్షువు.] చెఱకు-ఈ ౨ ను ఇక్షువునకు నామములు. పోకార్చె, కోల్పుచ్చె-రూ. కోలుపుచ్చె-ఈ ౨ ను నష్టముచేసె ననుటకుఁ బేరులు. గుదె, దుడ్డు-ఈ ౨ ను గదకుఁ బేరులు. ఇవము, [హిమము ప్రకృతి.] మంచు-ఈ ౨ ను హిమమునకుఁ బేరులు. కాన, [ప్ర. కాననము.] అడవి [ప్ర. అటవి.]-ఈ ౨ ను అరణ్యమునకుఁ బేరులు. తోడియల్లుఁడు, జగిలెఁడు - ఈ ౨ ను షడ్ఢకునికిఁ బేర్లు.

క. తేనియ యన జు న్నన నభి
ధానంబులు మధువునకును • దనరుం బేళ్లై
పానకము చెఱకుపా లనఁ
గా నిక్షురసంబునకును • (గంఠేకాలా). 48

టీ. తేనియ, జున్ను-ఈ ౨ ను మధువునకుఁ బేర్లు. పానకము, చెఱకుపాలు-ఈ ౨ ను చెఱకురసమునకు నామములు.

క. ఉడిగెను జాలించెను నా
నడరు విరామం బొనర్చె • ననుటకుఁ బేర్లై
తొడరుం బశ్చాద్భాగము
పెడ యనఁగా వెనుక యనఁగఁ • బిఱుఁదు యనంగన్.

టీ. ఉడిగెను, చాలించెను-ఈ ౨ ను విరమించెననుటకుఁ బేర్లు. పెడ, వెనుక, పిఱుఁదు - ఈ ౩ ను పశ్చాద్భాగమునకుఁ బేరులు.

క. విడుమర యన విడుదల యనఁ
గడముట్టుట యనఁగ శాంతి•గనుటకుఁ బేళ్లౌ
నెడ వంక చక్కి చోటన
నడరు స్థలంబునకు నాఖ్య • లై (శితికంఠా). 50

టీ. విడుమర, విడుదల, కడముట్టుట-ఈ ౩ ను శాంతిగనుటకుఁ బేరులు. ఎడ, వంక, చక్కి, చోటు - ఈ ౪ ను స్థలమునకుఁ బేరులు.

క. చనుఁ గ్రుద్ధుఁ డయ్యె ననుటకుఁ
గినిసెఁ గనలె నలిగెఁ గోప•గించె ననంగాఁ
దనరుఁ మర్మములకుఁ బే
ళ్లనువు లనఁగ నెఱఁకు లనఁగ • నాయము లనఁగన్. 51

టీ. కినిసె, కనలె, అలిగె, కోపగించె-ఈ ౪ ను క్రుద్ధుఁడయ్యెననుటకుఁ బేరులు. అనువులు, నెఱఁకులు, ఆయములు - ఈ ౩ ను మర్మములకు నామములు.

ఆ. పరఁగుఁ బేళ్లు కార్య•కరునకుఁ బార్పత్తె
కాఁ డనంగ మణివ•కాఁ డనంగఁ
దేజరిల్లుచుండు • దేవేరి దొరసాని
రాణి యనెడుపేళ్ల • రాజపత్ని. 52

టీ. పార్పత్తెకాఁడు, మణివకాఁడు - ఈ ౨ ను కార్యకరునకు నామములు. దేవేరి, దొరసాని, రాణి - ఈ ౩ ను రాజపత్ని పేరులు.

క. మ్రింగె నన గ్రుక్కగొనియె న
నంగఁ దగుఁ గబళనం బొ♦నర్చె ననుటకుఁ
బ్రుంగె మునింగె ననంగ (న
నంగహా రా) మగ్నమయ్యె♦ ననుటకుఁ బేళ్లౌ. 53

టీ. మ్రింగె, గ్రుక్కగొనియె - ఈ ౨ ను కబళనముఁ జేసెననుటకుఁ బేరులు. బ్రుంగె, మునింగె - ఈ ౨ ను మగ్నమయ్యెననుటకుఁ బేరులు.

సీ. ఆఖ్యలై తనరు ధ♦నాగారమునకు ను
గ్రాణం బనంగ బొ♦క్కస మనంగ
నాస్థానమండపా♦హ్వయము లై తనరు హ
జారం బనంగ మో♦సల యనంగ
దయకు నీరెం డభి♦ధానంబు లయ్యెను
గనికర మనఁగ న♦క్కటిక మనఁగ
బాల్యస్థునకుఁ బేళ్లు♦ బరిఢవిల్లును బిన్న
వాఁ డన గొండిక♦వాఁ డనంగ
తే. సంధ్యకాఖ్యలు మునిమాపు♦ సంజ యనఁగఁ
జూద మన నెత్త మనఁగ దు♦రోదరంబు
జడి యనఁగ వాన యనఁగ వ♦ర్షంబుపేళ్లు
నోలి యుంకువ యన శుల్క♦ మొప్పు (నభవ). 54

టీ. ఉగ్రాణము, బొక్కసము-ఈ ౨ ను ధనముంచెడిగృహమునకుఁ బేరులు. హజారము-రూ. హాజారము, మోసల - ఈ ౨ ను ఆస్థానమండపమునకుఁ బేరులు. కనికరము, అక్కటికము - ఈ ౨ ను దయకుఁ బేరులు. పిన్నవాఁడు,

కొండికవాఁడు - ఈ ౨ ను బాల్యస్థునకుఁ బేరులు. మునిమాపు, సంజ - ఈ ౨ సంధ్యాకాలము పేర్లు. జాదము, [ప్రకృతి, ద్యూతము.] నెత్తము-ఈ ౨ ను ద్యూతమునకు నామములు. జడి, వాన - ఈ౨ను వర్షమునకుఁ బేళ్లు. ఓలి, ఉంకువ-ఈ ౨ ను శుల్కమునకుఁ బేరులు.

సీ. పయ్యెద యనఁగను • పైఁట యనంగ సం
వ్యానంబునకు నాఖ్య • లై తనర్చు
నొక్కపెట్ట ననంగ • నువ్వెత్తుగ ననంగ
యుగపత్పదంబున • కొప్పుఁ బేళ్ళు
కవఅ లనం బాచి•క లనంగ నక్షముల్
బన్న మొచ్చె మనంగఁ • బరిభవంబు
వ్యాపార మగు చెయ్ది • మనఁ జెయ్ది యనఁగను
గన్ను నఁ గీలనఁ • గపటచేష్ట
తే. కందుకము బంతి చెం డనఁ•గను దనర్చు
నఅవఅలు చిద్రుప లన ఖం•డాహ్వయముల
కాఁచువడియంబు లనఁగను • కైరవ ళ్ల
నంగ ఖాదిరఘుటిక (ల•నంగదమన). 55

టీ. పయ్యెద, పైఁట-ఈ౨ను ఉత్తరీయమునకు పేర్లు. ఒక్కపెట్ట, ఉవ్వెత్తుగ-ఈ ౨ ను ఒకసారిగ ననుటకుఁ బేర్లు. కవఅలు, పాచికలు-ఈ ౨ ను అక్షములకుఁ బేరులు. బన్నము, [ప్రకృతి. భంగము.] ఒచ్చెము - ఈ ౨ ను తిరస్కారమునకుఁ బేర్లు. చెయ్దము, చెయ్ది-ఈ ౨ ను వ్యాపారమునకుఁ బేర్లు. కన్ను, కీలు-ఈ౨ను కపటచేష్టకుఁ బేర్లు. బంతి, చెండు-ఈ ౨ ను కందుకమునకుఁ బేర్లు. అఅవఅలు, చిద్రుపలు-ఈ ౨ ను ఖండములకుఁ బేర్లు. కాఁచువడియములు, కైరవళ్లు-ఈ ౨ ను ఖాదిరఘుటికలకుఁ బేళ్లు.

సీ. మాగాని రాజ్యంబు ♦ మణివ ముద్యోగంబు
చిట్టలు చిత్రముల్ ♦ చిలుకు శరము
ఎత్తికోలు ప్రయత్న ♦ మీలువు మానంబు
బారి యనంగ ను♦పద్రవంబు
విన్నను వనఁగఁ బ్రా♦వీణ్యం బెలర్పును
దార్కాణ మనఁగ ని♦దర్శనంబు
నిట్టపంట యనంగ ♦ నిష్కారణం బంట
బానసం బనఁగ మ♦హానసంబు
తే. నామ మేకాంతమునకు మం♦తన మనంగ
నంతిపుర మన శుద్ధాంత ♦ మలరుచుండు
నుదిరి యనఁ దప్తకాంచన ♦ మొప్పుచుండుఁ
దివురుట యభిలషించుట ♦ (దేవదేవ). 56

టీ. మాగాని=దేశము, మణివము=ఉద్యోగము, చిట్ట=ఆశ్చర్యము, చిలుకు=బాణము, ఎత్తికోలు=ప్రయత్నము, ఈలువు=అభిమానము, బారి=ఉపద్రవము, విన్నువు = ప్రావీణ్యము, లేక నేర్పు, తార్కాణము = నిదర్శనము, నిట్టపంట=నిష్కారణము, బానసము=వంటయిల్లు, మంతనము = ఏకాంతము, అంతిపురము = అంతఃపురము, ఉదిరి = అపరంజి, తివురుట= కోరుట.

సీ. బిట్టు గట్టనఁ బెల్లు ♦ పెద్దయుఁ దద్దయు
నురవడి పరువడి ♦ యుద్దవిడియుఁ
బనివడి పదపడి ♦ బలువిడి తలకొని
నెట్టన యొంతేని ♦ నెఱి గరంబు
లలి వార కేడ్తెఱ ♦ వెలుచ వావిరి యన
నఱిముఱి యనఁ బోరిఁ ♦ బోరి యనంగ

గడుఁజాల మిగులంగ ♦ గాటం బనంగ న
త్యంతముగ ననుట ♦ కాఖ్య లయ్యె
తే. నుడుకు సెక వెట్ట వేఁడిమి ♦ యుబ్బ యావి
యుక్క యన నొప్పు నామంబు ♦ లుష్ణమునకుఁ
దాల్మి యోరిమి సైరణ ♦ తాళుకొంట
సైఁచు టోర్పుట యనఁగను ♦ క్షాంతిపేళ్లు. 57

టీ. బిట్టు, గట్టి, పెల్లు, పెద్దయు, తద్దయు, ఉరవడి, పరువడి, ఉద్దవిడి- పా. ఉద్దపడి, పనిపడి, పదపడి, బలువిడి, తలకొని, నెట్టన, ఎంతేని, నెఱి, కరము, లలి, వారక, ఏర్తెఱ, పెలుచ, వావిరి, అఱిముఱి, పోరిపోరి, కడు, చాల, మిగుల, గాటము - ఈ ౨౭ ను అత్యంతమనుటకుఁ బేరులు. ఉడుకు, సెక, వెట్ట, వేఁడిమి, ఉబ్బ, ఆవి, ఉక్క-ఈ ౭ ను ఉష్ణమునకుఁ బేరులు. తాల్మి-రూ. తాలిమి, ఓరిమి, సైరణ, తాళుకొంట, సైఁచుట, ఓర్చుట-ఈ ౬ ను క్షాంతికిఁ బేర్లు.

తే. పెద్దనిద్దురఁ జెందించెఁ ♦ బిలుకుమార్చె
గీటణంచెను గుదెతాల్పు ♦ వీటి కనిచెఁ
గూలిచెను రూపుమాపెను ♦ నేలఁగలిపె
ననఁగ హాతిచేసె ననుట కా ♦ ఖ్యలు దనర్చు. 58

టీ. పెద్దనిద్దురఁజెందించె, పిలుకుమార్చె, గీటణంచె, గుదెతాల్పువీటి కనిచె=యమపురికిఁ బంపెను. కూలిచె, రూపుమాపె, నేలఁగలిపె-ఈ ౭ ను చంపె ననుటకుఁ బేర్లు.

క. పరిచూర్ణ మయ్యె ననుటకు
వరుసన్ నామంబు లగుచు ♦ వర్తిలుచుండున్
దుటుమయ్యెన్ బరుమయ్యెన్
నుటుమయ్యెన్ బిండియయ్యె ♦ నుగ్గయ్యె ననన్. 59

టీ. తుఱుమయ్యె, పరుమయ్యె, నుఱుమయ్యె, పిండియయ్యె, నుగ్గయ్యె-ఈ ౫ ను చూర్ణమయ్యె ననుటకు నామములు.

క. కునికె నిదురించెఁ గూర్కెను
గనుమోడ్చె ననంగ నిద్ర • గనుటకుఁ బేళ్ళౌ
గనువిచ్చె ననఁగ మేల్కనె
ననఁగఁ బ్రబోధంబు నొందె • ననుటకుఁ బేళ్ళౌ. 60

టీ. కునికె, నిదురించె, కూర్కెను, కనుమోడ్చెను-ఈ౪ను నిద్రవోయె ననుటకుఁ బేర్లు. కనువిచ్చె, మేల్కనె-ఈ౨ను నిద్రలేచె ననుటకుఁ బేరులు.

క. దులిచె వదలించె నూడ్చెను
దోలఁగించెఁ బాపె ననఁగ • ద్రోచె ననంగా
వెలికొత్తె ననఁగ బేళ్లౌ
యలరున్ విఘటనమొనర్చె • ననుటకు (శర్వా). 61

టీ. దులిచె, వదలించె, ఊడ్చె, తోలఁగించె, పాపె, త్రోచె, వెలికొత్తె-ఈ ౭ ను విఘటనమొనర్చె ననుటకుఁ బేర్లు.

క. పొలయలుక యనఁగ నెయ్యపు
టలుక యనం బ్రణయకలహ • మలరారుఁ గుచం
బుల కొప్పు నామములు గు
బ్బ లనంగాఁ జన్ను లనఁగఁ • బాలిం డ్లనఁగన్. 62

టీ. పొలయలుక, నెయ్యపుటలుక [నెయ్యము+అలుక-నెయ్యపు+అలుక-నెయ్యపుటలుక.]-ఈ౨ను ప్రణయకలహమునకు నామములు. గుబ్బలు, చన్నులు, పాలిండ్లు=[పాలు+ఇండ్లు] పాలుండుచోట్లు-ఈ 3 ను కుచములకు నామములు.

తే. చౌటిమున్నీ రనఁగ నుప్పు • సంద్ర మనఁగ
రాజిలుచు నుండు లవణవా • రాశి పేళ్లు

కాలు వన బట్టె యనఁగను ♦ జా లనంగఁ
గుల్య కభిధాన మై పొల్చుఁ ♦ (గుధరనిలయ). 63

టీ. చౌటిమున్నీరు, ఉప్పుసముద్రము - ఈ ౨ ను లవణసముద్రము పేరులు. కాలువ-రూ. కాల్వ, బట్టె, జాలు-ఈ 3 ను కుల్యకు నామములు.

తే. పెల్లగించెను పెకలించెఁ ♦ బెఱికె ననఁగ
నాఖ్య లుత్పాటన మొనర్చె ♦ ననుట కలరు
నాహ్వయంబులు ఛేదించె ♦ ననుట కయ్యెఁ
జించె నన వ్రచ్చె నన వ్రక్క♦లించె ననఁగ. 64

టీ. పెల్లగించె, పెకలించె, పెఱికె-ఈ 3 ను ఉత్పాటన మొనర్చె ననుటకుఁ బేరులు. చించె, వ్రచ్చె, వ్రక్కలించె-ఈ 3 ను ఛేదించె ననుటకు నామములు.

తే. కనుమొఱఁగె నేమఱించె నాఁ♦గను నిగూఢ
వర్తన మొనర్చె ననుట కా♦హ్వయము లడరు
మొయి లన మొగు ళ్లనంగను ♦ మొనయు మబ్బు
లన ఘనంబుల కాఖ్యలై ♦ (యభ్రకేశ). 65

టీ. కనుమొఱఁగె, ఏమఱించె-ఈ ౨ ను నిగూఢవర్తనముచేసె ననుటకుఁ బేర్లు. మొయిలు, మొంగళ్లు, మబ్బులు-ఈ 3 ను మేఘములకు నామములు.

క. పగ అనఁగ మార్తు రనఁగను
పగవాం డ్రనఁ బగతు రనఁగఁ ♦ బరిపంథికిఁ బే
ళ్లగు మెగ మనంగ మెక మన
మృగమునకు నభిఖ్య లయ్యె ♦ (మేరుశరాసా). 66

టీ. పగఱు, మార్తురు, పగవాండ్రు, పగతురు-ఈ ४ ను విరోధికి నామములు. మెగము, మెకము-ఈ ౨ ను మృగమునకుఁ బేర్లు.

తే. ఇంకె నడుగంటె వట్టె నా • నివిరె ననఁగ
నిర్జలం బయ్యె ననుటకు • నెగడుఁ బేళ్లు
నిండెఁ గ్రిక్కిఱిసె ననఁ బూ•ర్ణించె ననుట
కాఖ్య లై తనరారు (సు•ధాంశుమకుట). 67

టీ. ఇంకె, అడుగంటె, వట్టె, ఇవిరె-ఈ ౪ ను నిర్జలమయ్యె ననుటకు నామములు. నిండె, క్రిక్కిఱిసె-ఈ౨ను పూర్ణించె ననుటకుఁ బేరులు.

తే. పెచ్చు పెరిగె ననం బురి•విచ్చె మీఱె
నన విజృంభించె ననుటకు • నాఖ్య లయ్యెఁ
దిండికాఁ డనఁ దిండీఁడు • తిండిపో త
నంగ భక్షకునకును ద•నర్చుఁ బేళ్లు. 68

టీ. పెచ్చుపెరిగె, పురివిచ్చె, మీఱె-ఈ ౩ ను విజృంభించె ననుటకు నామములు. తిండికాఁడు, తిండీఁడు, తిండిపోతు-ఈ ౩ ను భక్షకుని పేర్లు.

క. పెనఁగొనె గిఱికొనియెను వల
గొనియెన్ మెలికొనియెఁ జుట్టు•కొనె సుడిగొనె నాఁ
గను నులిగొనె నన నాఖ్య ల
గును వలయిత మయ్యె ననుట•కును (శితికంఠా). 69

టీ. పెనఁగొనె, గిఱికొనె, వలగొనె, మెలికొనె, చుట్టుకొనె, సుడిగొనె, నులిగొనె-ఈ ౭ ను వలయితమయ్యె ననుటకుఁ బేరులు.

సీ. మొగరా లన స్తంభ•ములు చిట్టకము దంభ
మెరగలి వనవహ్ని • యొడ్డె మూర్ఖుఁ
డుడుగర యుపహార • మూఱట విశ్రాంతి
మొద లని యనఁగను • మూల మనుట

తఱు లన తఱులు చిం♦ద మనంగ శంఖంబు
తఱ టనంగఁ గశాభి♦ధాన మయ్యె
దమ టనఁ గీల పా♦దం బగు మెట్టన
గాయకులకుఁ బేరు ♦ గాణ లనఁగ
తే. మృత్యువునకును బే రయ్యె ♦ మిత్తి యనఁగ
మకుటమున కాఖ్య లగు బొమి♦డిక మనంగ
నోముట యనఁగఁ బోషించు ♦ టూడిగంబు
సేవ కభిధానమై యొప్పు ♦ (శేషభూష). 70

టీ. మొగరాలు=స్తంభము, చిట్టకము=దంభము, మిష, ఎరవలి-పా. ఎరగలి=కాఱుచిచ్చు, ఎడ్డె=మూర్ఖుఁడు, ఉడుగర=కానుక, ఊఱట, విడుమర, మొదలు = మూలము, తఱులు=మడతలు, చిందము=శంఖము, తఱటు=జాటి, చబుకు, తమట = నిప్పుమంట, మెట్ట=పాదము, గాణ=గాయకుఁడు, మిత్తి[ప్ర. మృత్యువు]=చావు, బొమిడికము=కిరీటము, ఓముట=పోషించుట, ఊడిగము=సేవ.

సీ. ఎట్టకేల కనంగ ♦ నెనయును సకృదర్థ
మఖిలం బటంటకు ♦ నంతవట్టు
ఏకాకి యొక్కఁ ట♦నేకులు పలువురు
వేనవేల్ పెక్కండ్రు ♦ వేవు రనఁగ
నలరు నోచేదర్థ ♦ మై కానినాఁ డన
నేతాదృశు లె యంట ♦ కిట్టివారె
మిన్నక యూరక ♦ యన్నఁ దూష్ణీమర్థ
మనుసరించి యటంట ♦ కగును దొట్టి
తే. యొండొకఁ డనంగ మఱియు వే♦ఱొకఁడు లాఁతి
వాఁడు పెఱవాఁడు దక్కిన♦వాఁ డనంగ

నన్యునకు నాఖ్య లగుచుఁ బెం•పారుచుండు
(శయఘుటితశూల వైయాఘ్ర•చర్మచేల). 71

టీ. ఎట్టకేలకు=ఓకానొకప్పుడు, అంతవట్టు=అఖిలమును, ఎక్కటి=ఏకాకి, పలువురు, వేనవేలు, పెక్కండ్రు, వేవురు-ఈ ౪ ను అనేకులు. కానినాఁడు=అటు కాకపోయిన, ఇట్టివారె=ఈలాటివారేయనుట. మిన్నక, ఊరక-ఈ ౨ ను తూష్ణీమర్థకములు. తొట్టి=అనుసరించి. ఒండొకఁడు, వేఱొకఁడు, లాఁతివాఁడు, పెఱవాఁడు, తక్కినవాఁడు-ఈ౫ను అన్యునకుఁ బేరులు.

---

## నా నా ర్థ ము లు.

క. వడి యనఁగాఁ గాలం బగు
వడి యన వేగంబునకును • వర్తిలుఁ బేరై
మడి యనఁ గేదారం బగు
మడి యనఁగా శుద్ధికిని స•మాహ్వాయ మయ్యెన్. 72

టీ 1. వడి=కాలము, వేగము. 2. మడి=వరిచేను, శుద్ధి.

క. ఈ డనఁగ వయసు పే రగు
నీ డన సామ్యంబునకును • నెసఁగును బే రై
నా డన రాజ్యము పే రగు
నాఁ డనఁ దత్కాలమం ద•నఁగఁ బెంపారున్. 73

టీ. 1. ఈడు = వయస్సు, సాటి. 2. నాడు = దేశము, అప్పుడు (రెండవయర్థమున "నాఁడు" అని యరసున్న గలదు).

క. మొన యన సైన్యము పే రగు
మొన యనఁగా నగ్ర భాగ•మునకును బే రౌ
దొన యనఁ దూణీరం బగు
దొన యన నవసానమునకుఁ • దొడరును బేరై. 74

టీ. 1. మొన=సైన్యము, ముందుభాగము. 2. దొన=అమ్ములపొది, కొన.

క. వెన్నన<sup></sup>గ బీజమంజరి
వెన్నన౯ జరఘూంగమునకు • వెలయును బేరై
కన్ను లనం బర్వంబులు
కన్ను లనఁ లోచనములు • (కంఠేకాలా). 75

టీ. 1. వెన్న=కంకి, వీఁపు. 2. కన్ను=గణుపు, నేత్రము.

క. తమ్మి యనఁ దరువిశేషము
తమ్మి యనం బంకజాభి•ధానం బయ్యెన్
నెమ్మి యనఁ బ్రియముపే రగు
నెమ్మి యన మయూరమునకు • నెగడుం బేరై. 76

టీ. 1. తమ్మి=వృక్షవిశేషము, తామర. 2. నెమ్మి=సుఖము, నెమలి.

క. దండ యనన్ సాన్నిధ్యము
దండన సుమమాలికాభి•ధానం బయ్యెన్
మండ నఁ బ్రకోష్ఠ మయ్యెన్
మండన మృత్పాత్రకును స•మాహ్వయ మయ్యెన్. 77

టీ. 1. దండ=చేరువ, పూలదండ. 2. మండ=ప్రకోష్ఠము, మంటికుండ.

క. తెలుఁగుం గబ్బపుమర్మము
తెలుఁగుకవీంద్రులకుఁ దేట•తెల్లము గాఁగన్
దెలియఁగ నడిదము సూరయ
చెలువారఁగ నాంధ్రనామ•శేషముఁ జెప్పెన్. 78

సటీకాంధ్రనామశేషము

సంపూర్ణము.

---

ఆంధ్రనామసంగ్రహము

# అకారాదిశబ్దానుక్రమణిక.

శ్రీరస్తు.

ఆంధ్రనామశేషమందలి

# అకారాదిశబ్దానుక్రమణిక.



10

శ్రీ రస్తు.

# సాంబనిఘంటువు

టీకానుక్రమణికాసహితము.

చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి

ప్రకటితము.

1926



# సాంబనిఘంటువు.

---

అవతారిక. కస్తూరి రంగకవి యనునతఁడీయాంధ్రనిఘంటువును శ్రీసాంబమూర్తి కంకితముచేయుచు, గ్రంథరచనాపద్ధతులను దెల్పుచున్నాఁడు.—

సీ. శ్రీ వెలయంగ దే•శీయముల్ దెనుఁగులుఁ
దద్భవంబులుఁ గూర్చి • దైవవర్గ
దనరు మానవవర్గ • స్థావరవర్గ తి
ర్యగ్వర్గ ననునాలు • గలవరించి
జల్లు లుంపక వ్యర్థ•శబ్దముల్ రానీక
కుంటినడత గాక • కొదుకు లేక
యుర్వీజనంబుల • కులకారసరణిగా
నాంధ్రనామనిఘంటు • వనెడుకృతినిఁ

తే. గవులదయచేత నీకటా•క్షుంబువలన
నీసశతకంబుఁ జెప్పెదఁ • జిత్తగింపు
దనుజసమవర్తి భక్తహృ•దబ్జవర్తి
సకలసురచక్రవర్తి శ్రీ•సాంబమూర్తి.

తా. దేవతలకందఱకుఁ జక్రవర్తివి, రాక్షసాంతకుఁడవు,భక్తులహృదయకమలములందు వసించువాఁడవునైనయోసాంబమూర్తీ! కస్తూరిరంగకవియనునేను సొంపుగా నాంధ్రభాషయందు అన్యదేశీయపదములు, ఆంధ్రదేశ్యపదములు, సంస్కృతభవప్రాకృతభవములు వీనినింగూర్చి దేవవర్గు, మానవవర్గు, స్థావరవర్గు, తిర్యగ్వర్గు అను నాలుగువర్గములను సవరించియు, ను మొదలగు పాదపూరణపదములను, అర్థహీనములైన పదములను రానీయక, అన్వయకాఠిన్యములేక, తడఁబడకుండునట్టి సులభశైలిని సకలజనోపకారముకొఱకు "ఆంధ్రనామనిఘంటువు" అను గ్రంథమును కవులదయవలనను, నీకటాక్షము వలనను నూఱుసీసపద్యములుగా రచించెద. దీనినిఁ జిత్తగింపుమయ్యా.

## దేవవర్గు.

సీ. ముక్కంటితొలిపట్టి • మొట్టికాయల మెప్పు
　　గొప్పబొజ్జగలాఁడు • గుజ్జువేల్పు
గబ్బచెక్కిళ్లమె•కముమోముగలసామి
　　కలుఁగులాయపుఁదేజి • బలుసిపాయి
గుంజిళ్లపెట్టించు•కొనుమేటి పిళ్లారి
　　కుడుముదాలుపు పెద్ద•కడుపువేలు
పొంటిపల్లుదొర ము•క్కంటిపండులమెక్కు
　　దేవర చిలువజం•దెముల మేటి
తే. జమిలితల్లులబిడ్డ పె•ద్దమెయిప్రోడ
　　చేఁటవీనులదణ్ణ పని•చెఱుపువాఁడు
　　మొదటివేలుపు వెనకయ్య • పుంజుదారి
　　పెద్ద యనఁ దగు గణపతి • వేల్పు సాంబ. 2

టీ. ముక్కంటితొలిపట్టి = త్రినేత్రుఁడగు శివుని మొదటికొమరుఁడు, మొట్టికాయలమెప్పు= భక్తులు తమతలయందు వేసికొను పిడికిటిపోటులకు, దలయూఁచువాఁడు, గొప్పబొజ్జగలాఁడు=పెద్దకడుపుగలవాఁడు, గుజ్జువేల్పు =వామనరూపుఁడగు వేలుపు, గబ్బుచెక్కుళ్ళమెకముమోముగలసామి = మదగంధముగల గండస్థలములుగల మృగంబుయొక్క అనఁగా ఏనుగుయొక్క శిరంబు దాల్చినదేవుఁడు, కలుఁగులాయపుఁదేజిబలుసిపాయి = బొక్కలాయముగాఁగలవాహనము-అనఁగా ఎలుక వాహనముగాఁగలగొప్పబంటు, గుంజిళ్లువెట్టించుకొనుమేటి = భక్తులచేత గుంజిళ్లు పెట్టించుకొనునట్టిదేవర, పిళ్లారి, కుడుముదాలుపు=మోదకములు హస్తమందుగలవాఁడు, పెద్దకడుపువేలుపు=లంబోదరుఁడు, ఒంటిపల్లుదొర=ఏకదంతుఁడగు దేవుఁడు, ముక్కంటిపండుల మెక్కుదొర = (ముక్కంటిపండులు=టెంకాయలు) వానినిఁదినునట్టి వేలుపు, చిలువజందెములమేటి = పాములను యజ్ఞోపవీతముగాఁ దాల్చినదేవుఁడు, జమిలి తల్లులబిడ్డ = గంగాపార్వతులనెడి యిరువురుతల్లులకుఁ గొమరుఁడు, పెద్దమయిప్రోడ = గొప్పశరీరమును దాల్చిన దేవుఁడు, చేఁటవీనుల దణి=చేఁటలవంటి చెవులుగలప్రభువు, పనిచెఱుపువాఁడు=తన్నుఁ గొలువని వారికార్యములఁ జెఱుచువాఁడు, మొదటివేలుపు = ఒక్కొక్కకార్యమునందును మొదట బూజసేయఁబడు దేవుఁడు, వెనకయ్య, పుంజుదారిపెద్ద = కుక్కుటధ్వజుఁడగు కుమారస్వామికి అన్న-ఈ ౨౦ యును వినాయకుఁడు.

సీ. చౌవంచమోములసాహేబు జాళువా
గుబ్బలివిలుకాఁడు ♦ గిబ్బరౌతు
జక్కులదొరనేస్తి ♦ జన్నంపుఁబగవాఁడు
పాడలగింటముదాల్పు ♦ పునుకదారి
వినువాఁకమోపరి ♦ వెండికొండదునీఁడు
మినుజొట్టుదేవర ♦ మిత్తిమిత్తి
మంచుమలల్లుఁడు ♦ మరుగొంగ ముక్కంటి
నెలదారి ముమ్మొన ♦ యలుఁగుమేటి

తే. విసపుమేఁతరి తిగప్రోలి ♦ వేఁటకాఁడు
కప్పుఱైదువ పెనిమిటి ♦ గాములదొర
వేల్పుదణిఁగన్నతఁడు గుజ్జు♦వేల్పుతండ్రి
బేసికన్నామి యన నీదు♦పేళ్లు సాంబ. 3

టీ. చౌవంచమోములసాహేబు = అయిదుముఖములుగల ప్రభువు, జాళువాగుబ్బలివిలుకాఁడు = మేరుపర్వతము విల్లుగాఁగలవాఁడు, గిబ్బరౌతు= ఎద్దునెక్కి తిరుగువాఁడు, జక్కులదొరనేస్తి=యక్షుల కధిపతియగుకుబేరునికి స్నేహితుఁడు, జన్నంపుఁబగవాఁడు = దక్షప్రజాపతియొక్క యాగమును ధ్వంసముచేసినవాఁడు, పొడలగింటము దాల్పు=మచ్చలుగలజంటనేఁతవస్త్రమును (వ్యాఘ్రచర్మమును) ధరించువాఁడు, పునుకదారి=బ్రహ్మకపాలమును ధరించినవాఁడు, వినువాఁకమోపరి = (వినువాఁక = ఆకాశమందుబాఱు నేఱు - (గంగాదేవిని) జడలందుఁ దాల్చినవాఁడు, వెండికొండదునీఁడు= రజతగిరి (కైలాసము) ఉనికిపట్టుగాఁగలవాఁడు, మినుజొట్టుదేవర=ఆకాశమె జొట్టుగాఁ గలవేల్పు, మిత్తిమిత్తి=మృత్యువునకు మృత్యువు [2 ను మృత్యుశబ్ద భవములు), మంచుమలల్లుఁడు=హిమవత్పర్వతమునకు అల్లుఁడు, మరుగొంగ= మన్మథునికిశత్రువు, ముక్కంటి=త్రినేత్రుఁడు, నెలదారి=చంద్రుని మౌళి యందుఁదాల్చినవాఁడు, ముమ్మొనయలుఁగుమేటి = మూఁడుకొనల యాయుధమును (త్రిశూలమును) దాల్చినవాఁడు, విసపుమేఁతరి=విషమునుభక్షించిన వాఁడు, తిగప్రోలివేఁటకాఁడు = త్రిపురములను ధ్వంసముచేసినదేవుఁడు, కప్పుఱైదువ పెనిమిటి=(కప్పు ఐదువ = నల్లనిచామ-పార్వతి-టుగాగమము.) పార్వతికిభర్త, గాములదొర= (గాములు = భూతములు-గ్రహశబ్దభవము.) భూతములకు ఱేఁడు, వేల్పుదణిఁగన్నతఁడు=దేవతలసేనానాయకుఁడగు కుమారస్వామికిఁ దండ్రి, గుజ్జువేలుపు తండ్రి = వామనుండగు వేల్పునకు (వినాయకునికిఁ) దండ్రి, బేసికన్నామి = (మూఁడు అనునది బేసిసంఖ్య) త్రినేత్రుఁ డగు వేల్పు - ౨3 శివుఁడు.

సీ. వెన్నుఁడు పెరుమాళ్లు ♦ వేకంటిసైదోడు
కవ్వపుమలదాల్పు ♦ కఱ్ఱినేస్తి
చిలువపానుపుదంట ♦ తెలిదీవిమన్నీఁడు
బటువుఁగైదువుజోదు ♦ బమ్మతండ్రి
కఱివేల్పు మరునయ్య ♦ కడలియల్లుఁడు సంకు
దారి గరుడిరౌతు ♦ తమ్మికంటి
పదివేసములదిట్ట ♦ యెదమచ్చగలసామి
యదుగువాఁకగలాఁడు ♦ పుడమినంటు

తే. మొసలివాయొంట్లతాల్పు ర♦క్కసులగొంగ
లచ్చిమగఁ డుస్తకేలుగ♦లాఁడు పుట్టు
వడుగు తామరపొక్కిలి♦వాఁడు పసిఁడి
వలువతాల్పన హరిపేరు ♦ లలరు సాంబ. 4

టీ. వెన్నుఁడు (విష్ణుశబ్దభవము), పెరుమాళ్లు (ఇది ద్రవిడభాషలోని పదము-శో వెలసంటిది), వేకంటిసైదోడు=సహస్రాక్షుఁడగు దేవేంద్రునకుతమ్ముఁడు (ఉపేంద్రుఁడు.), కవ్వపుమలదాల్పు = మందరపర్వతమునుధరించినవాఁడు, కఱ్ఱినేస్తి= (నేస్తి=నేస్తముగలవాఁడు.) అర్జునునికిఁ జెలికాఁడు, చిలువపానుపుదంట=శేషుండను పాన్పునందుఁ బరుండుశూరుఁడు, తెలిదీవిమన్నీఁడు= శ్వేతద్వీప మునికిపట్టుగాఁగలవేలుపు, బటువుఁగైదువుజోదు=దిటవగు సాయుధమును (సుదర్శనమును) ధరించినవాఁడు, బమ్మతండ్రి=బ్రహ్మదేవునికి జనకుఁడు, కఱివేల్పు=నల్లనిదేవుఁడు, మరునయ్య=మన్మథునకు జనకుఁడు, కడలియల్లుఁడు = (పాలసముద్రమునందుఁ బుట్టినలక్ష్మికి మగఁడగుటచే) పాలసముద్రమునకు నల్లుఁడు, సంకుదారి=పాంచజన్యమనెడి శంఖమును దాల్చినవాఁడు, గరుడిరౌతు=గరుడవాహనమెక్కెడి దిట్ట, తమ్మికంటి=కమలాక్షుఁడు, పదివేసములదిట్ట= దశావతారముల నెత్తినవేలుపు, ఎదమచ్చగల

సామి = బొమ్మునందు శ్రీవత్సమను మచ్చగలదేవుఁడు, అడుగువాఁకగలాఁడు = పాదమునందు నదిగలవాఁడు, (విష్ణువుయొక్క పాదమునందు గంగాదేవి పుట్టినది యని ప్రసిద్ధి.) పుడమినంటు = భూదేవికిఁ జెలికాఁడు, మొసలివాయొంట్లతాల్పు = మొసలినోటివలెనుండు కర్ణభూషణములను దాల్చినవాఁడు, రక్కసులగొంగ = రాక్షసులకువిరోధి, లచ్చిమగఁడు = లక్ష్మీదేవికిభర్త, ఉద్దకేలుగలాఁడు = నాలుగు చేతులు గలదేవుఁడు, పుట్టువడుగు = ఎల్లప్పుడు బ్రహ్మచర్యవ్రతముపూనినవాఁడు, తామరపొక్కిలివాఁడు = కమలముబొడ్డునందుఁ గలవాఁడు, పసిఁడిపలువతాల్పు = బంగారు పుట్టము ధరించినవాఁడు — ఇవి విష్ణువు.

సీ. తీవంచమోములదిట్ట తామరచూలి
తలఁపు కేళాకూళి • పులుఁగురౌతు
తగవులజడదారి•తండ్రి వేలుపుఁబెద్ద
మాటలజవరాలి•మగఁడు నలువ
యలరులవిలుకాని•యన్న మేలిమిబొజ్జ
గలదుముదారి ప్రాఁ•బలుకులదణి
నుదురాకులెక్కఁ జె•న్నుగ వ్రాయుకరణీకుఁ
డచ్చంపుఁదమ్మిపై • నమరుజాణ
తే. నిక్కుపుజగంబు బ్రోచుమ•న్నీఁడు మొదటి
జాలిదొర బమ్మ దుగినఁడు • తాత జగము
లన్ని పుట్టించుమేటి త•నంతఁ గల్గు
నతఁడు పజదొర యన నజా•ఖ్య లగు సాంబ. 5

టీ. తీవంచమోములదిట్ట = చతుర్ముఖుఁడగు దేవుఁడు, తామరచూలి = విష్ణువుయొక్క నాభికమలమందుఁబుట్టినవాఁడు (సమాసాంతము ఇకారము.

తలఁపుకేళాకూళిపులుఁగురౌతు = మానససరోవరమునందు విహరించు పక్షులు (హంసములు) వాహనములుగాఁ గలబంటు, తగవులజడదారితండ్రి = కలహములఁ బెట్టెడుమునికిఁ (నారదమునికి) దండ్రి, వేలుపుఁబెద్ద=దేవతలకు మేటి యైనవాఁడు, మాటలజవరాలిమగఁడు=వాగ్దేవికి (సరస్వతీదేవికి) భర్త, నలువ= నాలుగు మోములుగలవాఁడు (సమాసాంతము), ఆలరువిలుకానియన్న = పూవిల్తునికి (మన్మథునికి) అన్న (విష్ణునికిఁ బుత్రుఁడు మన్మథుఁడు, విష్ణువు నాభికమలమందు బ్రహ్మ పుట్టుటచేత మన్మథుని కితఁ డన్నయయ్యెను.), మేలిమిబొజ్జగలదముదారి = శ్రేష్ఠమయిన (బంగారుమయమగు) కడుపును దాల్చిన మొనకాఁడు, ప్రాఁబలుకులదణి = వేదములనివాసము, నుదురాకు లెక్కఁ జెన్నుగ వ్రాయునట్టి కరణీకుఁడు=నొసలనెడు తాటాకులందు లెక్కలను దప్పులు లేక వ్రాయునట్టి కరణము, అచ్చంపుఁదమ్మిపైనమరుజాణ = తెల్లనితామరపువ్వునందుఁ గూర్చుండు వలఁతి, నిక్కపుజగంబుఁ బ్రోచు మన్నీఁడు=సత్యలోకము నేలెడుప్రభువు, మొదటిజాతిదొర = బ్రాహ్మణులకు అధిపుఁడు, బమ్మ (బ్రహ్మశబ్దభవము.), దుగినఁడు (ద్రుహిణశబ్దభవము.), తాత=పితామహుఁడు, జగములన్ని పుట్టించుమేటి=లోకములకెల్లసృష్టికర్త యగు శ్రేష్ఠుఁడు, తనంతగలుగు నతఁడు=స్వయంభువు, పజదొర=ప్రజాపతి-౨౦ బ్రహ్మదేవుఁడు.

సీ. గట్టురాకొమరిత ♦ కప్పుముత్తైదువ
మగనియందపుమేనఁ ♦ దగినమగువ
కలికంఠురాణి సిం♦గపుఁ దేజి గలచాన
వెనకయ్యతల్లి నా ♦ వెలయు గౌరి
కలుములచెలి జిడ్డు ♦ కడలిబొట్టియ లచ్చి
తమ్మి గద్దియబోటి ♦ తల్లి తల్లి
పెనిమిటియెద నుండు ♦ ననబోఁడి మరుతల్లి
నెలచెలియలు లిబ్బి♦నెలఁతుక సిరి

తే. యనఁగ లక్ష్మీసమాఖ్య లౌ ♦ నంచతేజి
పొలఁతి తలవాఁకిట మెలంగు ♦ చెలువ నలువ
రాణి పలుకులజవరాలు ♦ లచ్చికోడ
లనఁగ భారతినామంబు ♦ లమరు సాంబ. 6

టీ. గట్టురాకొమరిత=పర్వతములకు ఱేఁడగు హిమవంతునికూఁతురు, కప్పుముత్తైదువ = నల్లనిరూపముగల యంగన, మగనియందపుమేనఁదగిన మగువ = ప్రియుని యందమైన శరీరమునందు సగముభాగముఁ గైకొన్న కాంత, కఱకంఠురాణి = శివునిదేవేరి, సింగపుఁ దేజిగలచాన=సింహవాహన మెక్కెడి యాఁడుది, వెనకయ్యతల్లి=వినాయకునితల్లి—౯ పార్వతీదేవి. కలుములచెలి=సంపదకు అధిదేవతయైనమగువ, జిడ్డుకడలిబొట్టియ=పాలసముద్రమునకుఁ గూఁతురు, లచ్చి (ప్రకృతి. లక్ష్మి.), తమ్మిగద్దియబోటి = కమలమనెడు సింహాసనమందుఁ గూర్చుండుచెలువ, తల్లితల్లి=తల్లియగుగంగకుఁదల్లి. పెనిమిటియెదనుండు ననబోఁడి=భర్తయొక్కవక్షస్థలమునందు వాసముచేసెడు స్త్రీ, మరుతల్లి=మన్మథునికి జనని, నెలచెలియలు=చంద్రునికిఁ జెల్లెలు, లిబ్బినెలఁతుక=భాగ్యమునకు అధిదేవతయైన యాఁడుది, సిరి (ప్రకృతి-శ్రీ)-౧౦ లక్ష్మీదేవి. అంచతేజిపొలఁతి = హంస వాహనముగాఁ గల బ్రహ్మయొక్కభార్య, తలవాఁకిట మెలంగుచెలువ=తలకు వాఁకిలియైననోటియందు మెలంగెడుకాంత, నలువరాణి=బ్రహ్మదేవునియొక్కభార్య, పలుకులజవరాలు=వాక్కులకు విద్యలకు అధిదేవత యగుస్త్రీ, లచ్చికోడలు=(బ్రహ్మపత్ని యగుటచే) లక్ష్మీదేవి కోడలు—౫ సరస్వతి.

సీ. అడుగుకైదువుపుల్గు ♦ పడగదు నేదారి
యరబారతల్లుల ♦ యరిదిబిడ్డ
వెనకయ్యవెనుకయ్య ♦ వేల్పులదళవాయి
చిలువలబోనంపుఁ ♦ బులుఁగురౌతు

సత్తిఁ బూనువలంతి • యిత్తిగమోములఁ
బలియుఁడు బారచే • తులుగలాఁడు
రిక్కరక్కసుమిత్తి • తెల్లుకానుపు కొంచ
మల వ్రక్కలించిన • మన్నెకాఁడు
తే. గట్లయేలికమనుమఁడు • కప్పుతెఱవ
మేటికొమరుఁడు వేలుపు•టేటిసవతి
కొడుకు ముద్దయ్య కందుఁడు • కొమరుసామి
యనఁగ గుహనామధేయంబు • లమరు సాంబ. 7

టీ. అడుగుకైదువపుల్గుపడగదునేదారి = అడుగుకైదువపుల్గు (కాళ్లు ఆయుధముగాఁగల పక్షియగు) కోడి టెక్కెముగాఁగలమొనకాఁడు, అరబారతల్లులయరిదిబిడ్డ=ఆర్గురుతల్లులకు (షట్కృత్తికలకు) ముద్దుకొమరుఁడు, వెనకయ్యవెనుకయ్య = విఘ్నేశ్వరునికి తమ్ముఁడు, వేల్పులదళవాయి = దేవతలకు సేనాధిపతి, చిలువలబోనంపుఁబులుఁగురౌతు=పాములే ఆహారముగాఁగలిగినపక్షి (నెమలిని) వాహనముగాఁ గలిగినదిట్ట, సత్తిబూనువలంతి=శక్తి అను ఆయుధమును ధరించునట్టినేర్పరి, ఇత్తిగమోములబలియుఁడు (ఇరు+తిగ=ఇత్తిగ-రెండుమూఁడులు-ఆఱు) = ఆఱుమొగములుగలిగినప్రభువు-షణ్ముఖుఁడు, బారచేతులుగలాఁడు = పండ్రెండు బాహువులుగలవాఁడు, రిక్కరక్కసుమిత్తి=(రిక్కరక్కసుఁడు-అతనికిమృత్యువు) తారకాసురుని చంపినవాఁడు, తెల్లుకాన్పు = శరవణభవుఁడు, కొంచమలవ్రక్కలించిన మన్నెకాఁడు=క్రౌంచమనుపర్వతము తొలచిన ప్రభువు, గట్లయేలికమనుమఁడు=హిమవంతుని దౌహిత్రుఁడు, కప్పుతెఱవమేటికొమరుఁడు = పార్వతియొక్క ముద్దుబిడ్డఁడు, వేలుపుటేటి సవతికొడుకు = (వేలుపు+ఏఱు = దేవతలనది,) గంగాదేవికి సవతియైనపార్వతికి బిడ్డఁడు, ముద్దయ్య=పిన్నవాఁడు, కందుఁడు (స్కందుఁడు-ప్రకృతి.), కొమరుసామి (కుమారస్వామి శబ్దభవము.)-౧౭ కుమారస్వామి.

సీ. తలఁపుచూలి మరుండు ♦ వలఱేఁడు చిలుకరా
తామనిచెలి గాడ్పు♦టరదపుదొర
జాబిల్లి యల్లుఁడు ♦ చౌవంచతూపుల
నెఱదంట కలుముల♦గరితబిడ్డ
కన్నులవిల్తుఁడు ♦ కమ్మవిల్తుఁడు పచ్చ
విలుకాఁడు చక్కెర♦వింటిజోదు
వెడవిలుతుఁడు తియ్య♦విల్తుఁడు చిగురాకు
విలుకాఁడు తుంటవిల్ ♦గలదునీఁడు
తే. తలిరువిల్తుఁడు ననవిల్తుఁ ♦ డలరువిల్తుఁ
డించువిల్కాఁడు రాచిల్క ♦ నెక్కుఱౌతు
మీనుమొసలిసిడెంబుల♦మేటి తేఁటి
యల్లెవాఁ డన మదనాఖ్య ♦ లమరు సాంబ. 8

టీ. తలఁపుచూలి=సంకల్పమునందుఁబుట్టినవాఁడు, మరుఁడు (ప్ర. స్మరుఁడు), వలఱేఁడు=(వలపు+ఱేఁడు) మోహమునకు అధిపతి, చిలుకరాతు=చిలుక వాహనముగాఁ గలబంటు, ఆమనిచెలి=వసంతునికి (వసంతఋతువునకు) స్నేహితుఁడు, గాడ్పుటరదపుదొర = గాలియే తేరుగాఁగల ప్రభువు (గాడ్పు+అరదము - టుగాగమము.), జాబిల్లియల్లుఁడు = చంద్రునికి మేనల్లుఁడు, చౌవంచతూపులనెఱదంట = అయిదుబాణములుగల గట్టిబంటు, కలుముల గరితబిడ్డ = లక్ష్మీదేవికిఁ బుత్త్రుఁడు, కన్నులవిల్తుఁడు = కణుపులుగలవింటివాఁడు, కమ్మవిల్తుఁడు = మధురమైనవిల్లుగలవాఁడు, పచ్చవిలుకాఁడు = పచ్చని విల్లుగలవాఁడు, చక్కెరవింటిజోదు = చెఱకువిల్లుగాఁగల బంటు, వెడవిలుతుఁడు = తేలికయిన ధనుస్సుగలవాఁడు, తియ్యవిల్తుఁడు= తియ్యనైనవిల్లుగలవాఁడు, చిగురాకువిలుకాఁడు = మామిడి మొదలగువాని యిగుళ్లు విల్లుగాఁ గలవాఁడు, తుంటవిల్ గలదునీఁడు = చెఱకుతుంట విల్లు

గాఁగల ప్రభువు, తలిరువిల్తుఁడు=చిగురువింటివాఁడు, ననవిల్తుఁడు = పూవుటమ్ములుగలవాఁడు, అలరువిల్తుఁడు = పూవింటివాఁడు, ఇంచువిల్కాఁడు=చెఱకువిల్లుగాఁగలవాఁడు, రాచిల్క నెక్కురౌతు = మేటిచిలుక నెక్కుబంటు, మీను మొసలిసిడెంబుల మేటి = చేఁపలు, మొసళ్లు టెక్కెమునందుఁగల ప్రభువు, తేఁటియల్లెవాఁడు = తుమ్మెద యల్లెత్రాడుగాఁగలవాఁడు - ౨౮ మన్మథుఁడు.

సీ. సతపేరుతత్తడి ♦ జతతేరుగలప్రోడ
యనిఁబడ్డనెఱబంటు ♦ లరుగుత్రోవ
వెన్నునివలగన్ను ♦ వేయిచేతులదిట్ట
తిగవేలుపుల టెంకి ♦ పగటిజ్యోతి
జమునయ్య మినుమాని♦కము చాయపెనిమిటి
పగలుసేయువలంతి ♦ జగముకన్ను
నెలజోడు తమ్మిచ♦క్కిలిగింత వేవెల్గు
కలువలసూడు చీఁ♦కటులగొంగ
తే. జక్కవలయంటు మ్రొక్కుల♦సొక్కుసామి
బారరూపులవేల్పు ప్రాఁ♦బల్కుసొమ్ము
పెట్టె చలిదాయ ప్రొద్దునాఁ ♦ బెల్లు దనరు
లోకబాంధవునకు శివా ♦ లోల సాంబ. 9

టీ. సతపేరుతత్తడి జతతేరుగలప్రోడ=సప్తయనుపేరుగల రెండుగుఱ్ఱములను గట్టినరథంబునఁ బోవునేర్పరి, అనిఁబడ్డనెఱబంటులరుగుత్రోవ=యుద్ధమునఁ జచ్చినశూరులు పోవుమార్గము (యుద్ధమునఁ జచ్చినవారు సూర్యుని భేదించుకొని వీరస్వర్గమునకుఁ బోవుదురు అని శ్రుతి), వెన్నునివలగన్ను=విష్ణువుయొక్క కుడికన్ను, వేయిచేతులదిట్ట = వేయిచేతులుగలయోధుఁడు, తిగవేలుపులటెంకి = త్రిమూర్తులకు వాసమయినవాఁడు, పగటిజ్యోతి=పగటియందు

వెలుఁగునట్టి జ్యోతిస్స్వరూపుఁడు, జమునయ్య = యమునికిఁదండ్రి, మినుమానికము = ఆకాశమునకు రత్నమయినవాఁడు-ద్యుమణి, చాయపెనిమిటి = ఛాయాదేవికిమగఁడు, పగుగనేయుఁ వలంతి=దినమును గల్గించునేర్పుకాఁడు - దినకరుఁడు, జగముకన్ను=లోకమునకు నేత్రమయినవాఁడు – జగచ్చక్షువు, తమ్మిచక్కిలిగింత = కమలమునకు గిలిగింతపెట్టువాఁడు, వేవెల్గు = (వేయి + వెలుఁగు) వేయికిరణములుగలవాఁడు-సహస్రాంశువు, కలువలసూడు=కలువలకువిరోధి, చీఁకటులగొంగ=అంధకారమును బోఁగొట్టువాఁడు, జక్కవలయంటు = చక్రవాకపక్షులను జేర్చునది, మ్రొక్కులసొక్కుసామి = నమస్కారములకు(మెచ్చుకొని) మైమఱచునట్టివేలుపు, బారరూపులవేల్పు = పండ్రెండు మేనులుగలదేవుఁడు-ద్వాదశాత్ముఁడు, ప్రాఁబల్కుసొమ్ముపెట్టె= తొలిపలుకులు (వేదములు) అనెడు భూషణములకుఁ బెట్టియవంటివాఁడు, చలిదాయ = చల్లదనమునకు విరోధి, ప్రొద్దు (బ్రధ్నశబ్దభవము.)-౨౨ సూర్యుఁడు.

సీ. కలకంతుతలమానిౘకము వేలుపులబువ్వ
 జాబిల్లి మరుమామ ♦ చందమామ
జింకతాలుపు తొగ♦చెలికాఁడు జడదారి
 కన్నాప రేఱేఁడు ♦ కడలివెన్న
చుక్కలగమికాఁడు ♦ జక్కవపగవాఁడు
 చలివెల్గు రేవెల్గు ♦ చలువజోతి
వెన్నునెడమకన్ను ♦ వెన్నెలరాయఁడు
 నెల తమ్మిదాయ ము♦న్నీటిపట్టి
తే. కందుగలదుండగీఁడు చీఁ♦కటులమిత్తి
పంటపైరులదొర ప్రొద్దు♦జంట లచ్చి
యన్న రేజోతి చందన ♦ నమరుచుండుఁ
గుముదమిత్రునినామధే♦యములు సాంబ. 10

టీ. కలికంతు తలమానికము = శివునికి శిరోభూషణము, వేలుపుల బువ్వ=దేవతలకు ఆహారమైనవాఁడు (చంద్రునికళలలో పదునైదింటిని దేవతలలోఁ గొందఱు ప్రతిదినము నొక్కొకఁ డొక్కొక్కటివంతునఁ దిందురు. అని శ్రుతి.), జాబిల్లి=(జాను+బిల్లిక) చక్కనిబింబముగలవాఁడు, మరుమామ = మన్మథునికి మేనమామ, చందమామ (చంద్రమశ్శబ్దభవము), జింకతాలుపు=జింకనుధరించినవాఁడు, తొగచెలికాఁడు = కలువలకు స్నేహితుఁడు, జడదారికన్పాప=అత్రిమహామునియొక్క నేత్రమువలనఁ బుట్టినవాఁడు, రేఱేఁడు=రాత్రికిఁ బ్రభువు, కడలివెన్న=క్షీరసముద్రమునందుఁ బుట్టినవెన్న, చుక్కలగమికాఁడు=నక్షత్రములకురాజు, జక్కవపగవాఁడు = చక్రవాకపక్షులదంపతులకు విరోధి (వాని నెడఁబాపువాఁడని యర్థము), చలివెల్గు=చల్లనికిరణములు గలవాఁడు, రేవెల్గు=రాత్రియందుఁ బ్రకాశించువాఁడు, చలువజోతి=చల్లనివెలుతురు గలవాఁడు, వెన్నునెడమకన్ను=విష్ణువుయొక్క వామనేత్రము, వెన్నెలరాయఁడు=చంద్రికకుఁ బ్రభువు, నెలతమ్మిదాయ = కమలములకు విరోధి (చంద్రోదయమయినఁ దామరపూవులు మూసికొనును.). మున్నీటిపట్టి=సముద్రునికిఁబుత్త్రుఁడు, కందుగలదుండగీఁడు= నల్లనికళంకముగలధూర్తుఁడు, చీఁకటులమిత్తి = చీఁకటికిమృత్యువు–చీఁకటిని బోఁగొట్టువాఁడు, పంటపైరులదొర = సస్యములకురాజు, ప్రొద్దుజంట= సూర్యునకుసాటి, లచ్చియన్న=లక్ష్మీదేవి కన్నయైనవాఁడు, రేజోతి = రాత్రివెలుంగువాఁడు, చందు (ప్ర. చంద్రుఁడు)-౨౭ చంద్రుఁడు.

సీ. పదిపదులంచుల♦బాఁకుఁ దాల్చుదునీఁడు
కొండలఱెక్కలు ♦ కొట్టినదణి
జమిడియేఁబదులజ♦న్నములు చేసినమేటి
సోమాసులకుఁ దావు ♦ సూపుజాణ
యొత్తరంపుఁజెవుల♦తత్తడివజ్రీఁడు
విప్పుఱెప్పలఱేఁడు ♦ వెల్లిగౌరు

మావటీఁడు తలఁపు♦మానికముగలాఁడు
నిలువెల్లఁ జూపులై ♦ వెలయువాఁడు
తే. మింటిప్రోల్సామి జడదారి ♦ యింటికోడి
పెట్టుమ్రాఁకుల వెలిగిడ్డిఁ ♦ బెనిచినదొర
మొదటిదిక్కుసుబాదారి ♦ మొయిలుజక్కి
సామి యన నింద్రునామముల్ ♦ జరగుసాంబ 11

టీ. పదిపదులంచులబాఁకుఁదాల్చుదనీఁడు = (పదిపదులునూఱు) నూఱంచులుగల యాయుధమును (వజ్రాయుధమును) ధరించినమేటి, కొండల ఱెక్కలుకొట్టినదణి = పర్వతములయొక్క ఱెక్కలను నఱికిన నేర్పుకాఁడు, జమిడియేఁబదుల జన్నములుచేసిన మేటి = (జమిడియేఁబదులు = నూఱు) నూఱు యజ్ఞములుచేసిన యుత్తముఁడు - శతమఖుఁడు, సోమాసులకుఁ దాపుసాపు జాణ=యాగములొనర్చినవారికునికి చూపునట్టినేర్పరి, ఎత్తరంపుఁజెవులతత్తడి వజ్రీఁడు = నిక్కికొనియుండు చెవులుగలవాహనము (ఉచ్చైశ్శ్రవము) నెక్కెడి మొనకాఁడు, విప్పుఱెప్పలఱేఁడు = (విప్పుఱెప్పలు = తెఱచికొని యుండు ఱెప్పలుగలవారు-అనిమిషులు-దేవతలు) దేవేంద్రుఁడు, తెల్లగౌరు మావటీఁడు = తెల్లనియేనుఁగును-ఐరావతమును ఎక్కెడిమావటివాఁడు, తలఁపుమానికముగలాఁడు = చింతామణిగలవాఁడు, నిలువెల్లఁజూపులై వెలయువాఁడు = దేహమెల్ల నేత్రములుగలవాఁడు - సహస్రనేత్రుఁడు, మింటిప్రోల్సామి=స్వర్గపట్టణము నేలురాజు, జడదారియింటికోడి = గౌతమమహాముని యొక్క యాశ్రమంబునఁ గుక్కుటరూపంబుఁ దాల్చినవాఁడు, పెట్టుమ్రాఁకుల వెలిగిడ్డిఁ బెనిచినదొర = కల్పవృక్షములను కామధేనువును బోషించినట్టి ప్రభువు, మొదటిదిక్కుసుబాదారి = తూర్పుదిక్కునేలెడు ప్రభువు (సుబాదారి - అన్యదేశ్యము.), మొయిలు జక్కిసామి = మేఘములు వాహనములుగాఁ గలప్రభువు - ౧౮ దేవేంద్రుఁడు.

సీ. తగరుబాబాసాని ♦ దుగమోరపాదుసా
తెమ్మరచెలి యన్ని ♦ తిండికాఁడు
నీటిబిడ్డఁడు కిత్తు ♦ నిప్పు ముట్టఁగరాని
బలియుఁడు సతనాలు ♦ కలదునీఁడు
కప్పుత్రోవరి తిగ ♦ కాళ్ల దేవర యగ్గి
చి చ్చింగలం బనఁ ♦ జెలఁగు వహ్ని
పోతుతత్తడిరౌతు ♦ ప్రొద్దుకూన జముండు
మిత్తి దక్కినమేలు ♦ మేటి జమున
తే. తోడు గుదెతాల్పు పెతరుల ♦ ఱేఁ డనంగఁ
గాలునిసమాహ్వయము లగు ♦ మూలఱేఁడు
త్రిమ్మరీఁడు రక్కసి పొల ♦ దిండి సోఁకు
మూఁకదణి నా నిరృతిపేళ్లు ♦ పొసఁగు సాంబ. 12

టీ. తగరుబాబాసాని = పొట్టేలువాహనముగాఁగలరౌతు, దుగమోరపాదుసా = రెండుముఖములుగలదేవుఁడు (పాదుసా - అన్యదేశ్యము), తెమ్మరచెలి = వాయువునకుఁ జెలికాఁడు, అన్నితిండికాఁడు = సర్వభక్షకుఁడు, నీటిబిడ్డఁడు = ఉదకమునందుఁ బుట్టినవాఁడు, కిత్తు, నిప్పు, ముట్టఁగరానిబలియుఁడు = తాఁకఁగూడని నేర్పరి, సతనాలుకలదునీఁడు = ఏడునాలుకలు గలప్రభువు - సప్తజిహ్వుఁడు, కప్పుత్రోవరి = నల్లనిమార్గముగలవాఁడు - కృష్ణవర్త్మ, తిగకాళ్లదేవర = మూఁడుపాదములుగలవేల్పు, అగ్గి (అగ్ని - ప్రకృతి.), చిచ్చు, ఇంగలము (అంగారశబ్దభవము.)-౧౮ అగ్ని. పోతుతత్తడిరౌతు=దున్నపోతు నెక్కుబలియుఁడు, ప్రొద్దుకూన = సూర్యునిబిడ్డఁడు, జముఁడు(ప్ర. యముఁడు), మిత్తి(మృత్యుశబ్దభవము.),దక్కినమేలుమేటి = దక్షిణ దిక్పాలుఁడు, జమునతోడు = యమునకుఁతోఁబుట్టువు, గుదెతాల్పు = పాశమును దాల్చినవాఁడు, పెతరుల ఱేఁడు = పితృదేవతల కధిపతి - ౮ యముఁడు. మూలఱేఁడు = నైరృతిమూల కధిపతి, త్రిమ్మరీఁడు=

రాత్రులందుఁ దిరుగువాఁడు, రక్కసి (ప్ర. రాక్షసుఁడు.), పొలదిండి = మాంస మాహారముగాఁ గలవాఁడు, సోఁకుమూఁకదణి = రాక్షససమూహములకధిపతి- నైరృతి.

సీ. పడమటిదొర నీటి•యొడయఁడు జడిసామి
  మొసలిగుఱ్ఱమురౌతు • మొయిలుఱేఁడు
వల్లెత్రాడుగలట్టి•వాఁడు నా వరుణాఖ్య
  లమరెను జింకగు•ఱ్ఱమువలంతి
బీదలపెనుబాద • యీఁద త్రాఁచులమేఁత
  గందపుమలగుబ్బి•కాఁడు గాడ్పు
పయ్యర తావిమో•పరి వలి మరుతేరు
  సుడిగొట్టు తెమ్మెర • సోఁకుబూచి
తే. మేనుతాల్పుల కుసురైన•మేటి నింగి
చూలి మబ్బులపగదాయ • గాలి సురఁటి
వీవనలపుట్టు దువ్వగా•వించుజాణ
కరువలి యనంగ మారుతా•ఖ్య లగు సాంబ. 13

టీ. పడమటిదొర=పశ్చిమదిక్కు నేలెడువాఁడు, నీటియొడయఁడు = ఉదకముల కధిపతి-అపాంపతి, జడిసామి = వాన కధిపుఁడు, మొసలిగుఱ్ఱమురౌతు = మొసలివాహనము గాఁగల శూరుఁడు, మొయిలుఱేఁడు=మేఘాధిపతి, వల్లెత్రాడుగలట్టివాఁడు = పాశమునుదాల్చినవాఁడు - ఈ వరుణుఁడు. జింకగుఱ్ఱమువలంతి = జింకవాహనముగాఁగల నేర్పుకాఁడు, బీదలపెనుబాద=బీదలను జలికాలంబున మిక్కిలి బాధించునది, ఈఁద = చల్లనివాఁడు, త్రాఁచులమేఁత = పాముల కాహారమైనవాఁడు, గందపుమలగుబ్బికాఁడు=మలయపర్వతమునుండి వీఁచువాఁడు, గాడ్పు, పయ్యర, తావిమోపరి = పుష్పాదుల గంధముదాల్చువాఁడు, వలి, మరుతేరు = మన్మథు

నకు నరద మయినవాఁడు, సుడిగొట్టు=చుట్టివీచువాఁడు, తెమ్మర, సోఁకుబూచి = స్పర్శగుణముగలదయ్యము, మేనుతాల్పుల కుసురైనమేటి = శరీరధారులకుఁ బ్రాణమైనమేటి, నింగిచూలి = ఆకసమునఁ బుట్టినవాఁడు, మబ్బులపగదాయ=మేఘములను జెదరఁగొట్టువిరోధి, గాలి, సురటివీవనలపుట్టు = విసనకఱ్ఱలు వీచుటచేఁ బుట్టువాఁడు, దువ్వగావించుజాణ = దుమ్మును గలిగించు నేర్పరి, కరువలి-౨౦ వాయుదేవుఁడు.

సీ. జక్కులపాదుసా ♦ ముక్కంటిసంగాతి
కాయకన్నేటి రొ♦క్కములఱేఁడు
వానీఁడు రారాజు ♦ వడచక్కియెకిమీఁడు
తత్తడి నెక్కెడు♦దంట యనఁగ
ధనదుపేళ్లగు జడ♦దారి గిబ్బసిపాయి
తిగకంటిదోర తుది♦దిక్కుఱెంకి
యనఁగ నీశానాఖ్య ♦ లనువొందుఁ జిందము
కూఁతకైదువు బూరఁ♦గొమ్ము సంకు
తే. వలమురి యనంగ శంఖము ♦ వెలయుఁ జుట్టు
వాలు సుడివాలు వట్రువ♦వాలు బటువు
వాలు పదినూఱులంచుల♦వాలు బిల్ల
వా లన సుదర్శనాఖ్యలు ♦ వఱలు సాంబ. 14.

టీ. జక్కులపాదుసా = యక్షులకు ఱేఁడు, ముక్కంటిసంగాతి = త్రినేత్రునకుఁ జెలికాఁడు, కాయకన్నేటి = కాయగాచిన కన్నులుగలయుత్తముఁడు, రొక్కములఱేఁడు = ధనముల కధిపతి, వానీఁడు = (వానెడు ఈఁడు) వైశ్యకులమునఁ బుట్టినవాఁడు, రారాజు = రాజులకురాజు-రాజరాజు, వడచక్కియెకిమీఁడు = ఉత్తరదిక్కు నేలువాఁడు, తత్తడినెక్కెడు దంట = గుఱ్ఱపువాహనము నెక్కెడి శూరుఁడు-౮ కుబేరుఁడు. జడదారి

జడలను (జటాజూటమును) ధరించినవాఁడు, గిబ్బసిపాయి = ఎద్దునెక్కెడి రౌతు, తిగకంటిదొర = త్రినేత్రుఁడగు ప్రభువు, తుదిదిక్కువెంకి = కడపటిదిక్కు (ఈశాన్యపుమూల) యునికిపట్టుగాఁగలవాఁడు-౮ ఈశానుని పేరులు. చిందము, కూఁతకైదువు=ఊఁదెడి యాయుధము, బూరఁగొమ్ము, సంకు (ప్ర. శంఖము.), వలమురి=కుడితట్టుగాఁ దిరుగునది-౨ విష్ణువుయొక్క పాంచజన్యము. చుట్టువాలు, సుడివాలు, వట్రువవాలు - (ఈ 3 పదములకు గుండ్రనియాయుధము లని యర్థము.) బటువువాలు = గట్టియాయుధము, పదినూఱులంచులవాలు = (పదినూఱులు = వేయి) వేయి యంచులుగల యాయుధము, బిల్లవాలు = బిళ్లవలె గుండ్రనైన యాయుధము - ౬ విష్ణువుయొక్క సుదర్శనము.

సీ. తుదచుక్కపేరిటి♦తొయ్యలిపెనిమిటి
కప్పుదేవరయన్న ♦ కలపదారి
కటివల్వప్రోడ రోఁ♦కలితాల్పు తాటిజె
క్కేము మేటిబలియుఁడు ♦ జమునగొంగ
యన బలభద్రుపే♦ళ్లగుఁ గ్రీడిచెలితేరు
పులుఁగురాయఁడు వెలి♦మోముపక్కి
బొల్లిమోరపులుంగు ♦ నల్లనయ్యరవాలు
తొడలేనివానిసై♦దోడు గరుడి
తే. వేలుపులబువ్వఁగొనుజోదు ♦ వెన్నుపడగ
చిలువమేఁతరి మేలిచ్చు♦పులుఁగు గరుటి
తల్లివేసట వాపిన♦దంట యనఁగ
వైనతేయసమాఖ్యలు ♦ వఱలు సాంబ. 15

టీ. తుదచుక్కపేరిటితొయ్యలిపెనిమిటి = (తుదచుక్కపేరు = నక్షత్రములలోఁ గడపటినక్షత్రముయొక్క పేరుకాంతకుఁ బెనిమిటి.) రేవతీరమణుఁడు, కప్పుదేవరయన్న = నల్లనిదేవరకు (కృష్ణునికి) అన్నయైనవాఁడు,

కలపదారి = నాఁగేలు ఆయుధముగాఁ గలవాఁడు, కటిపల్వప్రోడ = నల్లని పట్టుబట్టను ధరించిననేర్పరి-నీలాంబరుఁడు, రోఁకలితాల్పు = ముసలాయుధుఁడు, తాటిటెక్కెము మేటిబలియుఁడు = తాళధ్వజుఁడగు గొప్పబలవంతుఁడు, జమునగొంగ = యమునానదికి శత్రువు - బలరాముఁడు. క్రీడిచెలితేరు=అర్జునుని చెలికాఁడగు విష్ణువుయొక్క వాహనమైనవాఁడు, పులుఁగురాయఁడు = పక్షులకురాజు, తెలిమోముపక్కి = తెల్లనిముఖముగలపక్షి, బొల్లిమోరపులుంగు, (పై యట్లే.) నల్లనయ్యరవాలు = నల్లనిదేవుని యొక్క రవగాలు - అస్కందితగతినిఁబోవు గుఱ్ఱము - విష్ణువునకు వేగముగాఁబోవ సాధనమైన వాహనము, తొడలేనివానిసైదోడు=అనూరుని కిందమ్ముఁడు, గరుడి(ప్ర.గరుడుఁడు), వేలుపులబువ్వఁగొనుజోదు=వేలుపుల కాహారమయిన యమృతము నపహరించినబంటు, వెన్నుపడగ=విష్ణువుయొక్క ధ్వజమైనవాఁడు, చిలువమేఁతరి=పాములను దినువాఁడు, మేలిచ్చుపులుఁగు=జనులకు మేలుగలుగఁజేయుపక్షి, గరుటి (రూ. గరుడి.), తల్లివేసట వాపినదంట=తల్లియొక్క శ్రమములను బోఁగొట్టిన శూరుఁడు - ౧౩ గరుత్మంతుఁడు.

సీ. వడముడి తెమ్మెరకొడుకు కన భీముఁడౌ
వేగంటికొమరుఁడు • వెన్నునంటు
వెన్నుమచ్చదునీఁడు • విచ్చు కవ్వడి
గెలుపు పేరుగలాఁడు • క్రీడి యనఁగ
నర్జుననామంబు • లగు ముత్తెరువులాఁడి
తెలివాఁక పొందామరలకుఁ బంట
కటికంటుతలయేలు • పెరుమాళ్లడుగుబుగ్గ
జడదారిచెవియూట • చదలువాఁక
తే. తాటిటెక్కెముదణితల్లి • తాతపనఁటి
వెల్లి మినువాఁక మిన్నేఱు • వేల్పుటేఱు

ఱెల్లుకానుపుసవతిత♦ల్లి యనఁ దనరు
నమరతటినికి నామధే♦యములు సాంబ. 16

టీ. వడముడి, తెమ్మెరకొడుకు = పవననందనుఁడు - ౨ భీముఁడు, వేగంటికొమరుఁడు = వేయికన్నులుగలదేవుని (ఇంద్రుని) పుత్త్రుఁడు, వెన్నునంటు = కృష్ణునికిఁ బ్రియస్నేహితుఁడు, వెన్నుమచ్చుదునీఁడు=వీఁపునందు మచ్చగల పరదారు, బివ్వచ్చు (ప్ర. భీభత్సుఁడు), కవ్వడి=(కవ+వడి) రెండుచేతులతో నేకకాలమున బాణములనేయువాఁడు, గెలుపుపేరుగలాఁడు= "విజయుఁడు" అనునామముగలవాఁడు, క్రీడి=(కిరీటి. ప్రకృతి.) కిరీటముగలవాఁడు - ౭ అర్జునుఁడు. ముత్తెరువులాఁడి = మూఁడుమార్గములందుఁ బ్రవహించునది-త్రిపథగ. తెలివాఁక=తెల్లనినది, పొందామరలకుఁబంట = బంగారుతామరపువ్వుల కునికిపట్టయినది, కఱకంఠుతలయేఱు=ఈశ్వరుని శిరసునందు వసించునది, పెరుమాళ్లడుగుబుగ్గ=విష్ణువుయొక్క పాదములందుఁ బుట్టిన నీటియూఁట - విష్ణుపది, జడదారిచెవియూట = జహ్నువనెడిమహార్షియొక్క చెవినుండిపుట్టినది, చదలువాఁక = ఆకసమందుబాఱునది, తాటిసెక్కెముదణితల్లి=తాళధ్వజుఁడగుభీష్మునితల్లి, తాతపనఁటివెల్లి=బ్రహ్మకమండలువునందలి నీటిప్రవాహము, మినువాఁక = ఆకసమందుఁబాఱెడునది, మిన్నేఱు (చూ. పైన,), వేల్పుటేఱు=(వేల్పు+ఏఱు) దేవతనది, ఱెల్లుకానుపుసవతితల్లి=కుమారస్వామికి మాఱుతల్లి-౧౩ గంగానది.

సీ. వేల్పుసువారంపు♦విడిది వెన్నునిటెంకి
రతనాలపంట సం♦ద్రంబు కడలి
పుడమిముద్దియకోక ♦ మున్నీరు ప్రాయేఱు
మబ్బుపువ్వులవెల్లి ♦ మామమామ
గట్టుసాకొమరునిఁ♦ గాచిననేర్పరి
యేఱులమగఁడు రే♦యింటిమామ

ముక్కంటియమ్ముల♦పొది మింటిలాయంబు
తోఁటదొడ్డియొనర్చు ♦ నీటుకాఁడు
తే. చందునయ లచ్చితండ్రి నా ♦ జలధి పరఁగు
వెల్లయేనుఁగు చౌదంతి ♦ వేల్పుగౌరు
మొదటిహత్తి నా సురకరి ♦ పొదలుఁ దెల్ల
జక్కి నిక్కుపీనులమావు ♦ చదలుతేజి
యనఁగ నుచ్చైశ్శ్రవము పేరు ♦ లమరు సాంబ. 17

టీ. వేల్పుసువారంపువిడిది = దేవతలవంటయిల్లు, వెన్నునిటెంకి = విష్ణువుయొక్క వాసస్థానము, రతనాలపంట = రత్నములఁ బండుచోటు, సంద్రంబు (ప్ర. సముద్రము.), కడలి, పుడమిముద్దియకోక=భూదేవికివస్త్రరూపమైనది. మున్నీరు = (ముందు+నీరు) పురాతనమైననీరు, ప్రాయేఱు = (ప్రాఁత + ఏఱు.) ప్రాచీనమైనది, మబ్బుపువ్వులవెల్లి = (మబ్బుపువ్వులు=మేఘపుష్పములు-నీళ్లు,) నీటికునికిపట్టు, మామమామ = మామయగు విష్ణువునకుమామ, గట్టురాకొమరునిఁ గాచిననేర్పరి=(గట్టురాకొమరుఁడు=హిమవంతునికొమరుఁడు-మైనాకుఁడు) మైనాకుని రక్షించినసమర్థుఁడు, ఏఱులమగఁడు = నదులకు భర్త, రేయింతిమామ = రాత్రియనుకాంతకు మామ (రాత్రి చంద్రునిభార్య యనువాడుకగనుకను,చంద్రుఁడుసముద్రునికిఁబుత్రుఁడగుటచేతను రాత్రికి మామయనఁబడియె), ముక్కంటియమ్ములపొది=త్రినేత్రునకుఁద్రిపురసంహారసమయమున నమ్ములపొదియైనవాఁడు, మింటిలాయంబుతోఁటదొడ్డియొనర్చు నీటుకాఁడు = ఆకాశమును (స్వర్గమును) గుఱ్ఱపుశాలగాను, చెట్లతోఁటగను, పసులదొడ్డినిగాను చేసిననేర్పరి - స్వర్గమునఁగల యుచ్చైశ్శ్రవమనుగుఱ్ఱమును, కల్పవృక్షములను, గామధేనువును గన్నవాఁడు, చందునయ = చంద్రునితండ్రి, లచ్చితండ్రి = లక్ష్మీదేవికి జనకుఁడు - ౧౭ సముద్రము. తెల్లయేనుఁగు = తెల్లనియేనుఁగు, చౌదంతి = నాలుగుదంతములుగలది, వేల్పుగౌరు = దేవతలయేనుఁగు, మొదటిహత్తి=మొదటి

యేనుఁగు - ౪ ఐరావతము. తెల్లజక్కి = తెల్లనిగుఱ్ఱము, నిక్కువీనులమావు = నీల్గుకొనియుండు చెవులుగలగుఱ్ఱము, చదలుతేజి = స్వర్గమందలిగుఱ్ఱము - 3 ఉచ్చైశ్శ్రవము.

సీ. వేలుపుటెంకి కో♦వెల దేవళము గుడి
యనఁగ దేవాలయా♦ఖ్యలు దెలంగుఁ
దెఱిగంట్లు జన్నంపుఁ♦దిండులు జేజేలు
తొలివేల్పుపగతురు ♦ పలుకుటల్లు
మేటులు వేల్పులు ♦ మింటిత్రోవరులు ని
ద్దురలేనిప్రోడలు ♦ నరలుగనని
పెద్ద లనఁగ సురా♦భిఖ్య లౌ వినోప్రోలు
వేగంటికచ్చేరి ♦ వేల్పుటెంకి
తే. యనఁగ స్వర్గముపేళ్లగు ♦ వినుమిటూరు
లచ్చరలు వేల్పుచెలు లన ♦ నమరు నమర
తరుణులకుఁ జాగరతనము ♦ తలఁపుమాని
క మనఁ జింతామణిసమాఖ్య ♦ లమరు సాంబ. 18

టీ. వేలుపుటెంకి = దేవతలయునికిపట్టు, కోవెల, దేవళము (ప్ర. దేవాలయము.), గుడి - దేవాలయము. తెఱగంట్లు = తెఱచికొనియుండు కన్నులు గలవారు - అనిమేషులు, జన్నంపుదిండులు = యజ్ఞములయందు హవిర్భాగములను దినువారు, జేజేలు, తొలివేల్పుపగతురు = పూర్వదేవులకు (అసురులకు) విరోధులు, పలుకుటల్లుమేటులు = మాటలె యాయుధములుగాఁ గలవారు, గీర్వాణులు, వేల్పులు = వేలుపులు, మింటిత్రోవరులు = ఆకాశమునఁ దిరుగువారు, నిద్దురలేనిప్రోడలు = నిద్రలేనినేర్పరులు, నరలుగనని పెద్దలు = ముదిమివలన వెంట్రుకలు ముగ్గుటవానియందుఁ గలుగు తెల్లదనములేని గొప్పవారు - క. దేవతలు. వినోప్రోలు = ఆకసమందుండు పట్టణము, వేగంటికచ్చేరి =

ఇంద్రుని సభ, వేల్పుటెంకి=దేవతలుండుచోటు-3 స్వర్గము. అచ్చరలు(ప్ర. అప్సరసలు.), వేల్పుచెలులు=దేవతాంగనలు-అ అప్సరసలు. చాగరతనము= ఇచ్చునట్టి రత్నము, తలఁపుమానికము = కోర్కులొసఁగు రత్నము - అ చింతామణి.

సీ. అడిగిన నొసఁగెడి♦యావు జేజేగిడ్డి
చదలుతొడుకు తెల్ల♦మొద వనంగ
సురగవిపే ళ్ళగుఁ ♦ దెఱగంటిమ్రాఁకులు
పెట్టుమ్రాఁకులు మింటి♦చెట్టు లనఁగఁ
గల్పకాఖ్య లగు వే♦గంటిగొంగలు రక్క
సులు రేయిద్రిమ్మరుల్ ♦ సుకురుసీసులు
వేల్పుదాయలు తొలి♦వేల్పులు నాదైత్య
నామంబు లగు గాలి ♦ గాము నెగడి
తే. కొఱవిరాలుపు బూచి సో♦కుడు పిసాసి
దయ్య మనఁగఁ బిశాచాభి♦ధానము లగు
నివము వలి మం చనంగను ♦ హిమము దనరుఁ
బిడు గనఁగ జెల్లు నశనికిఁ ♦ బేళ్లు సాంబ. 19

టీ. అడిగిననొసఁగెడియావు=కోరినతోడుత నేయిచ్చునట్టియావు, జేజే గిడ్డి=దేవతలగోవు, చదలుతొడుకు = స్వర్గమందుండుగోవు, తెల్లమొదవు = ధవళవర్ణమైనగోవు-అ కామధేనువు. తెఱగంటిమ్రాఁకులు=దేవతలకు సంబంధించినచెట్లు, పెట్టుమ్రాఁకులు = కోరినది యిచ్చుచెట్లు, మింటిచెట్టులు = స్వర్గమందలి వృక్షములు-3 కల్పవృక్షములు. వేగంటిగొంగలు = ఇంద్రునికిఁ బగవారు, రక్కసులు (ప్ర. రాక్షసులు), రేయిద్రిమ్మరుల్ = రాత్రులందుఁ

ద్విరుగువారు, సుకురుసిసులు = శుక్రాచార్యునిశిష్యులు, వేల్పుదాయలు = దేవతలకు విరోధులు, తొలివేల్పులు = పూర్వదేవులు-ఉ రాక్షసులు. గాలి, గాము (ప్ర. గ్రహము), సెగడి, కొఱవిదాలుపు = కొఱవికట్టె త్రిప్పునది, ఖూచి, సోఁకుడు, పిసాసి (ప్ర. పిశాచము.), దయ్యము (ప్ర. దైవము.)-ఆ పిశాచము. ఇవము (ప్ర. హిమము.), వలి, మంచు-3 హిమము. పిడుగు-౧ వజ్రాయుధము.

సీ. మిన్ను చుక్కలత్రోవ • విన్నుప్పరము నింగి
వెన్నునియడుగు విణ్ • వేల్పుఁదెరువు
గాలితండ్రి బయ లా•కసము మొగులు తెన్ను
చదలునా గగనాఖ్య • లొదవుచుండుఁ
బవలు పగలు నాఁగ • దివముపేళ్లగు రేయి
రాతిరి రే యన • రాత్రి యమరు
దెస దిక్కు కడ యన • దిశ యొప్పు నెల చంద
నఁగ మాస మమరుఁ బు•న్నమ యనంగ
తే. నలరుఁ బూర్ణిమకు నమాస • యమవస యనఁ
జను నమావాస్యపేరులు • సంజ సందె
యనఁగఁ దగు సంధ్య కాతపం•బునకు నెండ
ప్రొద్దు వేండ్రం బనెడిపేళ్లు • పొసఁగు సాంబ. 20

టీ. మిన్ను, చుక్కలత్రోవ = నక్షత్రముల మార్గము, విన్ను, ఉప్పరము, నింగి, వెన్నునియడుగు=విష్ణుపది, విణ్, వేల్పుఁదెరువు = దేవతలుపోవునట్టిబాట, గాలితండ్రి=వాయువునకుఁ బుట్టుచోటు, బయలు, ఆకసము (ప్ర. ఆకాశము.), మొగులుతెన్ను=మేఘములమార్గము, చదలు-౧౩ ఆకాశము. పగలు, పవలు-౨ దినము. రేయి, రాతిరి, రే-3 రాత్రి. దెస=(ప్ర. దిశ.) దిక్కు (ఇది సంస్కృతసమము), కడ (ప్ర. కాష్ఠ.)-3 దిక్కు. నెల,

చందు - ౨ మాసము. పున్నమ ౧ పూర్ణిమ. అమాస, అమవస - ౨ అమా వాస్య. సంజ, సందె - ౨ సంధ్యాకాలము. ఎండ, ప్రొద్దు, వేండ్రము - 3 ఆతపము.

సీ. మెఱపులు మెఱుఁగులు ♦ మించు లనఁ దటిత్తు
లగును జుక్కలు రిక్క ♦ లనఁగఁ దార
లమరు జేజేతేని ♦ యరదము నీటిమో
పరి మబ్బు మొయి లనఁ ♦ బరఁగు ఘనము
తెర యల తరఁగ నాఁ ♦ బొరయు వీచికపేళ్లు
నుఱువు నుఱు గనంగఁ ♦ గొఱలు ఫేన
మంతస్సమాభిఖ్య ♦ లగును లోపల లోన
లో నన బహిరాఖ్య ♦ లొప్పును వెలి
తే. బయలు వెలుపల నాఁగ దీ♦పంబుపేళ్లు
వఱలుచుండును జోతి తి♦ర్వాళిక దివ్వె
యనఁగ మందోష్ణమునకు వె♦చ్చన యొకింత
వేఁడి యిసుమంతకాఁక నా ♦ వెలయు సాంబ. 21

టీ. మెఱపులు, మెఱుఁగులు, మించులు - 3 విద్యుత్తు. చుక్కలు, రిక్కలు (ప్ర. ఋక్షములు)-౨ నక్షత్రములు. జేజేతేని యరదము = ఇంద్రుని వాహనమయినది, నీటిమోపరి=నీటినిధరించునది (జలధరము), మబ్బు, మొయిలు- ౪ మేఘములు. తెర, అల, తరఁగ (ప్ర. తరంగము.) - 3 సముద్రపుటలలు. నుఱువు, నుఱుగు - ౨ ఫేనము. లోపల, లోన, లో - 3 అంతర్భాగము. వెలి, బయలు, వెలుపల- 3 బహిర్భాగము. జోతి(ప్ర. జ్యోతిస్సు), తిర్వాళిక (ఇది ద్రావిడపదము.), దివ్వె (ప్ర. దీపము) - 3 దీపము. వెచ్చన, ఒకింతవేఁడి, ఇసుమంతకాఁక - 3 కొంచెపాటియుష్ణము.

క. నిస్తుగ లక్షణకవి యగు
కస్తురిరంగాఖ్యుఁడను జ•గద్ధితముగ నీ
నిస్తులదైవతవర్గను
విస్తర మొనరించినాఁడ • విబుధులకరుణన్. 22

తా. చక్కఁగా లక్షణము లెఱింగిన కవినైన కస్తురిరంగయ్య యను నేను లోకోపకారార్థము పండితుల యనుగ్రహముచే సాటిలేని దేవవర్గును విపులముగాఁ జెప్పితిని.

దేవవర్గు సంపూర్ణము.

---

## మానవవర్గు.

క. శ్రీనగజామానసలస
మానసరోహంస నిరుప•మానవిభవధా
మా నవముగ నీపేరిట
మానవవర్గువు రచింతు • మానక సాంబా.

తా. కాంతియుక్తురాలగు పార్వతియొక్క మానసమనెడుప్రకాశించెడికొలనికి రాయంచయైనవాఁడా! (పార్వతిచే నెల్లప్పుడు ధ్యానింపఁబడువాఁడా!) సాటిలేనికల్మికి నివాసమైనవాఁడా! ఓసాంబమూర్తీ! నీకంకితముగా నేను తప్పక నూతనముగా మానవవర్గును రచించెదను.

సీ. తొలిచదువులు ప్రాఁత•పలుకులు మినుకులు
ప్రామినుకులు తొంటి•బాస లనఁగ
వేదాఖ్య లగు నేల•వేల్పులు తొలిజాతి
వారు మిన్కులచదు•వరులు జన్ని

గట్టులు దుగపుట్టు•కలు పార్లు బాఁపలు
నాఁగ బ్రాహ్మణులకు • నామము లగు
ఱేలు దొరలు నేల•యేలుదంటలు వెన్ను
వలబుజమునఁ గల•వారు రాచ
తే. వారు ఱేఁడులు రెండవ•వంగడంపుఁ
బబువు లన క్షత్త్రియాఖ్య లౌ • వచ్చు బేరి
మూఁడవకొలం బతఁడు నాఁడె•కాఁడు నల్ల
నయ్యతొడబిడ్డ కోమటి • నాఁ దనర్చు
వైశ్యనామంబు లద్రిని•వాస సాంబ. 2

టీ. తొలిచదువులు, ప్రాఁతపలుకులు, మినుకులు, ప్రామినుకులు, తొంటిబాసలు (ఈయన్నింటికిని బూర్వవాక్యములు అని యర్థము.) - ౫ వేదములు. నేలవేల్పులు=పుడమికి దేవులు (భూసురులు), తొలిజాతివారు = అగ్రజన్ములు, మినుకులచదువరులు = వేదాధ్యయనము చేయువారు, జన్నిగట్టులు=యజ్ఞోపవీతముఁ దాల్చినవారు, దుగపుట్టుకలు = ద్విజన్ములు, పార్లు (పాఱులు) = పాఱువారు, బాఁపలు - ౭ బ్రాహ్మణులు. ఱేలు, దొరలు, నేలయేలుదంటలు = పుడమినిఁ బాలించు నేర్పరులు, వెన్నునివలబుజమునఁగల వారు = విష్ణువుయొక్క కుడిబాహువునుండి పుట్టినవారు, రాచవారు = క్షత్త్రియులు, ఱేఁడులు, రెండవవంగడంపుఁబబువులు=రెండవకులమున (క్షత్త్రియ వంశమున)ఁ బుట్టినరాజులు - ౭ క్షత్త్రియులు. వచ్చు, బేరి, మూఁడవకొలం బతఁడు=మూఁడవవంశమున (వైశ్యకులమున)ఁబుట్టినవాఁడు, నాఁడెకాఁడు= నాణెముగలవాఁడు, నల్లనయ్యతొడబిడ్డ=విష్ణువుయొక్కతొడయందుఁబుట్టిన వాఁడు, కోమటి - ౬ వైశ్యుఁడు.

సీ. కలపతాల్పులు తుది•కొలము నేర్పరులు కాఁ
పులు వినువాఁకతోఁ•బుట్టువు లన

నలరును శూద్రాఖ్య • లమ్మ కన్నది తల్లి
యవ్వ నా మాతపే • ళ్ళమరుఁ దండ్రి
యబ్బ కన్నయ్య నా•యన యయ్య యప్పన
జనకాఖ్య లగుఁ దమ్ముఁ • డనుఁగు తోడు
తోడఁబుట్టు వనంగఁ • దోఁబుట్టు వన సోద
రాఖ్య లౌ మొదటివాఁ • డన్న పెద్ద
తే. యనఁగ నగ్రజుఁ డగు నక్క • యప్ప యనఁగ
జ్యేష్ఠకన్యకుఁ జెల్లెలు • చెల్లె చెలియ
లనఁగ దనరు గనిష్ఠ కి•ల్లాలు రాణి
యాలు పెండ్లా మనఁగ భార్య • కగును సాంబ. 3

టీ. కలపతాల్పులు = నాఁగేటినిధరించినవారు, తుదికులము నేర్పరులు=కడపటి(నాలుగవ)కులమునందుఁబుట్టిన నేర్పుగలవారు, కాఁపులు=క్షేత్రములనురక్షించువారు, వినువాఁకతోఁబుట్టువులు = గంగానదికిసైదోడులు(శూద్రులు విష్ణుపాదమునఁబుట్టిరి యని శ్రుతి చెప్పుటచేతను, గంగ విష్ణుపాదోద్భవగనుకను గంగకు శూద్రులు దోఁబుట్టువులని చెప్పఁబడిరి.)-౪ శూద్రులు. అమ్మ, కన్నది, తల్లి, అవ్వ-౪ జనని. తండ్రి, అబ్బ, కన్నయ్య(కన్న+అయ్య), నాయన, అయ్య=పూజ్యుఁడు, అప్ప-౬ జనకుఁడు. తమ్ముఁడు, అనుఁగు, తోడు, తోడఁబుట్టువు, తోఁబుట్టువు - ౫ సోదరుఁడు (చిన్నవాఁడు). మొదటివాఁడు=మొదటఁబుట్టినవాఁడు, అన్న, పెద్ద-3 పెద్దతోఁబుట్టువు (అగ్రజుఁడు). అప్ప, అక్క-౨ జ్యేష్ఠభగిని. చెల్లె, చెలియలు-౨ కనిష్ఠభగిని. ఇల్లాలు (ఇల్లు + ఆలు), రాణి, ఆలు, పెండ్లాము-రూ. పెండ్లము-౫ భార్య.

సీ. అయిదువరాలు ము•త్తైదు వనఁ బురంధ్రి
కగుఁ దోడికోడ లే•రా లనంగఁ

బతిసోదరునిభార్య ♦ పరఁగుఁ గూఁతురు కూఁతు
కొమరిత యనఁ బుత్రి ♦ కమరుచుండుఁ
గొమరుండు బుడుకఁడు ♦ కొడుకు పట్టి యనంగఁ
బుత్త్రుఁ డౌ బిడ బిడ్డ ♦ పూప పాప
కుఱ్ఱ చిఱుత కందు ♦ కూన నిసువు పాల
బుడుత నా శిశునామ♦ములు దనర్చు
తే. గోల ముద్దియ ముద్దరాల్ ♦ బేల ముగుద
యనఁగ ముగ్ధాంగనకు నాఖ్య ♦ లగును ముదిమి
వాఁడు ముదుకఁడు ముదిసిన♦వాఁడు ముసలి
ముదుసలి యనంగ వృద్ధుపే ♦ ళ్ళొదవు సాంబ. 4

టీ. అయిదువరాలు (ఐదువ+ఆలు-రేఫాగమము)-రూ. ఐదువరాలు, ముత్తైదువ-౧ వృద్ధసుమంగలి.తోడికోడలు, ఏరాలు-౨అన్నదమ్ములభార్యలు. కూఁతురు, కూఁతు, కొమరిత-3 పుత్త్రిక. కొమరుఁడు, బుడుకఁడు, కొడుకు, పట్టి-౪ పుత్త్రుఁడు. బిడ, బిడ్డ, పూప, పాప, కుఱ్ఱ, చిఱుత, కందు, కూన, నిసువు-రూ. నిసుఁగు-పా. సిసువు, పాలబుడుత=చంటిబిడ్డ - ౧౨ శిశువు. గోల, ముద్దియ, ముద్దరాలు (ముద్ద+ఆలు), బేల, ముగుద (ప్ర. ముగ్ధ) - ౫ ముగ్ధ (ప్రాయమువచ్చిన యూఁడుది). ముదిమివాఁడు, ముదుకఁడు, ముదిసిన వాఁడు, ముసలి, ముదుసలి - ౫ వృద్ధుఁడు.

సీ. పిన్న కొండికవాఁడు ♦ చిన్న పడుచు చోఱ
పసివాఁ డనెడిపేళ్లు ♦ బాలున కగుఁ
జతురుపే ళ్ళగు దిట్ట ♦ జాణ దంట వలంతి
వెరవరి ప్రోడ నే♦ర్పరి యనంగఁ
జెలికాఁడు సంగాతి ♦ చెలిమరి గాదిలి
సకియ సంగడికాఁడు ♦ సంగడీఁడు

చెలి నేస్తి యనఁ జను ♦ స్నేహితునకుఁ జెల్మి
నంటు మాలిమి పొం ద♦నంగ మైత్రి
తే. కొఱలుఁ గుఱుచ టింగణ గిడ్డ ♦ గిఱక గుజ్జు
పొట్టి యన వామనాఖ్యలౌ ♦ గట్టివాయి
ఱాఁగ జంత గయాళియు ♦ నాఁగఁ దనరు
ధూర్తవనితకు దురితవి♦దూర సాంబ. 5

టీ. పిన్న, కొండికవాఁడు = చిన్నవాఁడు, చిన్న, పడుచు, చౌఱ-రూ. చౌఱ, పసివాఁడు-౭ బాలుఁడు. దిట్ట, జాణ, దంట, వలంతి, వెరవరి (వెరవు+అరి) = ఉపాయముగలవాఁడు (మత్వర్థీయకతద్ధితాంతము), ప్రోడ (ప్ర. ప్రౌఢుఁడు.), నేర్పరి (నేర్పు+అరి-మత్వర్థీయకతద్ధితాంతము.)=సామర్థ్యముగలవాఁడు-౭ సమర్థుఁడు. చెలికాఁడు, సంగాతి=సంగాతము (స్నేహము) గలవాఁడు, చెలిమరి = (చెలిమి+అరి.) చెలిమిగలవాఁడు, గాదిలి, సకియ (ప్ర. సఖి), సంగడికాఁడు - సంగడీఁడు-(పైరెండింటికి సంగడికలవాఁడు అని యర్థము.) చెలి, నేస్తి = నేస్తముగలవాఁడు (నేస్తము+ఇ- మత్వర్థీయకతద్ధితాంతము.) - ౬ స్నేహితుఁడు. చెల్మి-రూ. చెలిమి, నంటు, మాలిమి-రూ. మాల్మి, పొందు-౪ స్నేహితము. కుఱుచ, టింగణ-రూ. టింగణా, గిడ్డ, గిఱక, గుజ్జు, పొట్టి-౭ కుఱుచవాఁడు. గట్టివాయి=పెద్దగొంతుగలది, ఱాఁగ, జంత, గయాళి-రూ. గయ్యాళి=అలక్ష్యము సేయునది-౫ ధూర్తరాలు.

సీ. కబ్బపునేఁతరి ♦ కయి కైసరుఁడు మాట
లల్లువాఁ డనువేళ్లు ♦ చెల్లుఁ గవికి
బట్టులు చదువరుల్ ♦ బట్టు క్రిక్కు లనంగ
వందుల కగుఁ బడ♦వాళ్లు వేగు
వారు వేగరు లనఁ ♦ జారులపే ళ్లొప్పు
బోయీలు బెస్తలు ♦ మోపరు లః

వాహకులకుఁ జెల్లు ♦ సాహిణి సాని రౌ
తనఁగ నశ్వారోహ♦కునకుఁ దనరుఁ
తే. గట్టికలు పణిహారులు ♦ కటిక లనఁగ
వేత్రపాణుల కగు బోయ ♦ వేఁటకాఁడు
నడవిద్రిమ్మరి యనఁ గిరా♦తాఖ్య లెసఁగు
నన్నగళ పేడి యన షండుఁ ♦ డగును సాంబ. 6

టీ. కబ్బపుసేఁతరి = గ్రంథములను రచించువాఁడు, కయి, కైస రుఁడు, మాటలల్లువాఁడు = పదము లొక్కటిగఁ జేర్చువాఁడు - ౪ కవి. బట్టులు, చదువరులు (చదువు+అరులు) = చదువుగలవారు, బట్లు, క్రిక్కలు - ౪ స్తుతిపాఠకులు. పడవాళ్లు, వేగువారు, వేగరులు - 3 చారులు - (మాఱువేసముతోఁ బరరాజ్యములనుండి యచ్చటి సంగతులనుఁ దమరాజునకుఁ దెలుపువారు.) బోయీలు, బెస్తలు, మోపరులు-3 పల్లకులు మొదలగు వానిని మోయువారు. సాహిణి, సాని, రౌతు - 3 గుఱ్ఱపురౌతు. కట్టికలు, పణిహారులు, కటికలు-3 బెత్తము దాల్చి కొలువుచేయు ద్వారపాలురు మున్నగువారలు. బోయ, వేఁటకాఁడు, అడవిద్రిమ్మరి - అడవులందు సంచరించువాఁడు - 3 కిరాతులు. అన్నగళ, పేడి - ౨ నపుంసకుఁడు.

సీ. జాలరి వలఱేఁడు ♦ మీలవేఁటరి యనఁ
దగు ధీవరుని పేళ్లు ♦ తడుపుదాల్పు
వడు గొంటిజందెము♦వాఁడు బమ్మాచారి
యన బ్రహ్మచారిపే ♦ ళ్ళమరు గేస్తు
మనికిఱేఁ డింటివాఁ ♦ డన గృహస్థున కగు
నడవికాఁపు తపసి ♦ జడలదారి
నాఁ జెలువొందు వా♦నప్రస్థునకు నొంటె
కాఁడు గోణముదారి ♦ బోడ బీద

తే. కావులుగలాఁడు సన్నాసి ♦ నా వెలుంగు
యతిసమాఖ్యలు ముగిలిము♦త్తైదు వనఁగ
జక్కి నసఁ బేరఁటా లన ♦ జరగు మృతచి
రంటినామంబు లాపన్న♦రక్షసాంబ. 7

టీ. జాలరి = (జాలము+అరి) జాలముగలవాఁడు, వలకాఁడు = వలకుఁ బ్రభువు, మీలవేఁటరి=చేఁపలను వేఁటాడువాఁడు - 3 చెంబడివాఁడు. తడుపుడాలుపు = కొల్లాయివంటి పంచె కట్టుకొన్నవాఁడు, వడుగు (ప్ర. వటువు.), ఒంటి జందెముగాఁడు = ఒక్క జందెము వేసికొనువాఁడు, బ్రహ్మచారి - ౪ బ్రహ్మచర్యము పూనినవాఁడు. గేస్తు (ప్ర. గృహస్థు.), మనికికాఁడు=ఇంటియజమానుఁడు, ఇంటివాఁడు = ఇల్లుగలవాఁడు - 3 పెండ్లియయినవాఁడు. అడవికాఁపు = అడవియందు వసించువాఁడు, తపసి (ప్ర. తపస్వి.) = తపస్సుచేయువాఁడు, జడలదారి=జడలనుదాల్చినవాఁడు - 3 వానప్రస్థుఁడు. ఒంటికాఁడు = ఏకాకి, గోఁణముదారి = గోఁచిపెట్టికొన్నవాఁడు, బోడ, బీద, కావులుగలాఁడు=కాషాయవస్త్రముఁదాల్చినవాఁడు, సన్నాసి- ఈ సన్న్యాసి. ముగిలిముత్తైదువ= ముక్తినొందిన ముత్తైదువ, జక్కిని, పేరఁటాలు - 3 మృతినొందిన దీర్ఘసుమంగలి.

సీ. మూకాఖ్య లగు మూవ ♦ మూఁగ మూఁగి యనంగఁ
గ్రుడ్డి చీ కన నంధ♦కునకుఁ జెల్లుఁ
బరువము ప్రాయము ♦ వయసు జవ్వన మన
యౌవనాభిఖ్య లౌ ♦ నందగాఁడు
వగకాఁ డమరువాఁడు ♦ వన్నెకాఁ డెమ్మెకాఁ
డౌసుకాఁ డన సొగ♦సైనవాఁడు
నీటుకాఁ డనఁగ రా♦జించు శృంగారికి
గోవాళ్లు బొజుఁగు నాఁ ♦ గోడెకాఁడు

తే. వెచ్చకాఁడు నసువుకాఁడు ♦ వేడ్కకాఁడు
లంజెకాఁడు మిండఁడనఁ బ♦ల్లవుఁడు దనరు
సోయగంబు చక్కఁదనంబు ♦ సొబగు రూపు
నాఁగ సౌందర్యమునకుఁ జె♦న్నగును సాంబ. 8

టీ. మూవ, మూఁగ, మూఁగి- ౩ నోరులేనివాఁడు. గ్రుడ్డి, చీకు-౨ కన్నులులేనివాఁడు. పరువము, ప్రాయము-రూ. పాయము, వయసు (ఇది సంస్కృతసమమని తోఁచెడి), జవ్వనము (ప్ర. యౌవనము)-౫ ప్రాయము. అందగాఁడు = అందముగలవాఁడు, వగకాఁడు, అమరువాఁడు, ఎమ్మెకాఁడు, ఔసుకాఁడు = హోషుకలవాఁడు, సొగసైనవాఁడు, సీటుకాఁడు-౭ సొగసు చేసికొన్నవాఁడు. గోవాళ్ళు, బొజుగు, కోడెకాఁడు, వెచ్చకాఁడు=అప్పిచ్చువాఁడు, నసువుకాఁడు=ప్రేమగలవాఁడు, వేడ్కకాఁడు = తమాషాలుగలవాఁడు, లంజెకాఁడు, మిండఁడు - ౮ విటపురుషుఁడు. సోయగము, చక్కఁదనము, సొబగు, రూపు = ౪ సౌందర్యము.

సీ. గట్టిమనసువాఁడు ♦ గడుసరి యుక్కరి
దిటవరి దిట్టన ♦ ధీరున కగుఁ
గుచ్చితుఁ డడిగొట్టు ♦ కూళ పెంకె బికారి
ముడికాఁడు చిలుమువాల్ ♦ మోటు లుచ్చ
చెండిపోతు గరాసు ♦ మొండికట్టె తులువ
కైలాటకాఁడు ట♦క్కరి పిసాళి
టకటొంకు టాటోటు ♦ తవళి దబ్బిలి దూబ
గడుసు కల్లరి దోస♦కారి చెనఁటి
తే. పాలసుఁడు లండి పిక్కరి ♦ పలువ చెడుగు
బేరజ మనంగ ధూర్తుని♦పేరు లమరు

బగఱు మార్తురు పగతురు ♦ పవతు లనఁగ
నహితులకు నామధేయము ♦ లమరు సాంబ. 9

టీ. గట్టిమనసువాఁడు, గడుసరి, (గడుసు+అరి), ఉక్కరి (ఉక్కు+అరి), దిటవరి (దిటవు+అరి), పైమూఁడుపదములకు "బలిమిగలవాఁడు" అని యర్థము, దిట్ట - ౫ ధీరుఁడు. కుచ్చితుఁడు (ప్ర. కుత్సితుఁడు), అడిగొట్టు, కూళ, పెంకె, బికారి, ముడికాఁడు, చిలుమువాలు, మోటు, లుచ్చ, చెండిపోతు, గరాసు, మొండికట్టె, తులువ, కైలాటకాఁడు (కైలాటము+కాఁడు) = మాయోపాయము గలవాఁడు, టక్కరి = టక్కులు గలవాఁడు, పిసాళి, టకటొంకు, టాటోటు-రూ. తాటోటు, కవళి-రూ. కవలి, దబ్బలి, దూబ, గడుసు, కల్లరి = బొంకులాడువాఁడు, దోసకారి=పాపకార్యము లొనర్చువాఁడు, చెనఁటి, పాలసుఁడు, లండి, పిక్కరి = పిక్కబలముగలవాఁడు, పలువ, చెడుగు, జేరజము - ౩౩ ధూర్తుఁడు. పగఱు, మార్తురు, పగతురు, పవతురు - ౪ శత్రువులు.

సీ. పెఱవారు కడవారు ♦ వింతవా రెడవారు
లాఁతివా రన నన్యు♦లకుఁ జెలంగుఁ
జుట్టలు చుట్టాలు ♦ చుట్టముల్ విందులు
బందుగు లనఁ జెల్లు ♦ బంధువులకుఁ
గూర్చువాఁ డెడకాఁడు ♦ కుంటెనకాఁ డనఁ
దాపికాఁ డనఁ బేరు ♦ దనరుచుండు
విటదూత బయకాఁడు ♦ వీణెకాఁ డనఁ బొల్చు
వైణికునకు గాణ ♦ పాటకుఁ డన
తే. గాయకున కగుఁ దిక్క వెం♦గలి వెడంగు
వెకలి వీఱిఁడి వెంబర♦విత్తు వెఱ్ఱి
వేఁదు అనఁగ నపస్మారి ♦ వెలయుఁ జెవిటి
విననివాఁ డన బధిరాఖ్య ♦ లొనరు సాంబ. 10

**టీ.** పెఱవారు, కడవారు, వింతవారు, ఎడవారు, లాతివారు - ౫ పొరుగువారు. చుట్టలు (చుట్టములు +లు-మువర్ణలోపము.), చుట్టాలు (చుట్టము+లు-మువర్ణలోపము, తత్పూర్వహ్రస్వమునకు దీర్ఘము.), చుట్టములు, విందులు, బందుగులు (ప్ర. బంధువు.) - ౫ బంధువులు. కూర్చువాఁడు = వీటిని దెచ్చి యిచ్చువాఁడు, ఎడకాఁడు, కుంటెనకాఁడు, తాపికాఁడు - ౪. విటునిదూత. బయకాఁడు, వీణెకాఁడు - ౨ వీణెవాయించువాఁడు. గాణ, పాటకుఁడు - ౨ గానము చేయువాఁడు. తిక్క, వెంగలి, వెడంగు, వెకలి, వీఱిఁడి, వెంబరవిత్తు, వెఱ్ఱి, వేఁదుఱు - ౮ మఱుపుగలవాఁడు (అపస్మారి). చెవిటి, విననివాఁడు-౨ చెవులు వినఁబడనివాఁడు.

సీ. ఎకిమీఁడు పాదుసా • యేలిక మన్నీఁడు
సాహేబు రాయఁడు • సామి పబువు
జియ్య తుపాసి వ•జీరుండు రాయలు
దునెదారి ఠాకూఁడు • దొర యొడయఁడు
నేఁడన వర్తిలు • నృపుపేళ్లు పడవాలు
దళవాయి దళ్వాయి • దణి యనంగఁ
దగు దళకర్తకుఁ • దగువాఁడు వెరవరి
తీర్పరి కార్బారి • దిట్ట యనఁగఁ
తే. గార్యకర్తకుఁ జెలఁగు బ్రె•గ్గడ నియోగి
ప్రెగడ మంతిరి నా మంత్రి•పేర్లు వెలయుఁ
బంగునకు లేవఁ జాలని•వాఁడు పుట్టు
మొండి పిచ్చుకుం టనుపేళ్లు • పొసఁగు సాంబ. 11

**టీ.** ఎకిమీఁడు, పాదుసా (ఇది హిందూస్థానిపదము)-రూ. పాదుసాహి, ఏలిక, మన్నీఁడు-పా. మన్నియ. రూ. మన్నియఁడు, మన్నెఁడు, మన్నె, సాహేబు (ఇది హిందూస్థానిపదము), రాయఁడు, సామి (ప్ర.

స్వామి), పబువు (ప్ర. ప్రభువు), జియ్యా, తుపాసి, వజీరుఁడు (ఇది హిందుస్థానిపదము.), రాయలు, దుసెదారి-రూ. దుసేదారి, రా, ఱేఁడు, దొర, ఒడయుఁడు, నేఁడు-౨౭ రాజు. పడవాలు, దళవాయి, దళ్వాయి, దణి-౮ సేనానాయకుఁడు. తగువాఁడు, వెరవరి (వెరవు+అరి)=ఉపాయము గలవాఁడు, తీర్పరి (తీర్పు+అరి) = దిద్దుపాటుగలవాఁడు, కార్భారి, దిట్ట - ౫ కార్యములను జక్కఁగాఁ జేయువాఁడు. ప్రెగ్గడ, నిజోగి(ప్ర. నియోగి) = ఉత్తరువుచేయువాఁడు, ప్రెగడ, మంతిరి-౮ మంత్రి. లేవఁజాలనివాఁడు, పుట్టుమొండి, పిచ్చుకుంటు-రూ. పిచ్చుకకుంటు - ౩ పంగువు - ఈఁచఁ బోయినకాళ్లవాఁడు.

సీ. ఎడకాఁడు కొల్లగాఁ • డెడత్రోవకాపరి
గడిదొంగ దోఁపుడు•కాఁడు నాఁచు
గజముచ్చు చేవాఁడి•కాఁడు జాజరకాఁడు
మచ్చరి మునిముచ్చు • మాయదారి
తెరువాటుకాఁడు కి• త్తెరదొంగ దొరకోలు
సన్నాసి వడికాఁడు • కన్నగాఁడు
రేద్రిమ్మరీఁడు ము•ల్లియవిప్పు లోవాఁడి
కాఁడు తెక్కలికాఁడు • కల్లరీఁడు
తే. తవలి మోసరి యనఁ జెల్లు • దస్కరునకుఁ
దొత్తు సాఁకుడు బోనము•కత్తె దాది
విలువరమ్మఁడు వరవు డిల్•బిడ్డ యనఁగ
దాసికానామధేయముల్ • దనరు సాంబ. 12

టీ. ఎడకాఁడు, కొల్లగాఁడు=కొల్లచేయువాఁడు, ఎడత్రోవకాపరి = విర్జనమార్గమునందుఁ గాచియుండువాఁడు, గడిదొంగ = ఒళవెతింగినదొంగ, దోఁపుడుకాఁడు - రూ. దోఁపిడికాఁడు = పరులసొమ్ము దోఁచువాఁడు, నాఁచు, గజముచ్చు=పెద్దదొంగ, చేవాఁడికాఁడు = చేతిపదును గలవాఁడు,

జారకాఁడు - రూ. జజ్జరకాఁడు = వంచనసేయువాఁడు, మచ్చరి (ప్ర. మత్సరి), కంటుగలవాడు, మునిముచ్చు=పశ్యతోహరుఁడు - చూచుచుండఁగ నేమార్చి కొట్టుకొనిపోవువాఁడు, మాయదారి = మోసముగలవాఁడు, తెరువాటుకాఁడు = దారినడ్డగించువాఁడు, కత్తెరదొంగ = కత్తెరతోఁ బనిచేయుదొంగ, దొరకొలుసన్యాసి = నమ్మించి మోసపుచ్చి దొంగలించుదొంగ, వడికాఁడు=చేతిచుఱుకుఁదనముగలవాఁడు, కన్నగాఁడు = కన్నము వేయువాఁడు, రేద్రిమ్మరీఁడు = రాత్రులందు సంచరించువాఁడు, ముల్లియవిప్పు = ధనములముడులను విప్పువాఁడు, లోవాఁడు = మనసునఁ గఠినత్వముగలవాఁడు, తెక్కలికాఁడు = దొంగతనము గలవాఁడు, కల్లరీఁడు (కల్ల+అరి+ఈఁడు స్వార్థమున నీ ప్రత్యయము.)=బొంకులాఁడువాఁడు, తపళి, మోసరి (మోసము+అరి) = మోసముగలవాఁడు-౨ల దొంగ. తొత్తు, సాఁకుడు, బోనముకత్తె (వంటచేయునది), దాది (ప్ర. ధాత్రి.), విలువరమ్ముఁడు = కూలికిఁబనిచేయునది, పరవ్రుడు, ఇల్బిడ్డ-౮ దాసి-పనికత్తె.

సీ. పడపుఁజాన గడించు • పడఁతి మేల్దాపరి
బోగపుఁజేడియ • పొత్తుటాలు
వేడుకచెలి లంజె • వెలయాలు రోచెల్వ
వెల్లాటకత్తె నా • వేశ్య వెలయు
గూర్చియిచ్చుమిటారి • కుంటెనకత్తియ
తాపికత్తె యనంగఁ • దనరు దూతి
నాగవాసం బన • నామ మా వేశ్యల
మేళంబునకుఁ గోమ•రాలు కొమిరె
తే. చామ జవరాలు కొమరిత • జవ్వని యన
సుందరికిఁ జెల్లు గట్టివై•సుదియుఁ బ్రోడ
యనఁగఁ దగుఁ బ్రౌఢ వయసుచె•ల్లినది ముసలి
మిండకో రన లోలాఖ్య • మెఱయు సాంబ. 13

టీ. పడపుఁజాన (పడపు+చాన)=ధనసంపాదనచేయునట్టిస్త్రీ, గడిం చుపడఁతి =ధనమునుగూర్చుకాంత, మేల్దాపరి=వలపుఁజూపనిది - లాభముఁ దాఁచునది, బోగపుఁజేడియ (బోగము+చేడియ) = సుఖానుభవమునకైనట్టి మగువ, పొత్తుటాలు (పొత్తు+ఆలు)=అనురాగముఁజూపు పెండ్లము, వేడుక చెలి = సంతోషముగలిగించుసుందరి, లంజె, వెలయాలు (వెల+ఆలు) = విలువకువచ్చెడి పెండ్లాము, రోచెల్వ = డబ్బునకువచ్చుభార్య, వెల్లాటకత్తె- రూ. పెల్లాటకత్తె = మిగులనాట్యము చేయునట్టిది - ౧౧ వేశ్య. కూర్చియి చ్చుమిటారి=విటునిజేర్చునది, కుంటెనకత్తియ, తాపికత్తె-3 దూతిక. నాగ వాసము-౧వేశ్యలసమూహము. కొమరాలు, కొమిరె = పిన్నవయసుది, చా మ, జవరాలు=యౌవనముగలది, కొమరిత-రూ. కొమారిత, కొమార్త, జవ్వని (జవ్వనము+ఇ) = యౌవనముగలది- ౮. ప్రాయముగలపడుచు. గట్టివెసుది, ప్రోడ (ప్ర. ప్రౌఢ)-౨ ప్రౌఢాంగన-3౦ యేండ్లకు హెచ్చుతక్కువవయసు గలది. వయసుచెల్లినది, ముసలి, మిండకోర-రూ. మిండలకోర-3 ను ౫౦ ఏండ్లకుఁ బయిపడినను విటులను గోరునట్టిస్త్రీ-లోలస్త్రీ.

సీ. కన్నియ కన్నె నా ♦ కన్యక శకుఁ బేరు
లాసగలది అంకు♦లాడి చెడిపె
వెలిచోరవరి యన ♦ వెలయు జారిణిపేళ్లు
మెయి మేయి యొడలు నె♦మ్మేను మేను
బొంది మే మై యనఁ ♦ బొసఁగు దేహమునకు
నెఱకలు వెండ్రుకల్ ♦ నెఱు లనంగఁ
గేశసమాఖ్య లౌఁ ♦ గేశబంధము పేళ్లు
కీల్జడి క్రొమ్ముడి ♦ కీలుగంటు
తే. నూనెముడి వెన్నుగంటన ♦ నొనరు శిఖకు
జుట్టు సిక సిగ యనఁ జెల్లుఁ ♦ జుంచు కురులు

ముంగురులు కూఁకటు లనంగఁ • బొసఁగుచుండు
గుంతలములకు జితదైత్య•కూట సాంబ. 14

టీ. కన్నియ, కన్నె - ౨ కన్యక. ఆసగలది=ఇతరులపై యాశగలది; అంకులాడి, చెడిపె, వెలిచూరవరి=బయటిరుచిగన్నది-౪ జారిణిస్త్రీ. మెయి, మేయి, ఒడలు, సెమ్మేను, బొంది, మే, మై-౭ శరీరము. నెఱికలు, వెండ్రుకలు, నెఱులు- 3 కేశములు. కీల్ముడి, క్రొమ్ముడి (క్రొత్త+ముడి), కీలుగంటు, నూనెముడి, వెన్నుగంటు-౫ కేశబంధము - జాఱుగ ముడిచిన వెండ్రుకల దూసుముడి. జుట్టు, సిగ, సిక- 3 శిఖ-జుట్టుముడి. చుంచుకురులు, ముంగురులు (మున్ను+కురులు)=ముందటి వెండ్రుకలు, కూఁకటులు - 3 చూర్ణకుంతలములు - పొడివెండ్రుకలు.

సీ. కొప్పు వేనలి మూల • క్రొవ్వెద తుఱు మనఁ
గబరి యాఖ్యఁ గను • క న్ననంగ
నేత్రాఖ్య లగు నొసల్ • నెన్నొసల్ నుదురు నె
న్నుదు రన నిటలాఖ్య • లొదవుఁ జూడ్కి
పొరువ దిష్టి చూ • పన వీక్షణము లొప్పు
వీనులు చెవులును • జానుగులును
నా నొప్పు శ్రోత్రముల్ • కౌను లేఁగౌను నె
న్నడుము నడు మనంగ • నడరు మధ్య
తే. మునకుఁ బొక్కిలి బొడ్డనఁ • దనరు నాభి
మూతి మోర మొకము మోము • మొగ మనంగ
వదనము దనర్చు వా నోరు • వాయి యనఁగ
ముఖగుహాభిఖ్య లగు గుహ•మూర్తి సాంబ. 15

టీ. కొప్పు, వేనలి, మూల, క్రొవ్వెద (క్రొత్త+వెద), తుఱుము-౫ స్త్రీలకొప్పు. కన్, కను, కన్ను- 3 నేత్రము. నొసలు, నెన్నొసలు, నుదురు,

నెన్నుదురు-౪ ఫాలము. చూడ్కి. రూ. చూడికి, పారువ (ద్రావిడము.), దిష్టి (తెలుఁగున షకారము లేదు గనుక ఈరూప మసాధువు.), చూపు-౫ వీక్షించుట - దర్శించుట. వీనులు, చెవులు. జానుగులు - ౩ శ్రోత్రములు. కౌను, లేఁగౌను (లేత+కౌను), నెన్నడుము (నెఱ+నడుము), నడుము-౪ మధ్యము. పొక్కిలి, బొడ్డు-౨ నాభి. మూతి, మోర, మొకము, మోము, మొగము (ఈ ౩ ను ముఖశబ్దభవములు)-౫ వదనము. వా, నోరు, వాయి-౩ వదనగుహ (నోరు).

సీ. పలు పల్లు పండులు ♦ పండ్లన రదము లౌఁ
జెంప దవుడ చెక్కు ♦ చెక్కి లనఁగఁ
దగుఁ గపోలము నెత్తి ♦ తల యన శిర మొప్పు
ముకు ముక్కనంగ నా♦సిక చెలంగు
బొమ కనుబొమ యన ♦ భ్రూనామ మమరు మీ
సలు మీసము లనంగ ♦ శ్మశ్రు వలరు
నదరము కెమ్మోవి ♦ పెదవి వాతెఱ మోవి
యన నోష్ఠ మగు నెద ♦ యక్కు ఱొమ్ము
తే. నెడఁద యన వక్ష మగుఁ బొట్ట ♦ కడుపు బొజ్జ
బొఱ్ఱ డొక్కన నుదరంబు ♦ పొసఁగుచుండుఁ
గేలు కై కయి చేయి కెం♦గే లనంగఁ
బంచశాఖకు నామముల్ ♦ పరఁగు సాంబ. 16

టీ. పలు, పల్లు, పండులు, పండ్లు - ౪ దంతములు. చెంప. రూ. చెంక, దవుడ. రూ. దౌడ, చెక్కు, చెక్కిలి-౪ కపోలము. నెత్తి, తల-౨ శిరస్సు. ముకు, ముక్కు - ౨ ఘ్రాణము. బొమ, కనుబొమ-౨ భ్రూరేఖ. మీసలు (మీసము+లు - మువర్ణలోపము.), మీసములు. రూ. మీసాలు-౩ శ్మశ్రువులు. అదరము (ప్ర. అధరము.), కెమ్మోవి (కెంపు+మోవి), పెదవి,

వాతెఱ= (వాయి + తెఱ) నోటిరంధ్రమును మూయునది, మోవి - ౫ ఓష్ఠము. ఎద, అక్కు, ఱొమ్ము, ఎడఁద - ౪ హృదయము. పొట్ట, కడుపు, బొఱ్ఱ, బొజ్జ, డొక్క - ౫ ఉదరము. కేలు (నిత్యైకవచనాంతము.) కై, కయి, చేయి. రూ. చెయ్యి, చెయి, చే, కెంగేలు(కెంపు+కేలు)-౮ కరము.

సీ. అఱచెయ్యి లోఁచెయి ♦ యనఁ గరతల మొప్పుఁ
బెడచెయ్యి మీఁజెయి ♦ వెనుకచెయ్యి
యనఁ దగుఁ జరమశా♦యంబు వేల్ వ్రే లన
నంగుళి యగుఁ జర♦మాంగమునకు
వెన్ను వెనుకమేను ♦ వీఁపన వర్తిల్లు
గద్దువ గడ్డము ♦ గౌద యనఁగఁ
జిలుకనామంబు రా♦జిల్లుఁ గడవసంబు
చట్ట తోలనఁ గళా♦సంబు నాఁగఁ
తే. జర్మ మమరు మోఁకాళ్లన ♦ జానువు లగుఁ
బిక్క చిఱుదొడ యన జంఘ ♦ పేళ్లు దనరుఁ
గుఱువు తొడ యన నూరువు ♦ వఱలు ముడ్డి
పిఱుఁదు తుం టన జఘనంబు ♦ పేళ్లు సాంబ. 17

టీ. అఱచెయ్యి, లోఁచెయి- ౨ చేతిలోభాగము. వెడచెయ్యి, మీఁజెయి (మీఁదు+చెయి), వెనుకచెయ్యి=చేతివెనుకటిభాగము - ౩ చేతివెనుకటిభాగము. వేలు, వ్రేలు - ౨ అంగుళి. వెన్ను, వెనుకమేను, వీఁపు - ౩ పృష్ఠము. గద్దువ, గడ్డము, గౌద. రూ. గవుద-౩ గడ్డము. కడవసంబు, చట్ట, తోలు, కళాసము - ౪ చర్మము. మోఁకాళ్లు - ౧ జానువు. పిక్క, చిఱుదొడ=చిన్నతొడ-౨ పిక్క. కుఱువు, తొడ-౨ఊరువు. ముడ్డి. రూ. మూఁడి, పిఱుఁదు, తుంటి=౩ కటిభాగము.

సీ. పునుక పుఱియ పుచ్చె • యనఁ గపాలంబొప్పు
బుజము మూఁ పనఁ జెల్లు • భుజము పేళ్లు
బట్ట వలువ కోక • పుట్టంబు గింటెంబు
చీర నా వసనంబు • చెలఁగు నఱుత
గొంతు కుత్తుక యఱ్ఱు • కొలిమి మెడ యనంగ
గళమున కగుఁ బిడి•కిలన ముష్టి
కగుఁ బ్రసృతికిఁ జేర • యన నంజలికి దోయి
లన హస్తమునకు మూ • రనఁగఁ బొసఁగు
తే. బార యనఁగను వ్యామాఖ్య • పరఁగు జేన
దుత్త యనఁ దాలమున కొప్పు • బెత్త యనఁగ
నంగుళాభిఖ్య యగు నంజ • హజ్జ యడుగు
నాఁగఁ బాదాఖ్య లగు లోక•నాథ సాంబ. 18

టీ. పునుక. రూ. పున్క, పుఱియ. రూ. పుఱ్ఱె, పుచ్చె-౩ కపాలము. బుజము, మూఁపు-౨ బాహువు. బట్ట, వలువ, కోక, పుట్టము, గింటెము, చీరె-౬ వస్త్రము. అఱుత, గొంతు, కుత్తుక, అఱ్ఱు, కొలిమి, మెడ-౬ కంఠము. పిడికిలి-౧ ముష్టి. చేర-౧ ప్రసృతి(చాఁచిన వ్రేళ్లుగలయఱచెయి). దోయిలి. రూ. దోసిలి - ౨ అంజలి. మూర-౧ హస్తము (మోచెయ్యి మొదలు వ్రేళ్లకొనవఱకుండు భాగము). బార-౧ వ్యామము(రెండు చేతులు చాఁచి నడుమనుండు సందు). జేన, దుత్త- ౨ తాలము(చాచిన బొటన వ్రేలికొనకు చిటికెన వ్రేలికిని నడుమనుండు సందు). బెత్త-౧ అంగుళము. అంజ, హజ్జ. రూ. అజ్జ, అడుగు-౩ పాదము.

సీ. చనులు గుబ్బలు చండ్లు • చాచులు పాలిండ్లు
చన్ను లనంగఁ గు•చంబు లమరు

నారు నూఁగా రన • నలరు రోమావళి
పాపలఁ గనుతావు • పత్త బుయ్యి
మరునిల్లు దు బ్బన • మదనమందిర మొప్పు
బిల్లలఁ గలిగించు•వేరు చుల్లి
బుల్ల బెల్ల మనంగఁ • బొసఁగు శేఫము గాఁడు
గుద్ద పిఱ్ఱి యనంగ • గుదము దనరుఁ
తే. పైఁట పయ్యెఁట పయ్యెద • పయఁట చెఱఁగు
నాఁగఁ జేలాంచలాభిధా•నంబు చెలఁగుఁ
గలువడము చందువా మేలు•క ట్టనంగ
నతిశయిల్లు వితానాహ్వ•యములు సాంబ. 19

టీ. చనులు, గుబ్బలు, చండ్లు, చాచులు, పాలిండ్లు, చన్నులు-౬ స్తనములు. ఆరు, నూఁగారు - ౨ నాభిక్రిందిరోమరేఖ. పాపలఁగనుతావు=బిడ్డలను గనునట్టితావు, పత్త, బుయ్యి, మరునిల్లు, దుబ్బ - ౫ మన్మథాగారము (స్త్రీలింగము). పిల్లలఁ గలిగించువేరు = బిడ్డలఁబుట్టించుటకు మూలమైనది, చుల్లి. రూ. చుల్ల, బుల్ల, బెల్లము - ౫ పుంలింగము. గాఁడు, గుద్ద, పిఱ్ఱి - ౩ అపానస్థానము. పైఁట, పయ్యెఁట, పయ్యెద. రూ. పయ్యాద, పయఁట, చెఱఁగు - ౬ చీరకొంగు. కలువడము, చందువా, మేలుకట్టు - ౩ వితానము (వివాహాదులందుఁ బందిటికిఁ జేయుఁ వస్త్రాలంకారము).

సీ. చెలి ముద్దుగుమ్మ యు•గ్మలి నవలా చాన
కన్నె బిత్తరి గోతి • కలికి మగువ
జవరాలు చేడియ • జవ్వని తొయ్యలి
నాతి పైదలి యెల•నాగ లేమ
సకియ జక్కవచంటి • చామ చిల్కలకొల్కి
గుబ్బెత ప్రోయాలు • కొమ్మ పడఁతి

పొలఁతి ముద్దియ ననబోఁడి యింతి మిటారి
నెలఁతుక వాల్గంటి నెలఁత తెఱవ
తే. యన్ను లతకూన యొయ్యారి యతివ వెలఁది
చెలియ సకి బోటి కొమరిత చిగురుబోఁడి
ముగుద వగలాఁడి సింగారి ముదిత యువిద
గరిత యన భామినీసమాఖ్య లగు సాంబ. 20

టీ. చెలి, ముద్దుగుమ్మ = ముద్దులు గులుకునది, ఉగ్మలి, సవలా, చాన, కన్నె, బిత్తరి, గోతి, కలికి, మగువ, జవరాలు, చేడియ, జవ్వని, తొయ్యలి, నాతి, పైదలి, ఎలనాగ, లేమ, సకియ, జక్కవచంటి = చక్రవాకపక్షులమాడ్కి నొండొంటిఁ గదిసియుండు స్తనములుగలది, చామ, చిలుకలకొలికి = చిలుకలకొలుకులవంటి కంటికొనలుగలది, గుబ్బెత = గుబ్బచన్నులు గలది, ప్రోయాలు, కొమ్మ, పడఁతి, పొలఁతి, ముద్దియ, ననబోఁడి = పుష్పమువంటి మేనుగలది, ఇంతి, మిటారి = మిటారముగలది, నెలఁతుక, వాల్గంటి = నిడుపుకన్నులు గలది, నెలఁత, తెఱవ, అన్నులతకూన = లేఁతతీఁగను బోలినది, ఒయ్యారి = ఒయ్యారముగలది, అతివ, వెలఁది. రూ. వెలఁదుక, చెలియ, సకి (ప్ర. సఖి), బోటి, కొమరిత, చిగురుబోఁడి = ఇగురువంటిమేనుగలది, ముగుద, వగలాఁడి = వగలుగలది, సింగారి = సొగసుగలది, ముదిత, ఉవిద, గరిత - ౫౮ స్త్రీ.

సీ. ఆనవాలును పులు గంగమచ్చము గుఱు
తడియాల మన లాంఛనాఖ్య లాదవు
జడితి గొబ్బున వేగ సరగు గ్రక్కున వడి
వేగిర మనఁ దగు వేగమునకు
మరియాద గడి మేర సరు దెల్ల కర యనఁ
బఱఁగు మర్యాదకు వెఱఁగు వింత

యక్కజ మబ్బుర • మరిది నివ్వెఱ యబ్ర
మచ్చెరు వన నద్భు•తాఖ్య లమరుఁ
తే. బరఁగు కదలిక పరువన • మెఱయు ధావ
నమ్మునకు వేడెమొనరించెఁ • గ్రమ్మెఁ బొదివెఁ
జుట్టుకొనె నావరించె నా • నిట్టినుడులు
వేష్టనంబున కమరు స•ర్వేశ సాంబ. 21

టీ. ఆనవాలు, పులుగు, అంగమచ్చము, గుఱుతు, అడియాలము-౫ చిహ్నము. జడిలి (ప్ర. ఝడిలి), గొబ్బునన్, వేగ, సరగు, గ్రక్కునన్, వడి, వేగిరము - ౭ శీఘ్రము. మరియాద, గడి, మేర, సరుదు, ఎల్ల, కర-౬ హద్దు. వెఱఁగు, వింత, అక్కజము, అబ్బురము, అరిది, నివ్వెఱ (నిండు+వెఱ), అబ్రము, అచ్చెరువు (ప్ర. ఆశ్చర్యము.) - ౮ ఆశ్చర్యము. పరుగు, కదలిక, పరువు-౩ పరుగెత్తుట. వేడెమొనరించె, క్రమ్మె, బొదివె, చుట్టుకొనె, ఆవరించె - ౫ చుట్టును గూర్చుండియుండె.

సీ. బువ్వ మెతుకు కూడు • బోన మోరెము పసా
దము వంటకము పస•దనము బాతు
సాద మోగిర మన • జరుగు నన్నము పేళ్లు
కుడిచె బోసెసె పా•పడియె నమలె
నారోగిణ మొనర్చె • నారగించె మెసవెఁ
దినె మెక్కె నన భు•క్తిఁగొనుట కలరుఁ
బనులు చెయ్వులు సేఁత • లనఁ గర్మముల కొప్పుఁ
గనలు మోడి యలుక • కినుక కిన్క
తే. నాఁగఁ గోపాఖ్య లగు లజ్జ • నాన సిగ్గు
బొసుకు పుయిలోట సిబ్బితి • పుచ్చటి కన

బరఁగు వ్రీడాఖ్య యోల నే॰పంబు సాశ
నంగ వ్యాజం బమరు జగ॰న్నాథ సాంబ. 22

టీ. బువ్వ, మెతుకు, కూడు, బోనము, ఓరెము, పసాదము (ప్ర. ప్రసాదము), వంటకము, పసదనము, బాతు (అన్యదేశ్యము), సాదము (ఇది ద్రావిడపదము.), ఓగిరము - ౧౧ అన్నము. కుడిచె, బోనేసె, సాపడియె, నమలె, ఆరోగిణమొనర్చె. రూ. ఆరోగణమొనర్చె, ఆరగించె, మెసవె, తినె, మెక్కె - ౧౦ భోజనముచేసెను. పనులు, చెయ్వులు, చేఁతలు - 3 కార్యములు. కనలు, మోడి, అలుక, కినుక, కిన్క - ౫ కోపము. లజ్జ, నాన, సిగ్గు, బోసుకు, పుయిలోట, సిబ్బితి, పుచ్చటిక. రూ. పుచ్చడీక - ౮ సిగ్గు. ఓల, నెపము (ప్ర. నిభము.), సాకు - 3 మిష.

సీ. పానుపు తలిమంబు ♦ పఱుపు లే పన మెత్త
సెజ్జ యనఁగ శయ్య ♦ చెలఁగుచుండుఁ
బన్నుండెఁ దెన్నుండెఁ ♦ బండుకొనెఁ బరుండె
బవ్వళించెను బండెఁ ♦ బడకసేసె
నత్తమిల్లె ననంగ ♦ నలరారు శయనించె
ననుటకు నిద్దుర॰గొనియె గుఱక
గొనియె నిద్దురవోయెఁ ♦ గిఱ్ఱికొడె నన నిద్రి
తున కొప్పు లేచె మే॰ల్కొనియె మేలుకు
తే. వయ్యె నన జాగ్రదభిధాన ♦ మమరు వేడ్క
యొలమి వేడుక సంతోస ♦ మింపు ముదము
సంతసము సొంపు మే లరు॰సం బనంగఁ
బ్రమదమున కాఖ్య లగు జగ॰త్పాల సాంబ. 23

టీ. పానుపు. రూ: పాన్పు, తలిమము; పఱుపు, లేపు, మెత్త, సెజ్జ (ప్ర. శయ్య.)-౭ శయ్య. పన్నుండెను, తెన్నుండెను, పండుకొనెను, పరుం

డెను, పవ్వళించెను, పండెను, పడకవేసెను, అత్తమిల్లెను - ౮ శయనించె. నిద్దురగానియె, కుఱుకగానియె, నిద్దురవోయె, కూర్కొడెను - ౪ నిద్రించెను. లేచె, మేల్కొనియె, మెలఁకువయ్యె - ౩ నిద్రలేచెను. వేడ్క, ఎలమి, వేడుక, సంతోసము, ఇంపు, ముదము, సంతసము, సొంపు, మేలు, అరుసంబు- ౧౦ సంతోషము.

సీ. పలికె వాక్రుచ్చె న•ప్పనసేసె మందలిం
చెను విన్నవించెఁ జె•ప్పె ననె నొడివె
నాడెఁ బల్కె వచించె • నన భాషణము సేసె
ననుట కౌ వీనిచ్చె • నాలకించె
వినెఁ జెవియొగ్గెను • వినియె నాలించె నా
శ్రుతమయ్యె ననుట కౌఁ • జులుక చౌక
యులక యెల్లిద మన • నొనరు లఘుతపేళ్లు
పులకలొత్తెను గగు•ర్పొడిచె గగురు
తే. పాటె గరుపాటె మైమోజు•పర్వె ననఁగఁ
దగును రోమాంచనామముల్ • నగవు నవ్వు
నగు న వన హాసమున కొ•ప్పు • నడిమిదిన్నె
దీవి యన ద్వీప మగుఁ బర•దేవ సాంబ. 24

టీ. పలికెను, వాక్రుచ్చెను, అప్పనసేసె(ప్ర). అర్పణసేసెను), మందలించెను, విన్నవించెను, చెప్పెను, అనెను, నొడివెను, ఆడెను, పల్కెను, వచించెను- ౧౧ మాట్లాడెను. వీనిచ్చె, ఆలకించె, వినె, చెవియొగ్గె, వినియె, ఆలించె - ౬ వినెను. చులుక. రూ. చుల్క, చౌక. రూ. చవుక, ఉలక, ఎల్లిదము - ౬ లఘుత్వము. పులకలొత్తెను, గగుర్పొడిచె. రూ. గగురుపొడిచె, గగ్గురుపొడిచె, గగురుపాటె, గరుపాటె, మైమోజుపర్వె-౭ రోమాం

చము గలిగెను. నగవు, నవ్వు, నగు, నవు - ౪ హాసము. నడిమిదిన్నె, దీవి-
౨ ద్వీపము.

సీ. జోత జాగిల కొల్పు ♦ జోహారు గిడిగిడి
మోడుపు చేకూర్పు ♦ మ్రొక్కు మొగుపు
చిన్నిపూ చేమోడ్పు ♦ జేజె వెన్నెల చెంగ
నాలు గొబ్బులు టెంక♦ణాలు నేరె
డల్లుల్ సలా మన ♦ నమరు దండముపేళ్లు
పళ్లెము కంచము ♦ పళ్లెరంబు
తెలె హరివాణంబు ♦ తలియ తట్టి యనంగ
భాజనం బగు గిన్నె ♦ బటుది కోర
తే. డబ్బర యనంగఁ జషక మౌ ♦ డప్పి దూప
దప్పి దగ నీరువట్టన ♦ దాహ మమరుఁ
జాగ మీవి పుడుకు పెట్టు ♦ తేగ మీగి
యనఁగఁ ద్యాగసమాభిఖ్య ♦ లగును సాంబ. 25

టీ. జోత. రూ. జోతము, జాగిలి, కొల్పు, జోహారు. రూ. జోహారువు - జొహారు - జొహారువు, గిడిగిడి, మోడుపు. రూ. మోడ్పు, చేకూర్పు, మ్రొక్కు, మొగుపు, చిన్నిపూ, చేమోడ్పు, జేజె, వెన్నెల, చెంగనాలు, గొబ్బులు, టెంకణాలు, నేరెడల్లులు, సలాము (ఇది యన్యదేశ్యము.)-౨౩ నమస్కారము. పళ్ళెము. రూ. పళ్యము, కంచము, పళ్ళెరము, తెలె. రూ. తెలియ, హరివాణము, తలియ, తట్టి-౯ పాత్రము. గిన్నె, బటుది, కోర, డబ్బర. రూ. దబ్బర-౫ త్రాగుగిన్నె. డప్పి, దూప, దప్పి, నీరువట్టు-౪ దాహము. చాగము, ఈవి, పుడుకు, పెట్టు, తేగము, ఈగి. రూ. ఈవి-౬ త్యాగము.

సీ. అగపడెఁ జేపడె ♦ నబ్బె దొరకెఁ జిక్కెఁ
దగిలెఁ దగుల్కొనెఁ ♦ దగులువడియెఁ
బట్టువడియెఁ జిక్కు♦వడెఁ దవిలె ననంగ
నమరు గృహీతాఖ్య ♦ లఱచె నేడ్చె
వాపోయె మొఱలిడె ♦ వాచఱచె ననంగ
రోదనంబున కగు ♦ రొద గలిబిలి
చప్పుడు గొలగొల సద్దు ♦ కూఁత యులివు
నలుకుడు రవళి యం ♦ తనఁగ ధ్వనికి
తే. నలరుఁ గలసెఁ బెరసెఁ గూడె ♦ హత్తె దొరసె
నందెఁ బొందెఁ బెనఁగెఁ జెందె ♦ నంటె ననఁగ
నమరు సక్తాఖ్య లోనయ్యె ♦ నగ్గమయ్యె
లోఁబడె ననంగ స్వవశాఖ్య♦లు చను సాంబ. 26

టీ. అగపడెను (అగ్గము+పడెను.), చేపడెను, అబ్బెను, దొరకెను, చిక్కెను, తగిలెను, తగుల్కొనెన్, తగులువడియెను,పట్టువడియెను, చిక్కుపడెను, తవిలెను - ౧౧ చేతఁజిక్కెను. అఱచెను, ఏడ్చెను, వాపోయెను, మొఱలిడెను, వాచఱచెను-౪ రోదనముచేసెను. రొద, గలిబిలి, చప్పుడు, గొలగొల, సద్దు, కూఁత, ఉలివు, నలుకుడు, రవళి, అంతు - ౧౦ శబ్దము. కలసెను, పెరసెన్, కూడెన్, హత్తెన్, దొరసెన్, అందెన్, పొందెన్, పెనఁగెన్, చెందెన్, అంటెన్ - ౧౦ చేరుకొనెను. లోనయ్యెన్, అగ్గమయ్యె, లోఁబడెను- ౩ స్వాధీనమాయెను.

సీ. ఎడసె వీడెను బాసె ♦ నెడఁబాసెః బురివిచ్చె
వేఱువడె ననంగ ♦ వెలయుచుండుఁ
బ్రత్యేకమయ్యె నన్ ♦ పలుకులు వెడలించె
వెళ్లగొట్టెను దోలె ♦ వెలలఁ బన్నెఁ

దఱిమె రొప్పె ననంగఁ ♦ దనరు నుచ్చాటనం
బొనరించె ననుటకుఁ ♦ గనియెఁ జూచెఁ
గనుఁగొనెఁ దిలకించెఁ ♦ గనెఁ గాంచె ననఁ జెల్లు
దర్శించె ననుటకుఁ ♦ దాల్చెఁ బూనె
తే. నానె మోచె ననఁగఁ జెల్లు ♦ నధివహించె
ననుట కరికట్టె బోనీక ♦ యంకెచేసె
నాఁగె నిల్పెఁ దటాయించె ♦ నడ్డగించె
నానుకొనె ననఁ దగు వార♦ణాఖ్య సాంబ 27

టీ. ఎడసెను, వీడెను, పాసెను, ఎడఁబాసెను, పురివిచ్చెను, వేఱుపడెను-ఉ ప్రత్యేకమాయెను. వెడలించెను, వెళ్ళఁగొట్టెను, తోలెను, వెలలఁబన్నెను, తఱిమెను, రొప్పెను-ఉ తఱుమఁగొట్టెను. కనియెన్, చూచెన్, కనుఁగొనెన్, తిలకించెన్, కనెన్, కాంచెన్ - ఉ వీక్షించెను. తాల్చెను, పూనెను, ఆనెను, మోచెను-ఉ ధరించెను. అరికట్టెను=చుట్టునిలిచెను, పోనీక యంకెచేసెను, ఆఁగెను, నిల్పెను, తటాయించెను, అడ్డగించెను, ఆనుకొనెను-ఉ నివారించెను-నిరోధించెను.

సీ. అంటుగైకొనియె ము♦ట్టయ్యెఁ జెఱఁగుమానెఁ
గడకేఁగె నింటికిఁ ♦ గాకపోయె
ననఁగ దూరస్థకుఁ ♦ దనరుఁ దానముచేసె
నీళ్ళుపోసికొనె ము♦నింగెఁ గ్రుంకె
వన నిమజ్జనమయ్యె ♦ ననుటకుఁ దగు మడి
మడుఁగు మడు వనంగ ♦ నడరు శుచికి
మైల కట్టువిడుపు ♦ మా పన మలినాఖ్య
లగుఁ దల్పు వాకిలి ♦ యనఁ గవాట

తే. మునకొనరు నేకతంబు మం•తన మనంగ
నంతరంగమునకుఁ జెల్లు • నక్కఱ పని
యొంజలియు జోలి యనఁ గార్య • మొనరు గంజి
వార్పన యవాగునామముల్ • వఱలు సాంబ. 28

టీ. ఆంటుగైకొనియె, ముట్టయ్యెన్, చెఱఁగుమాసెన్, కడకేఁగెన్, ఇంటికిఁగాకపోయెన్-౫ బహిష్ఠయాయెను. తానముచేసెను, నీళ్లుపోసికొనెను, మునింగెను, త్రుంకెను-౪ స్నానమొనర్చెను. మడి, మడుఁగు, మడుగు-౩ పరిశుద్ధి (మడుఁగుదోవతి). మైల. రూ. మయిల, కట్టువిడుపు, మాపు-౩ మైల (మైలగుడ్డ). తల్పు. రూ. తలుపు, వాకిలి-౩ కవాటము. ఏకతము, మంతనము-౨ ఏకాంతస్థలము. అక్కఱ, పని, ఒంజలి, జోలి-౪ కార్యము. గంజి, వార్పు-౨ యవాగువు.

సీ. ఒకటి యొక్కఁ డొకండు • నొం డన నేకాఖ్య
జమి డిమ్మ డిబ్బడి • జంట రెండు
దుగ రెట్టి దువ యన • ద్విగుణాఖ్య కవ జోడు
దంట దోయి యనంగ • ద్వంద్వసంఖ్య
మూ రెండొకటి తిగ • మూఁ డనఁ ద్రయసంజ్ఞ
చౌ యుడ్డ తీవంచ • చౌకము నలు
నాలు గనఁగఁ జతు•ర్నామముల్ చౌవంచ
యరపది యేను నై • దనఁగఁ బంచ
తే. కంబు నాఱ త్తిగ యన ష•ట్కంబు చక్క
పగడ సత యే డనంగ స•ప్తకము దచ్చి
యెనిమి దన నష్టకము తొమ్మి • దనఁగ నవము
పదియు నీరై దన దశాఖ్య • పరఁగు సాంబ. 29

టీ. ఒకటి, ఒక్కఁడు, ఒకండు, ఒందు-౪ ఏకసంఖ్య. జమిడి. రూ. జమిలి, ఇమ్మడి. రూ. ఇనుమడి, ఇబ్బడి, జంట, రెండు, దుగ, రెట్టి, దువ-౧౦ ద్విసంఖ్య. కవ, జోడు, దంట, దోయి-౪ జత – మిథునము. మూ, రెండొకటి, తిగ, మూఁడు-౪ త్రితయము-త్రిసంఖ్య. చౌ, ఉద్ద, తీవంచ, చౌకము, నలు, నాలుగు-౬ చతుష్టయము. చౌపంచ, అరపది-పదిలోసగము, ఏను, ఐదు. రూ. అయిదు-౪ పంచసంఖ్య-పంచకము. ఆఱు, ఇత్తిగ (ఇరు+తిగ)-౨ షట్సంఖ్య-షట్కము. చక్కువగడ, సత (ప్ర. సప్త) ఏడు-౩ సప్తసంఖ్య-సప్తకము. దచ్చి, ఎనిమిది-౨ అష్టసంఖ్య-అష్టకము. తొమ్మిది-౧ నవసంఖ్య. పది, ఈరైదు=రెండు అయిదులు-౨ దశసంఖ్య-దశకము.

సీ. పదునొకం డనఁగను ♦ బరఁగు నేకాదశం
బీరాఱు పండ్రెండు ♦ బార యనఁగ
రవిసంఖ్య యగు నానెఁ ♦ ద్రాగెఁ ద్రావెను గ్రోలె
ననఁగఁ బానముచేసె ♦ ననుట కొనరు
బనివినియెను బోయెఁ ♦ జనె నేఁగె నరిగె నాఁ
గృతగమనునకుఁ జె ♦ ల్లెసఁగుఁ గ్రమ్మ
ఱించెఁ ద్రిప్పెను మగి♦డించె మరల్చె నా
నావర్తన మొనర్చె ♦ ననుట కొనరుఁ
తే. బాఱె వెళ్లెను పరువెత్తెఁ ♦ బఱచెఁ గదలె
నుఱికెఁ దొలఁగె నటమరించె ♦ జరిగె ననఁ బ
లాయితుం డయ్యె ననుటకు ♦ నలరు చుండు
సకలసురచక్రవర్తి శ్రీ♦సాంబమూర్తి. 30

టీ. పదునొకండు-౧ ఏకాదశసంఖ్య. ఈరాఱు=రెండు ఆఱులు, పండ్రెండు, బార-౩ ద్వాదశసంఖ్య. ఆనెను, త్రాగెను, త్రావెను, క్రోలెను-౪ పానముచేసెను. పనివినియెను, పోయెను, చనెను, ఏఁగెను, అరిగెను-౫ కృత

గమనుండయ్యె. క్రమ్మఱించెను, త్రిప్పెను, మగిడించెను, మరల్చెను - ౪ నివృత్తిచేసెను. పాఱెను, వెళ్లెను, పరువెత్తెను, పఱచెను, కదలెను, ఉఱికెను, తొలఁగెను, అటమరించెను, జరిగెను-౯ పలాయితుఁడయ్యెను.

సీ. గడుసరి దిట్ట యె♦క్కటి వాఁడిగలవాఁడు
వడికాఁడు పోటరి ♦ బంటు మేటి
మనసరి తెంపరి ♦ మొనకాఁడు మిడిమాసి
వడివాఁ డనంగ శూ♦రుఁడు నెలంగు
నని చివ్వ యేడ్తెఱ ♦ యాలము బవరము
పోట్లాట పెనఁకువ ♦ పోరు కలను
కయ్యము దురము జ♦గడ మన యుద్ధాఖ్య
లమరు మద్దత్తు వె♦న్నాస తోడు
తే. పాటు సావాసము పరాలు ♦ బాసట యన
రాజిలు సహాయమునకు వై♦రమ్ము కంటు
సూడు పగ దేస మనఁగఁ బో♦ల్చును విరోధ
నామములు సర్వలోకైక♦నాథ సాంబ. 31

టీ. గడుసరి, దిట్ట, ఎక్కటి, వాఁడిగలవాఁడు, వడికాఁడు, పోటరి, బంటు, మేటి, మనసరి, తెంపరి, మొనకాఁడు, మిడిమాసి, వడివాఁడు-౧౩ శూరుఁడు. అని, చివ్వ, ఏడ్తెఱ, ఆలము, బవరము, పోట్లాట, పెనఁకువ, పోరు, కలను, కయ్యము (ప్ర. కలహము.), దురము, జగడము-౧౨ యుద్ధము. మద్దత్తు, వెన్నాస, తోడుపాటు, సావాసము, పరాలు, బాసట - ౬ సహాయము. వైరము, కంటు, సూడు, పగ, దేసము-౫ విరోధము.

సీ. నులిచె వెంపరలాడె ♦ నుగ్గాడెఁ దెగటార్చెఁ
జక్కాడెఁ బగదెంచెఁ ♦ జంపెఁ జెండె

సదమదమొనరించెఁ • జదివెఁ బీచమడంచె
నులిమె చాఁగఁబలాడెఁ • బిలుకుమార్చెఁ
బరిమార్చె ముగియించె • నుఱుముసేసె నడంచె
ద్రుంచెఁ బొగరుమార్చెఁ • దునిమె మడిపె
మన్నిగొనియె రూపు•మాపె గీటడఁగించె
మడియించెఁ దూలించె • మలిపె ననఁగఁ
తే. బొసఁగు వధియించె ననుటకుఁ • బ్రోచెఁ బ్రోవె
సాఁకెఁ గాపాడె బ్రతికించె • సంతరించెఁ
బెంచె మనిపె ననఁగను బో•షించుట కగు
సకలసురచక్రవర్తి శ్రీ•సాంబమూర్తి. 32

టీ. నులిచెన్, వెంపరలాడెన్, నుగ్గాడెన్, తెగటార్చెను, చక్కాడెను, పగదెంచెన్, చంపెన్, చెండెన్, సదమదమొనరించెను, చదిపెను, పీఁచమడఁచెన్, నులిమెన్, చాఁగఁబలాడెను, పిలుకుమార్చెను, పరిమార్చెను, ముగియించెను, నుఱుముసేసెను, అడంచెను, త్రుంచెను, పొగరుమార్చెను, తునిమెను, మడిపెను, మన్నిగొనియెను, రూపుమాపెను, గీటడఁచెను, తూలించెను, మలిపెను - ౨౭ సంహరించెను. ప్రోచెను, ప్రోవెను, సాఁకెన్, కాపాడెను, బ్రతికించెన్, సంతరించెన్, పెంచెన్. రూ. పెనిచెన్, మనిపెన్. రూ. మనిచెన్, మంచెన్ - ౧౧ రక్షణమొనర్చెను.

సీ. ఇచ్ఛ తలఁపు మది • యెద మన సనఁ జిత్త
మగుఁ దమకము మేలు • మరులు బాళి
తమి వలపు విరాళి • మమత నా మోహ మ్మా
నాఁడాది యదిసుత • నాఁటనుండి
తలనాఁడు నాఁడుమొ•దలు నాఁటఁబట్టి యా
నాఁడున్కి యదిమొదల్ • నాఁటఁగోలె

యనఁగ దదారభ్య ♦ యనుట కా మంచి మేల్
బాగు లెస్స యన శు♦భంబు లలరు
తే. వనట యంగలారుపు వెత ♦ వంత గోడు
బాద యంగద వగ పనఁ ♦ బరఁగుఁ బీడ
పదవి సిరి కల్మి యనఁగ సం♦పదకు వెలయు
నితము పేరి మిం పన హిత ♦ మెసఁగు సాంబ. 33

టీ. ఇచ్చ, తలఁపు, మది, ఎద, మనసు (ఇది తత్సమముగానున్నది.)-౫ చిత్తము. తమకము, మేలు, మరులు, బాళి, తమి, వలపు, విరాళి, మమత (ఇది తత్సమము.) - ౮ మోహము. నాఁడాది, ఆదిగుత, నాఁటనుండి, తలనాఁడు, నాఁడుమొదలు, నాఁటఁబట్టి, ఆనాఁడునిక్క, అదిమొదలు, నాఁటఁగోలె-౯ ఆదినము మొదలుకొని. మంచి, మేలు, బాగు, లెస్స-౪ శుభము. వనట, అంగలారుపు, వెత, వంత, గోడు, బాద (ప్ర. బాధ.), అంగద, వగపు-౯పీడ-నొప్పి. పదవి (తత్సమము), సిరి, కల్మి. రూ. కలిమి- 3 సంపద. ఇతము, పేరిమి, ఇంపు - 3 హితము.

సీ. జతపీడె నెడసె నాఁ ♦ జను విరహము పేరు
లెనసెఁ బైకొనెఁ బొందె ♦ నేలెఁ గలసె
నన సంగమ మొనర్చె ♦ ననుట కాఁ బొలయల్క
వెడమోడి యనఁ బేళ్లు ♦ వెలయుఁ బ్రణయ
కలహమునకు జడ ♦ గాంజ గంజా బంగి
యనఁగఁ గళంజాహ్వ♦యంబు లలరు
మబ్బు లాహిరి కైపు ♦ మస్తన మత్తత
భాసిల్లుఁ దోడుసు నుం♦పద మనంగ
తే. భోగవనితకుఁ దగుఁ దెంపి ♦ ముసుకు కుంక
మాసక మ్మన విధవనా♦మములు సెలఁగు

బైరవాసంబు దోవతి • పంచె యనఁగ
నిల బహిర్వసనాభిఖ్య • లలరు సాంబ. 34

టీ. జతవీడెన్, ఎడసెన్—౨ వియోగమునొందెను. ఎనసెన్, పైకొనెన్, పొందెన్, ఏలెన్, కలసెన్—౫ సంగమించెను. పొలయలుక, వెడమోడి—౨ ప్రణయకలహము. జడ, గాంజ, గంజా, బంగి—౪ కలంజము. మబ్బు, లాహిరి, కైపు, మస్తు—౪ మత్తు. తోడుసు, ఉంపడము—౨ ఉంచుకొన్నస్త్రీ. తెంపి, ముసుకు, ముంక, మాసకమ్మ—౪ విధవ. బైరవాసము. రూ. బయిరవాసము, దోవతి, పంచె — ౩ పయివస్త్రము.

సీ. విచ్చేసె నేతెంచె • వచ్చెను వేంచేసె
నరుదెంచె జనుదెంచె • ననఁగ నాగ
తుని పేరు లగు మగ•తనము మగంటిమి
గం డనఁ బౌరుషా•ఖ్యలు చెలంగు
గద్దించె నదలించె • గదిమెను నుఱిమె నా
గర్జించె ననుట కౌ • గట్టి యుక్కు
చేగ యూట యుదుటు • చేవ యుఱవు బిగు
వన దృఢత్వము పేరు • లలరు జట్టి
విలువ రో వెల యనఁ గ్రయా•ఖ్యలు దనర్చుఁ
గప్రము సిరంబు గంబూర • కప్పురమన
వెలయుఁ జంద్రంబు వెలిగ్రుక్క • గిలుకుపలుకు
రవపలు కనంగ మణితాఖ్య • లవును సాంబ. 35

టీ. విచ్చేసెను, ఏతెంచెను. రూ. ఏగుదెంచెను, వచ్చెను, వేంచేసెను, అరుదెంచెను. రూ. అరుగుదెంచెను, చనుదెంచెను—౭ ఆగతుఁడయ్యె. మగతనము, మగంటిమి, గండు—౩ పౌరుషము. గద్దించెను, అదలించెను, గదిమెన్, ఉఱిమెను—౪ బెదరించెను. గట్టి, ఉక్కు, చేగ, ఊట, ఉదుటు, చేవ,

ఊఱవు, బిగువు - ౨ దార్ఢ్యము. జట్టి, విలువ, రో, వెల-౪ మూల్యము-క్రయము. కప్రము, సిరము, గంబూర. రూ. గంబూరము, గంబురము, గంబురా, కప్పురము. రూ. కపురము-౮కర్పూరము. వెల్లిగ్రుక్క, గిలుకుపలుకు, శవపలుకు - ౩ రతికూజితము.

సీ. లేమి పేదఱికము ♦ లేమిడి లేవడి
నిష్పచ్చర మిడుమ ♦ నెవ్వ యనఁగ
దారిద్ర్యనామముల్ ♦ తగు దెస యాత్రము
కడగండ్లు గోరము ♦ కష్టి బెడఁద
యడలు చే టన విప♦దాఖ్యలు వర్తిల్లుఁ
ఠెక్కమెగురఁగొట్టె ♦ డింకవేసెఁ
బెద్దనిద్దురవోయె ♦ బిద్దె మడిసెఁ జచ్చెఁ
జనె గంతుకొనెఁ ద్రుంగె ♦ సమసె నేగెఁ
తే. గూలె నీల్గెఁ గెడసెఁ దెగ్గెఁ ♦ గ్రుంకె బ్రుంగె
దెరలెఁ బోయె ముగిసెఁ దేఱెఁ ♦ దొరఁగె ననఁగ
బరఁగు మృతునిసమాఖ్యలు ♦ బవిరి చుట్టు
వేడె మన వలయాభిధల్ ♦ వెలయు సాంబ.

టీ. లేమి, పేదఱికము (పేద+ఱికము-భావార్థకతద్ధితము), లేమిడి, లేవడి, నిష్పచ్చరము, ఇడుము, నెవ్వ - ౭ దారిద్ర్యము. దెస, ఆత్రము. రూ. ఆత్తరము, కడగండ్లు (నిత్యబహువచనాంతము.), గోరము, కష్టి, బెడఁద, అడలు, చేటు - ౬ ఆపత్తు. ఠెక్కమెగురఁగొట్టెన్, డింకవేసెన్, పెద్దనిద్దురవోయెన్, బిద్దెన్, మడిసెన్, చచ్చెన్, చనెన్, గంతుకొనెన్, త్రుంగెన్, సమసెన్, ఏగెన్, కూలెన్, నీల్గెన్, కెడసెన్, తెగ్గెన్, క్రుంకెన్, బ్రుంగెన్, తెరలెన్, పోయెన్, ముగిసెన్, తేఱెన్, తొరఁగెన్-౨౨ మృతిపొందెను. బవిరి, చుట్టు, వేడెము - ౩ వలయము.

సీ. గమి ప్రోఁజు మొత్తము ♦ కదుపు చేరువ బారు
పిండు కూటువ పరి ♦ దండు దిమ్ము
గుంపు తుటుము గుమి ♦ గూటు పదు పనంగ
బృందాఖ్య యగు వెళ్లె ♦ వెడలె వెలలె
వెలువడె ననఁ బేళ్లు ♦ వెలయు నిర్గతుఁ డంట
కెన్నఁడు వాలాయ ♦ మెపుడు నిచ్చ
లెల్లప్పు డెప్పటి ♦ కేప్రొద్దు నెడపకే
నా డెప్పు డుడుగక ♦ నాఁ జెలంగు

తే. సంతతాఖ్య కొలము వంగ♦సమ్ము వంగ
డ మ్మనఁ గులాఖ్య వర్తిల్లుఁ ♦ గ్రమ్మఱ మఱి
మగుడ వెండియుఁ బలుమఱు ♦ మరల సారె
తిరుగ ననఁ బునరాఖ్యలు ♦ పరఁగు సాంబ. 37

టీ. గమి, ప్రోఁజు, మొత్తము, కదుపు, చేరువ, బారు, పిండు, కూటువ, పరి, దండు, దిమ్ము, గుంపు, తుటుము, గుమి, కూటు, పదుపు - ౧౬ సమూహము. వెళ్లెన్, వెడలెను, వెలలెన్, వెలువడెన్ - ౪ ప్రయాణమయ్యెను. ఎన్నఁడు, వాలాయము, ఎపుడు, నిచ్చలు, ఎల్లప్పుడు, ఎప్పటికిన్, ఏప్రొద్దును, ఎడపక, ఏనాఁడు, ఎప్పుడు, ఉడుగక - ౧౧ సతతము—సదా. కొలము, వంగసము, వంగడము - ౩ వంశము. క్రమ్మఱ, మఱి, మగుడన్, వెండియున్, పలుమఱు, మరల, సారె, తిరుగన్ - ౮ మాటిమాటికి.

సీ. పంద కోఁచ పిఱికి ♦ పాఱుఁబోతనఁగను
సమరభీరుని పేరు ♦ లమరుచుండు
విడియము వీడెంబు ♦ వీడ్యము వక్కాకు
తములము బాగాలు ♦ తమ్ములంబు

నాఁ జనుఁ దాంబూల♦నామముల్ గొనియాడె
నగ్గించెఁ బొగడెఁ గొం♦డాడె నెంచెఁ
గైవారమొనరించె ♦ నా వినుతికిఁ జెల్లు
క్రచ్చు కోరిక కోర్కి ♦ యిచ్చ యనఁ[illegible]
తే. నిచ్చ కగు రోసెఁ బరికించె ♦ నెమకెఁ దడవె
వెదకె నారసె నరసెను ♦ వెతకె ననఁగఁ
దనరు నన్వేషణాఖ్యలు ♦ తన్నెఁ దాఁచె
నడుగుతాటించెఁ గాళ్లచే ♦ నడిచె ననఁగ
నమరుఁ బదతాడనాభిధా♦నములు సాంబ. 38

టీ. పంద, కొఁచ, పిఱికి, పాఱుఁబోతు (పాఱు+పోతు)-౪ యుద్ధమునకు వెఱచువాఁడు. విడియము. రూ. విడెము, వీడెము, వీడ్యము, వక్కాకు (వక్కలు+ఆకులు.), తములము, బాగాలు, తమ్ములము-౮ తాంబూలము. కొనియాడెను, అగ్గించెను, పొగడెను, కొండాడెన్, ఎంచెన్, కైవారమొనరించెన్ - ౬ స్తోత్రముచేసెను. క్రచ్చు, కోరిక, కోర్కి, ఇచ్చ-౪ అపేక్ష. రోసెన్, పరికించెన్, నెమకెన్, తడవెన్, వెదకెన్, అరసెను, ఆరసెను, వెతకెన్ - ౮ అన్వేషించెను. తన్నెన్, తాఁచెన్, అడుగుతాటించెన్, కాళ్లచేనడిచెన్ - ౪ కాళ్ళతోఁ దన్నెను.

సీ. కొమరు చొక్కాటమ్ము ♦ గొనబు చొకారము
చొక్కము మేలిమి ♦ జోఁక పొలుపు
నాణెంబు సొరు వి♦న్నాణంబు తిన్నన
పరఁగు చొక్కా చెల్వు ♦ మురువు తనరు
నగు తియ్య పొనరు చె♦న్నలరు నలుపు తీరు
వఱలు జాను చెలంగు ♦ కొఱలు నొనరు

చను తగు నొప్పు నె•సంగు ననెడు పేళ్లు
తగు మంజులమునకు • దండ యొద్ద
తే. చెంత కుఱఁగలి డగ్గఱ • చేర్వ పొంత
దాపు సరస కెలను పజ్జ • ప్రాపు వద్ద
యండ చక్కి గరిడి యన • నమర నా స
మీపనామములు మనోజ్ఞ•రూప సాంబ. 39

టీ. కొమరు, చొక్కాటమ్ము. రూ. చొకాటము, చొక్కటము, గొనబు, చొకారము. రూ. చొక్కారము, చొక్కము, మేలిమి, జోఁక, పొలుపు, నాణెము. రూ. నాఁడెము, సౌరు, విన్నాణము, తిన్నన, పరఁగు, చొక్కా. రూ. చొక్క, చొకా, చెల్వు. రూ. చెలువు, మురువు, తనరు, నగు, తియ్య, పొనరు, చెన్ను, అలరు, నలుపు, తీరు, వఱలు, జాను, చెలఁగు, కొఱలు, ఒనరు, చను, తగు, ఒప్పు, ఎసఁగు - ౪౦ అందమైనది. దండ, ఒద్ద, చెంత, కుఱఁగలి, డగ్గర. రూ. దగ్గర, చేర్వ. రూ. చేరువ, పొంత, దాపు, సరస, కెలను, పజ్జ (ప్ర. పశ్చాత్.), ప్రాపు, వద్ద, అండ, చక్కి, గరిడి - ౧౬ సమీపము.

సీ. పిమ్మటఁ దరువాతఁ • బిదప వెన్క వెనుక
ననఁగఁ బశ్చాదభి•ఖ్యలు చెలంగు
సడలె వదలె ప్రీలె • జాతె వీడె ననంగఁ
జ్యుతసమాఖ్య లగు లొ•చ్చు కొద కడమ
కుఱుచ యొచ్చెము తగ్గు • కొంచెము తక్కువ
కుందు కొదవ లోను • కొద్ది యనఁగ
మెఱయు న్యూనతపేళ్లు • మిక్కిలి యెక్కువ
యెచ్చు పెల్లుదనము • పెచ్చు మిగుల

తే. పిమ్మట నగ నధికాభిఖ్య • లెసఁగుచుండుఁ
దొలుత ముందర మున్ మున్ను • తొల్లి మునుపు
ముందు మును తొలి యనఁ జనుఁ • బూర్వమునకుఁ
దడవు జాగన నాలస్య • మడరు సాంబ. 40

టీ. పిమ్మటన్, తరువాతన్, (తరువాయిశబ్దమునకు సప్తమ్యేకవచనము.) పిదపన్, వెన్క, వెనుక - ౫ అనంతరము. సడలెన్, వదలెన్, ప్రీలెన్, జాఱెన్, వీడెన్-౫ అవలంబించెను - చ్యుతమయ్యెను. లొచ్చు, కొద, కడమ, కుఱుచ, ఒచ్చెము, తగ్గు, కొంచెము, తక్కువ, కుందు, కొదవ, లోను, కొద్ది - ౧౨ స్వల్పము - న్యూనత్వము. మిక్కిలి, ఎక్కువ, ఎచ్చు, వెల్లువనము, పెచ్చు, మిగుల, హెచ్చు - ౭ అధికము. తొలుత, ముందర, మున్, మున్ను, తొల్లి, మునుపు, ముందు, మును, తొలి - ౯ పూర్వము. తడవు, జాగు - ౨ ఆలస్యము.

సీ. తాఱుమాఱయ్యెను • దడఁబడె వీడ్వడె
నన విపర్యాసాఖ్య • లమరు సాము
సగము సాఁబా లనఁ • దగు నర్ధ మనుటకు
దూఁకొనెఁ జొరఁబాఱెఁ • దూఱెఁ జొచ్చె
ననఁగఁ బ్రవేశించె • ననుటకుఁ దనరారు
మొత్తెఁ గొట్టెను వ్రేసె • మోఁదె ననఁగఁ
బ్రహరించె ననుట కౌఁ • బనిచె ననిచెఁ బుచ్చె
నంపెఁ బుత్తెంచెఁ బొ•మ్మనియెఁ బంపె
తే. గెలువుమనె ననఁ బ్రస్థితా•ఖ్యలు చెలంగుఁ
జాయ పొం తనఁ జోటనఁ • బాయ యిక్క
చక్కి తా వనఁగఁ బ్రదేశ•సంజ్ఞ దనరు
నంబరనదీలసజ్జటా•డంబ సాంబ. 41

టీ. తాఱుమాఱయ్యెను, తడఁబడెన్, వీడ్వడెన్ - ౩ వ్యత్యస్తమాయెను. సాము, సగము, సాఁబాలు-౩ అర్ధము. దూఁకొనెను, చొరఁబాఱెను, తూఱెన్, చొచ్చెన్ - ౪ ప్రవేశించెను. మొత్తెను, కొట్టెను, వ్రేసెన్, మోఁదెన్ - ౪ ప్రహరించెను. పనిచెన్, అనిచెన్, పుచ్చెన్(పోవు ధా. ప్రేరణరూపము.), అంపెను, పుత్తెంచెను, పొమ్మనియెన్, పంపెన్, గెలువుమనెన్ - ౮ ప్రయాణముచేసిపంపెను. చాయ, పొంత, చోటు, పాయ, ఇక్క, చక్కి, తావు - ౭ ప్రదేశము.

సీ. అచట నయ్యెడ నందు ♦ నచ్చో నదిగో యట
నచ్చట నక్కడ ♦ నకడ నాడ
నావంక నల్లదె ♦ యనఁ దత్ప్రదేశాఖ్య
లౌదవు ముంగల మ్రోల ♦ నెదుట ముందు
ముందట యనఁగ స♦మ్ముఖము పేళ్లు రహించు
నిరుదెస లిరువంక ♦ లిరుగెలంకు
లిరుప్రక్క లిరుమైల ♦ లిరుగ్రేవ లిరుగడల్
సూరె లనెడిపేళ్లు ♦ మీఱు నుభయ
తే. పార్శ్వనామముల్ వడసెందె ♦ బాళిఁతాఁకె
మైమఱచెఁ గడపట్టె సొ♦మ్మసిలె నన
మూర్ఛ కొఁ గికురించెను ♦ మోసపుచ్చెఁ
బిక్కచేసె నా వంచన♦పేళ్లు సాంబ. 42

టీ. అచటన్, అయ్యెడన్, అందున్, అచ్చోన్, అదిగో. రూ. అదె, అటన్, అచ్చటన్, అక్కడన్, అకడన్, ఆడన్, ఆవంకన్, అల్లదె. రూ. అల్లదిగో - ౧౪ ఆ ప్రదేశము ముంగల, మ్రోల, ఎదుట, ముందు, ముందట-౫ సమక్షము. ఇరుదెసలు, ఇరువంకలు. రూ. ఇర్వంకలు, ఇరుగెలఁకులు, ఇరుమైలలు, ఇరుగ్రేవలు, ఇరుగడలు, సూరెలు-౭ ఉభయపార్శ్వములు. వడసెందె, బాళితాఁకె, మైమఱచె, కడపట్టె, సొమ్మసిల్లె-౫ మూర్ఛిల్లె. కికురించెను, మోసపుచ్చెన్, పిక్కచేసె-౩ వంచించెను.

సీ. నెఱ బీతు దిగు లళ్కు ♦ వెఱ పదరు బెదరు
జళు కెద జడు పన ♦ వెలయు భయము
కత్తి వా లడిదము ♦ కైదువు నన ఖడ్గ
మెసఁగు బల్లెము గద ♦ యీటె చివ్వ
యనఁగఁ గుంతాఖ్య లౌ ♦ నామెత పండుగ
పబ్బం బనఁగ నుత్స♦వమున కలరు
వంక వంకర సొట్ట ♦ డొంక నన వక్రత
చెలఁగు దుడుకు లూటి ♦ జులిమి దుండ
తే. గ మ్మనఁగ నుద్ధతాఖ్య లౌఁ ♦ గాని వల్లె
మంచిది యనంగఁ దగు సమ్మ♦తించుటకును
గుబుచ యరచట్ట దుత్తాయి ♦ కుబుస మనఁగ
నమరుఁ గూర్పాసనామధే♦యములు సాంబ. 43

**టీ.** వెఱ, బీతు (ప్ర, భీతి), దిగులు, అళ్కు. రూ. అళుకు, వెఱపు, అదరు, జళుకు, చెదరు, ఎద, జడుపు-౧౧ భయము. కత్తి, వాలు, అడిదము, కైదువు - ౪ ఖడ్గము. బల్లెము, గద, ఈటె, చివ్వ - ౪ కుంతము. ఆమెత, పండుగ. రూ. పండుగు, పండువు, పబ్బము-౫ ఉత్సవము. వంక, వంకర, సొట్ట, డొంక - ౫ చక్కనిదికానిది-వక్రము. దుడుకు, లూటి, జులిమి, దుండగము - ౪ దుర్మార్గము. కాని, వల్లె, మంచిది-3 అంగీకరించుటకు గుఱుతు. కుబుచ, అరచట్ట, దుత్తాయి, కుబుసము - ౪ రవిక.

సీ. పావాలు పావలు ♦ పావుకో ళ్లనఁ జెల్లుఁ
బాదుకాభిఖ్యలు ♦ పాయపోసు
లూడ్పులు పాపోసు ♦ లుద్దముల్ మెట్లు చె
ప్పు లనఁగ బాదర♦క్షలకుఁ దనరు

నంగడి బాజా ర♦నంగ విపణి పొల్చు
గొన మల్లె నారి నా ♦ గుణము పరఁగు
మొన యొ డ్డనఁగ వ్యూహ♦మున కగుఁ బెడబొబ్బ
యా ర్పన నట్టహా♦సాఖ్య లెసఁగు
తే. లావు సత్తువ యనఁగ బ♦లంబు చెలఁగు
నట్ట మొండె మనఁగఁ గబం♦ధాఖ్య లలరు
దూల నవ తీఁట యనఁగఁ గం♦డూతి కొనరు
శంబరాహితమదభిదా♦డంబ సాంబ. 44

టీ. పావాలు, పావలు, పావుకోళ్లు-౩ పాదుకలు(కొయ్యవి). పాయ పోసులు, ఊడ్పులు, పాపోసులు, ఉద్దములు, మెట్లు, చెప్పులు-౬ పాదరక్షలు (తోలువి). అంగడి, బాజారు (అన్యదేశము.)-౨ విపణి. గొనము, అల్లె, నారి - ౩ అల్లెత్రాడు. మొన, ఒడ్డు - ౨ సేనలకూటము. పెడబొబ్బ, ఆర్పు-౨ అట్టహాసము-సింహనాదము. లావు, సత్తువ(ప్ర.సత్త్వము.)-౨ బలము. అట్ట, మొండెము-౨ కబంధము-తలలేనియొడలు. దూల, నవ, తీఁట-౩ దురద-కండూతి.

సీ. విలు విల్లు సింగాణి ♦ విల్ సింగిణి యనంగఁ
గోదండమున కగుఁ ♦ గోపు కొప్పు
నాఁ జను ధనురగ్ర♦నామంబులు లకోరి
యంపఱ నారస ♦ మమ్ము తీరు
ములికి సరము కోల ♦ చిలుకు తూపన శరా
ఖ్యలు మించు మైమఱ్వ ♦ కమరు జోడు
దగళా జిరాయి బొం♦దళము దుప్పటమును
జిలుకత్తు బం దనఁ ♦ జెలఁగుఁ గవచ

తే. మరద మనఁ దేరనఁగ రథం ♦ బమరు హాయలు
బండి కొల్లారుబండి నాఁ ♦ బరఁగుఁ గోశ
తాంగనామముల్ మునికోల ♦ యారెకోల
ముల్లుకో లనఁ దోత్రంబు ♦ మొనయు సాంబ. 45.

టీ. విలు, విల్లు, సింగాణి, విల్, సింగిణి-౫ ధనుస్సు. కోపు, కొప్పు-౨ వింటికొన. లకోరి, అంపఱ, నారసము (ప్ర. నారాచము.), అమ్ము, తీరుమలికి, సరము, కోల, చిలుకు, తూపు - ౧౦ బాణము. మైమఱ్వు. రూ. మైమఱువు, కమరు, జోడు, దగళా, జిరాయి, బొందళము, దుప్పటము, చిలుకత్తు, బందు - ౧౦ కవచము. ఆరదము (ప్ర. రథము.), తేరు-౨ రథము. హాయలుబండి, కొల్లారుబండి. రూ. కొలారుబండి-౩ గోశతాంగము - గాడి. మునికోల, ఆరెకోల, ముల్లుకోల. రూ. ములుకోల - ౪ తోత్రము-పసులనుతోలెడు సాధనవిశేషము.

సీ. దీవట్లు పంజులు ♦ దివ్వటీల్ దివటీలు
దివియ లనం గర♦దీపిక లగు
నొగ కాఁడి మ్రాఁ కనఁ ♦ దగుఁ గూబరము కాన్క
కానుక సూడిదె ♦ కప్ప మనఁగఁ
గరము పేళ్లగు గద్దె ♦ గద్దియ యనఁగ సిం
హాసననామంబు ♦ లమరు గొఱిజ
గొల్లెనయు గుడారు ♦ గూడార మనఁ దగుఁ
బటకుటీరము నొప్పి ♦ బాద యలఁత
తే. తెగులు తెవు లన రోగాఖ్య ♦ లగును వెజ్జు
మందరి యనంగ వైద్యనా♦మంబు లెసఁగు
దండ చేరు సరము పేరు ♦ తావడంబు
సరి యనఁగ హారనామముల్ ♦ పేరయు సాంబ. 46.

టీ. దీపట్లు, పంజులు, దివ్వటీలు, దివటీలు, దివియలు - ౫ చేతిదీపములు. నొగ, కాండిమ్రాఁకు-౨ కూబరము. కాన్క, కానుక. రూ. కానిక, కూడిదె, కప్పము - ౫ ఉపహారము. గద్దె, గద్దియ - ౨ సింహాసనము. గొటిజ, గొల్లెన. రూ. గొల్లియన, గుడారు, గూడారము-౫ పటమంటపము. నొప్పి, బాద(ప్ర. బాధ.), అలఁత, తెగులు, తెవులు - ౫ రోగము. వెజ్జు (ప్ర. వైద్యుఁడు.), మందరి - ౨ వైద్యుఁడు. దండ, చేరు, సరము, పేరు, తావడంబు. రూ. తావళంబు, సరి - ౬ హారము.

సీ. సోబె సిబ్బె మనఁ బొల్చును గిలాసము కొంగు
చెఱఁగు చుంగన నొప్పుఁ జేలముతుద
నెయ్యి నే చమురన నెగడు నాజ్యము వేళ్లు
తైలాఖ్య యగు నూనె తలచమురన
దివ్వెచమురు నాముదెము నాముదం బన
నేరండతైలాఖ్య లెసఁగుఁ గోపు
సారాయి యనఁ జెల్లు వారుణీనామముల్
తిలపిష్టమున కగుఁ దెలికపిండి
తే. గాన్గుపిండి యనంగఁ దక్రంబు వెలయుఁ
జల్ల మజ్జిగ యన దధిసంజ్ఞ దనరుఁ
బెరుఁగు కలు పన గోరంట బెల్ల మచ్చు
నా గుడాభిఖ్య లగు జగన్నాథ సాంబ. 47

టీ. సోబె, సిబ్బెము-౨ కిలాసము (దేహముమీఁది యొకవిధమైన తెల్లనిమచ్చలు). కొంగు, చెఱఁగు, చుంగు-౩ చీరయొక్కకొన. నెయ్యి. రూ. నేయి, నే, చమురు - ౪ ఆజ్యము. నూనె, తలచమురు-౨ తైలము-నూగులనూనె. దివ్వెచమురు = దీపమునకైనచమురు, ఆముదెము, ఆముదము-౩ ఏరండతైలము. కోపు, సారాయి-౨ కల్లు. తెలికపిండి, గాన్గుపిండి.

రూ. గానుఁగపిండి-౧ తిలపిష్టము. చల్ల, మజ్జిగ-౨ తక్రము. పెరుఁగు-కలుపు-౨ దధి. గోరంట, బెల్లము, అచ్చు - 3 గుడము.

సీ. ఒడమెలు సొమ్ములు ♦ తొడవు లనఁగఁ జెల్లు
భూషణాఖ్యలు విత్త♦మునకు రూక
ధనము రొక్క మనంగఁ ♦ దనరు మేలుతరంబు
మేల్బంతి కన్నాకు ♦ మీసరంబు
తలకట్టు నాఁగ భా♦సిలు శ్రేష్ఠనామంబు
లనవుడు నాఁగ నా ♦ ననఁగ నావు
డనఁగఁ జెల్లు ననంగ ♦ ననెడిపేరులకు విం
జామరము లన విం♦జామర లన
తే. జమిడివీచోపు లనఁ జామ♦రముల కౌన
వాతు కల్కండ చక్కెర ♦ పంచదార
కండచక్కెర మేల్పుల♦కండ మనఁగ
శర్కరాభిఖ్య లగుశైల♦చాప సాంబ.  48

టీ. ఒడమెలు (ఇది ద్రావిడము.), సొమ్ములు, తొడవులు - 3 భూషణములు. రూక, ధనము (ఇది తత్సమముగాన నిది యిచ్చటఁజేర్చుటవిచార్యము.), రొక్కము (ప్ర. రుక్తము.)- 3 విత్తము. మేలుతరంబు, మేల్బంతి, కన్నాకు, మీసరము, తలకట్టు-౫ శ్రేష్ఠములనుట. అనవుడున్, నాఁగన్, నాన్, అనఁగన్, నావుడున్ (ఇవి యనుధాతువు నానంతర్యార్థకతుమున్నర్థకములు) - ౫ చెప్పఁగాననుట. వింజామరములు, వింజామరలు, జమిడివీచోపులు - 3 చామరములు. నవాతు, కల్కండ, చక్కెర, పంచదార, కండచక్కెర, మేలుపులకండము - ౬ పంచదార - శర్కర.

సీ. సైకము తోడెము ♦ సన్న మన్నువ జిల్గు
వలిపెము చిలు లేఁత ♦ కొలఁది యలఁతి

యసదు లేజీ బన ♦ నమరు స్వల్పమునకుఁ
బెను గొప్ప బలు పేరు ♦ పెద్ద దొడ్డ
గన మన నధికాఖ్య ♦ లొనరుఁ దోరము హొమ్ము
గమక మొ మ్మనఁగ స్థూ♦లము చెలంగు
డస్సెఁ గుందె ముడింగె ♦ దాఁకె నుబ్బడఁగెను
మ్రగ్గెఁ గ్రుంగెను డొంకె ♦ సగ్గె స్రుక్కెఁ
తే. దగ్గె నన క్షీణదశ కగు ♦ డబ్బు బద్దు
పొల్లు దబ్బర తాటోటు ♦ బొంకు తవళి
కల్ల జూ దన నసృతంబు♦పేళ్లు వెలయు
నిలుకడ యనంగ నిరతాఖ్య ♦ నెగడు సాంబ. 49

టీ. సైకము, తోడెము, సన్నము, అన్నువ, జిల్గు, వలిపెము, చిఱు, లేఁత, కొలఁది, అలఁతి, ఆసదు, లేజీబు - ౧౨ స్వల్పమునుట. పెను, గొప్ప, బలు, పేరు, పెద్ద, దొడ్డ, గనము - ౭ ఎక్కువగునది. తోరము, హొమ్ము, గమకము, ఒమ్ము - ౪ స్థూలమైనది. డస్సెఁ, కుందెఁ, ముడింగెఁ, తాఁకెను, ఉబ్బడఁగెను, మ్రగ్గెఁ, క్రుంగెఁ, డొంకెఁ, సగ్గెఁ, స్రుక్కెఁ, తగ్గెను - ౧౧ క్షీణదశనొందెను. డబ్బు, బద్దు, పొల్లు, దబ్బఱ. రూ. దబ్బఱ, తాటోటు. రూ. టాటోటు, బొంకు, తవళి. రూ. తవళి, కల్ల, జూదు-౧౨ నిజముకానిది. నిలుకడ=నిరతము.

సీ. ఎంచె గణుతిచేసె ♦ నెన్నికనిడె నెన్నె
ననఁగ గణించుట ♦ కమరుఁ దాల్మి
సైరణ యోర్పన ♦ శాంతతపే ళ్ళగు
నెమ్మి నెమ్మది హాయి ♦ నిమ్మళంబు
నాఁగ నిరాతంక♦నామము లగు వెడ
యలయిక బడలిక ♦ యలపు నేద

యనఁగ శ్రమాఖ్యలౌ ♦ నగ్గలం బాయెను
మేరతప్పెను మట్టు♦మీఱె మించె
తే. వెక్కసం బయ్యె నుఱవయ్యెఁ ♦ గ్రిక్కిఱిసెను
ననఁగ నుత్కృష్ట మనుట కౌ ♦ నావరించె
నిండె నెగడె వెలసెఁ బర్వె ♦ నిగిడె ననఁగ
వ్యాప్త మయ్యె ననెడి పేళ్ళ ♦ కలరు సాంబ. 50

టీ. ఎంచెన్, గణుతిచేసెన్, ఎన్నికనిడెన్, ఎన్నెన్-౮ లెక్క పెట్టెను. తాల్మి. రూ, తాలిమి, సైరణ. రూ. సయిరణ, ఓర్పు. రూ. ఓరువు - ౬ శాంతత. నెమ్మి, నెమ్మది (నెఱ+మది), హాయి, నిమ్మళము - ౮ నిర్భయము. వెడ, అలయిక, బడలిక, అలపు, సేద-౯ శ్రమము. అగ్గలం బాయెను, మేరతప్పెను, మట్టుమీఱెను, మించెను, వెక్కసమయ్యెను, ఉఱవయ్యెను, క్రిక్కిఱిసెను - ౭ సాంద్రమయ్యెను. ఆవరించెను, నిండెను, నెగడెను, వెలసెను, పర్వెను, నిగిడెను-౬ వ్యాపించెను.

సీ. అవసడి యాడిక ♦ యాఁటడి సడి ఱట్టు
నగడు దూఱ నింద ♦ కమరు మాల్మి
యలవాటు వాడుక ♦ యలవడు టనఁ బొల్చుఁ
బరిచయాభిఖ్యలు ♦ పన్నిదంబు
పందెము జూద మ♦నం దగు ద్యూతంబు
నిబ్బది నిక్కము ♦ నిలువరంబు
నిజము నిక్కువ మన ♦ నెగడు సత్యముపేళ్లు
గోర్వంక నెలకూన ♦ గోటినాటు
తే. నా నఖక్షత మగును దం♦తక్షతములు
కెరలు పలునొక్కు వాతెఱ♦కెంపు పెదఁ

గంటి కెమ్మోవిగుఱి యనఁ • గౌఁగిలి యనఁ
గవుఁగి లనఁగ నాలింగనా•ఖ్య లగు సాంబ. 51

టీ. అవసడి, ఆడిక, ఆఱడి, సడి, అట్టు, అగడు, దూఱు–౭ నింద. మాల్మి. రూ. మాలిమి, అలవాటు, వాడుక, అలపడుట–౫ అభ్యాసము. పన్నిదము, పందెము, జూదము (ప్ర. ద్యూతము.)–3 ద్యూతము. నిబ్బది, నిక్కము, నిలువరంబు, నిజము, నిక్కువము–౫ సత్యము. గోర్వంక. రూ. గోరువంక, నెలతూన, గోటినాటు – ౪ నఖక్షతము. పలునొక్కు, వాతె ఱకెంపు, పెదవిగంటి, కెమ్మోవిగుఱి– ౪ దంతక్షతము–సురతసమయమందలి దంతములకాటు. కౌఁగిలి, కవుఁగిలి – ౨ ఆలింగనము చేసికొనుట.

సీ. నాగకేసరులు చె•న్నంగులు కురువులు
భోజనప్రియములు • రాజనమును
గన్నేర లిప్పపూల్ • గంగాజలంబులు
మట్టకారులు పూల•మంజరీలు
పెద్దవంకలు పాల•వెల్లులు ముత్తెపు
సరులు సంభావులు • చంద్రవంక
లేనుఁగుకొమ్ములు • మానికములు వన్నె
పూలు సీతాభోగ•ము లన శాలి
తే. ధాన్య మెసఁగును దూము ముం•త ముకుసంబు
బల్ల కుంచ సోల త•వ్వ పడి యడ్డ
గరిసె పుట్టి సెలగ మెడా • కల మనంగ
ధాన్యములు గొల్చువానికిఁ • దగును సాంబ. 52

టీ. నాగకేసరులు, చెన్నంగులు, కురువులు, భోజనప్రియములు, రాజనములు, గన్నేరులు, ఇప్పపూలు, గంగాజలంబులు, మట్టకారులు, పూలమంజరీలు, పెద్దవంకలు, పాలవెల్లులు, ముత్తెపుసరులు, సంభావులు, చంద్రవం

కలు, ఏనుఁగుకొమ్ములు, మానికములు, వన్నెపూలు, సీతాభోగములు - ౧౭ ధాన్యభేదములు. తూము, ముంత, ముకుసంబు, బల్ల, కుంచము, సోల, తవ్వ, పడి, అడ్డ, గరిసె, పుట్టి, సెలగ, మెడా, కలము - ఈ ౧౪ ను ధాన్యములను గొల్చుమానములు - సాధనములు.

క. ఇమ్మనుజవర్గుఁ జేసితి
సమ్మదమున దీని వినిన • జనులు భళా చో
క్కమ్మనఁగా నెంతయు నన
ఘ మ్మనఁగా మహిని వెలయుఁ • గావుత సాంబా. 53

తా. సంతసముతో దీనిని వినినమనుజులు బలె యిది లెస్సగా నున్నది యనునట్లు ఈమానవవర్గును పైఁజెప్పిన తెఱఁగునఁ జేసితిని. ఓసాంబమూర్తీ! యీవర్గ గమ్మని పుడమి వెలయునుగాక.

మానవవర్గు సమాప్తము.

---

## స్థావరవర్గు.

క. శ్రీవరదాయక పాయక
దేవరనామాంకితముగఁ • దేటపఱచెదఁగ
స్థావరవర్గును గవితా
భావరసజ్ఞు లెద మెచ్చఁ • బశుపతి సాంబా. 54

తా. సంపద్యుక్తుఁడయిన యోవరదాతా! పశుపతీ! సాంబమూర్తీ! కవిత్వభావరసజ్ఞు లగుకవులు మనసునందు మెచ్చునట్లు, స్థావరవర్గును తమ పేర నంకితముచేసి చెప్పుచున్నాను; అవధరింపుము.

సీ. ఇలతాల్పు గట్టు గుబ్బలి కొండ మల తిప్ప
యన శైలనామంబు • లమరు మంచు

టిలతాల్పు వడఁకుగు•బ్బలి దుగ్గికన్నయ్య
గట్లరాయఁడు జేసి•కంటిమామ
చలికొండ వలిమల • పులుచూలితాత నా
హిమగిరినామంబు • లెసఁగుఁ బసిఁడి
గట్టు వేల్పులమన్కి•పట్టు క్రొన్నెలదారి
సింగిణి యన మేరు•శిఖరివొల్పు
తే. విసపుమేఁతరి బలుటెంకి • వెండికొండ
తెలిమల యనంగ రజతాద్రి • తేజరిల్లు
బటువుమల తుదగట్టనఁ • బరఁగుఁ జక్ర
వాళగిరిపేళ్లు త్రిభువన•వంద్య సాంబ. 55

టీ. ఇలతాల్పు=భూమిని మోయునది, గట్టు, గుబ్బలి, కొండ, మల, తిప్ప-౬ పర్వతము. మంచుటిలతాల్పు (మంచు+ఇలతాల్పు-టుగాగమము)=హిమవంతమగు పర్వతము, వడఁకుగుబ్బలి=చలిగలపర్వతము, దుగ్గికన్నయ్య=పార్వతికిఁదండ్రి, గట్లరాయఁడు=పర్వతములకురాజు, జేసికంటిమామ=శివునికిమామ, చలికొండ=చల్లనిపర్వతము, వలిమల=మంచుగలపర్వతము, పులుచూలితాత=రెల్లునందుఁబుట్టిన కుమారస్వామికిఁదల్లిదండ్రి-మాతామహుఁడు-౮ హిమవత్పర్వతము. పసిఁడిగట్టు=బంగారుపర్వతము, వేల్పులమన్కిపట్టు=దేవతలకు వాసస్థానము, క్రొన్నెలదారిసింగిణి=బాలచంద్రుని శిరస్సునఁ దాల్చినవానికి-చంద్రమౌళీశ్వరునికిఁ ద్రిపురసంహారమున విల్లురూపుధరించినది. 3 మేరుపర్వతము. విసపుమేఁతరి బలుటెంకి=హాలాహలమును భక్షించినశివునికి ముఖ్యస్థానము, వెండికొండ=వెండివన్నెగల పర్వతము, తెలిమల=తెల్లనిపర్వతము-3 కైలాసపర్వతము. బటువుమల=గుండ్రనిపర్వతము, తుదగట్టు=కడపటికొండ - ౨ చక్రవాళపర్వతము.

సీ. కవ్వపుమల తరి♦గట్టిన మందరం
బడరుఁ దూరుపుమల ♦ పొడుపుఁదిప్ప
మొదటికొండ యనంగ ♦ నుదయాచలం బొప్పుఁ
బడమటిమల క్రుంకు♦పుడమితాల్పు
నా న స్తగిరి కగు ♦ ఱాయి ఱా కల్లన
బ్రస్తరాఖ్య దలిర్చుఁ ♦ బల్లె యూరు
కుప్పం బనఁగ గ్రామ ♦ మొప్పును బ్రోలు వీ
డనఁ బట్టణముపేరు ♦ లలరుచుండు
తే. నిరవు టెంకి యునికి యిక్క ♦ యిల్లు గీము
మనికి పట్టు బిడారు కొం♦ప యిలు నెలవు
నట్టు తావన మందిర♦నామము లగు
శంబరాహితమదభిదా♦డంబ సాంబ. 56

టీ. కవ్వపుమల=దేవతలకుఁ గవ్వమైనకొండ, తరిగట్టు=క్షీరసముద్రమును జిలికినకొండ-౨ మందరపర్వతము. తూరుపుమల=తూర్పుదిశనుండు కొండ, పొడుపుఁదిప్ప=సూర్యుఁ డుదయించుకొండ, మొదటికొండ=తూర్పుననుండు కొండ - 3 ఉదయపర్వతము. పడమటిమల = పడమటిదిశనుండెడి కొండ, క్రుంకుపుడమితాల్పు=సూర్యుఁ డస్తమించెడి భూధరము - ౨ అస్తమానపర్వతము. ఱాయి, ఱా, కల్లు - 3 శిల. పల్లె. రూ. పల్లియ, ఊరు, కుప్పము- 3 గ్రామము. ప్రోలు, వీడు-౨ పత్తనము. ఇరవు, టెంకి, ఉనికి, ఇక్క, ఇల్లు, గీము (ప్ర. గృహము), మనికి, పట్టు, బిడారు, కొంప, ఇలు, నెలవు, నట్టు, తావు (అన్యదేశము), రూ. తావు - ౧౪ నివాసము.

సీ. టెంకాయచెట్టన ♦ టేమ్రాను నారిక
డం బన నారికే♦ళంబు దనరు

దా డనఁ దాళ మా ♦ దాళిమ్మ దానిమ్మ
యన దాడిమియుఁ బొన్న ♦ పొన యనంగఁ
బున్నాగముఁ దనర్చు ♦ గన్నేరు గన్నెరు
నాఁగను గరవీర♦నామము లగు
రేఁగు రే నన బదరి♦కిఁ జెల్లు మారేడు
బిలువ మనఁ దనర్చు ♦ బిల్వమునకు
తే. జమ్మి జం బన శమి యగుఁ ♦ జంపకంబు
దనరు సంపెఁగ సంపఁగె ♦ యనఁగ నెల్లి
యుసిరి యుసిరిక యన ధాత్రి ♦ కొప్పు రాగి
యనఁగ లా వన నశ్వత్థ ♦ మొనరు సాంబ. 57

టీ. టెంకాయచెట్టు. రూ. తెంకాయచెట్టు, టేమ్రాను. రూ. తేమ్రాను, నారికడంబు-౩ నారికేళవృక్షము. తాడు-౧ తాటిచెట్టు. దాళిమ్మ, దానిమ్మ-౨ దాడిమీవృక్షము. పొన్న, పొన - ౨ పున్నాగవృక్షము. గన్నేరు, గన్నెరు - ౨ కరవీరవృక్షము-కస్తూరిపట్టెచెట్టు. రేఁగు, రేను-౨ బదరీవృక్షము. మారేడు, బిలువము- ౨ బిల్వవృక్షము. జమ్మి, జంబు-౨ శమీవృక్షము. సంపెఁగ, సంపఁగె. రూ. సంపఁగి- ౨ చంపకవృక్షము. నెల్లి, ఉసిరి, ఉసిరిక - ౩ ఆమలకవృక్షము. రాగి. రావి - ౨ అశ్వత్థవృక్షము.

సీ. అత్తి మేడి యనంగ ♦ నౌదుంబరం బొప్పు
మావి మామి డన నా♦మ్రము దనర్చు
వెలఁగ వెలంగ నా ♦ వెలయుఁ గపిత్థంబు
మల్లె మల్లియ నాఁగ ♦ మల్లిక యగు
జాజి జాది యనంగ ♦ జాతి యగు నేరేడు
నేరేడు నా జంబు ♦ నెగడుచుండుఁ

బాదిరి కలిగొట్టు • నాఁ దగుఁ బాటలి
　　పొగడ పొవడ యన నొప్పును వకుళము
తే. మ్రాఁకు మ్రాను చెట్టనఁగ ద్రుమంబు చెలఁగు
తీఁగ తీఁగియ లతకూన • తీఁగె యనఁగఁ
దనరు లతపేరు పూవులు • ననలు విరులు
పువ్వు లలరులు నా సుమంబు లగు సాంబ. 58

టీ. అత్తి, మేడి - ౨ అత్తిచెట్టు. మావి, మామిడి - ౨ చూతవృక్షము. వెలఁగ, వెలంగ - ౨ కపిత్థవృక్షము. మల్లియ, మల్లె - ౨ మల్లెతీఁగ. జాజి, జాది-౨జాతీలత. నేరేడు, నేరెడు-౨జంబూవృక్షము. పాదిరి,కలిగొట్టు-౨ పాటలీవృక్షము. పొవడ, పొగడ - ౨ వకుళవృక్షము. మ్రాఁకు, మ్రాను, చెట్టు- 3 వృక్షసామాన్యము. తీఁగ. రూ. తీవ, తీఁగియ. రూ. తీవియ, లతకూన (ఇది మిశ్రపదము.), తీఁగె. రూ. తీవె - ౪ లత. పూవులు. రూ. పూలు, ననలు, విరులు, పువ్వులు. రూ. పువులు, అలరులు-౪ పుష్పములు.

సీ. మొక్క మోటికి మోసు • మోక మొలక యన
　　నంకురనామంబు • లలరు నిగురు
తలిరు చిగురు నాఁగఁ • దగుఁ బల్లవాఖ్యలు
　　కొన తుద యన నగ్రమునకుఁ బొల్చుఁ
దొఱ తొలి తొఱ్ఱ నాఁ • దరుకోటరం బొప్పుఁ
　　దమ్మి తామ రనఁ గంజమ్ము పరఁగు
దొగ తొవ కలు వనఁ • దగు నుత్పలమునకు
　　దట్టంబు జొంపంబు • తఱుచు జీబు
తే. గుమురు తంపర యన నిబిడము దనర్చు
మొగడ మొగ్గ యనం దగు • ముకుళమునకు

నిక్షుకాండంబునకుఁ బేరు ♦ లెసఁగు చెఱకు
కనులుగలప్రాను తియ్యప్రా ♦ ననఁగ సాంబ. 59

టీ. మొక్క, మోటిక, మోసు, మోక, మొలక - ౫ అంకురము. ఇగురు, తలిరు, చిగురు - ౩ పల్లవము. కొన, తుద ౨ అగ్రము. తొఱ, తొలి, తొఱ్ఱి - ౩ కోటరము-వృక్షమునందలిరంధ్రము. తమ్మి, తామర-౨ కమలము. తొగ, తొవ, కలువ. రూ. కల్వ - ౪ ఉత్పలము. దట్టము, జొంపము, తఱచు, జీబు, గుమురు. రూ. గుబురు, దంపర - ౭ దట్టమైనది. మొగడ, మొగ్గ - ౨ ముకుళము. చెఱకు, కనులుగలప్రాను = గణుపులుండునట్టివృక్షము, తియ్యప్రాను - ౩ చెఱకుగడ.

సీ. తెలుపు తెల్లన తెల్ల ♦ తెలి తెల్ల వెలి యన
ధవళవర్ణ మెసంగుఁ ♦ దొవరు తొగరు
కెంజాయ యెఱు పెఱ్ఱ ♦ కెంప న రక్తవ
ర్ణమగు నల్లన కఱి ♦ నల్ల కప్పు
నలు పన నీలవ♦ర్ణము పొల్చుఁ జామనఁ
బసరుచా యన శ్యామ ♦ మెసఁగుచుండు
నలిది పసు పనంగ ♦ నగుఁ బీతవర్ణంబు
తేట సున్నన సున్న ♦ తెలివి సునుపు
తే. నిద్ద మన స్నిగ్ధత కెసంగు ♦ నిగ్గు డాలు
మినుకు మిన మించు నిగ తళ్కు ♦ మెఱుఁగు చికిలి
కళుకు జిగి రంగు మెఱ పనఁ ♦ బొలుచుఁ గాంతి
నొడ్డు దరి గట్టనఁగఁ గూల ♦ మొనరు సాంబ. 60

టీ. తెలుపు, తెల్లన, తెల్ల, తెల్లి, వెల్ల, వెలి-౬ శుక్లవర్ణము. తొవరు, తొగరు, కెంజాయ (ప్ర. కెంపు+చాయ), ఎఱుపు, ఎఱ్ఱ, కెంపు-౬ రక్తవర్ణము. నల్లన, కఱి, నల్ల, కప్పు, నలుపు-౫ నీలవర్ణము. చామన, పసరు

ఛాయ-౨ నలుపు తెలుపు గలిసినవర్ణము. ఆళిది, పసుపు-౨ పీతవర్ణము. తేట, నున్నన, నున్న, తెలివి, నునుపు, నిద్దము (ప్ర. స్నిగ్ధము.)-౬ నిర్మలత్వము. నిగ్గు, డాలు, మినుకు. రూ. మినుక్కు, మిన, మించు, నిగ, తళుకు. రూ. తళుక్కు, మెఱుఁగు, చికిలి, కళుకు, జిగి, రంగు, మెఱపు-౧౫ కాంతి. ఒడ్డు, దరి, గట్టు-3 తీరము.

సీ. ఆణి చినుకుఁబూస ♦ పాణి సుప్పాణి ము
      త్తెము ముత్తియంబు ము♦త్య మనఁ దనరు
   మౌక్తికాఖ్యలు కెంపు ♦ మానికము రతన
      మనఁగ మాణిక్యాహ్వ♦యంబు లలరుఁ
   బగడము పవడం బ♦నఁగ విద్రుమము పొల్చుఁ
      బక్కిరాయనితాయి ♦ పచ్చ యనఁగ
   మరకతము దలిర్చు ♦ మగతాలు మూలతా
      లన వజ్రము లగుఁ బు♦ల్లంటుతాయి
తే. కప్పుతాయి యనఁగ నీల ♦ మొప్పుఁ బిల్లు
   పూరి చిగిరింత యేట్రింత ♦ పోనుఁగు గడ్డి
   గఱిక పచ్చిక వెణుతురు ♦ కసవు తుంగ
   విడవలి యనఁ దృణాఖ్యలు ♦ వెలయు సాంబ. 61

టీ. ఆణి, చినుకుఁబూస, పాణి, సుప్పాణి, ముత్తెము, ముత్తియము, ముత్యము-౭ ముక్తాఫలము. కెంపు, మానికము, రతనము (ప్ర. రత్నము.)-3 మాణిక్యము. పగడము, పవడము-౨ ప్రవాళము. పక్కిరాయనితాయి, పచ్చ-౨ మరకతమణి. మగతాలు, మూలతాలు-౨ వజ్రములు. పుల్లంటుతాయి, కప్పుతాయి-౨ ఇంద్రనీలమణి. పిల్లు, పూరి, చిగిరింత, ఏట్రింత, పోనుఁగు, గడ్డి, గఱిక, పచ్చిక, వెణుతురు, కసవు (ప్ర. ఘాసము.), తుంగ, విడవలి-౧౨ తృణభేదములు.

సీ. ఎల్లి చుట్టువు గొడు ♦ గెండమఱు వనంగ
ఛత్త్రంబు దనరు ధ్వ♦జంబు పేళ్లు
టెక్యము టెక్కెము ♦ టెక్కియము సిడంబు
పడగ డా లనఁ జెల్లు ♦ నిడివి నిడుద
సోగ నిడుపు చాఁపు ♦ నాఁగ దీర్ఘమున కౌ
మఱుఁగు చా టోలము ♦ మఱు వనంగ
దగుఁ బిధానాఖ్యలు ♦ జగతి జగిలె తిన్నె
యరుఁ గన వేదిక ♦ కమరు నేల
తే. ఇల పుడమి మన్ను బువి పంట♦వలఁతి యనఁగ
ధరణి కగు విప్పు వెడలుపు ♦ విరివి పఱపు
వెడఁద యన విస్తరాఖ్యలు ♦ వెలయుఁ బైరు
సని యనఁగ సస్యనామము ♦ లెసఁగు సాంబ. 62

టీ. ఎల్లి, చుట్టువు, గొడుగు, ఎండమఱువు (గు)-౪ ఛత్త్రము. టెక్యము, టెక్కెము, టెక్కియము, సిడము, పడగ (ప్ర. పతాక.), డాలు-౬ ధ్వజము. నిడివి, నిడుద, సోఁగ, నిడుపు, చాఁపు - ౫ దీర్ఘమైనది. మఱుఁగు, చాటు, ఓలము, మఱువు - ౪ మూఁత. జగతి, జగిలె, తిన్నె, అరుఁగు-౪ వేదిక-తిన్నె. నేల, ఇల, పుడమి (ప్ర. పృథివి.), మన్ను, బువి (ప్ర. భువి), పంటవలంతి = పంటలిచ్చు నాఁడుది - ౬ భూమి. విప్పు, వెడలుపు. రూ. వెడల్పు, విరివి. రూ. విఱివి, పఱపు, వెడఁద - ౫ వైశాల్యము. పైరు, ససి - ౨ సస్యము.

సీ. మోడు మొరడు మొద్దు ♦ మోటన స్థాణు వౌ
బొఱియ కలుఁగు బొక్క ♦ బొంద లోయ
మన బిలాఖ్యలు చెల్లు ♦ నడుసు బురద ఱొంపి
యన లనఁ బంకాఖ్య ♦ లెసఁగు మడుఁగు

మడు వన హ్రద మెప్పుఁ • బొడ వన నున్నతం
బగు గోడ యనఁగఁ గు•డ్యంబు పొల్చు
సోరణగం డ్లన • మీఱు గవాక్షము
మాడుగుల్ మిద్దెలు • మచ్చు లనఁగ
తే. దారునిర్మితగృహము లౌఁ • దరకసంబు
బత్తళిక పొది దోన యనఁ • బరఁగుఁ దూణి
పెట్టి మందసమును బెట్టె • పెట్టియ యనఁ
బేటికాభిఖ్య లగు గుణ•పేటి సాంబ. 63

టీ. మోడు, మొరడు, మొద్దు, మోటు-౪ స్థాణువు - కొమ్మలులేని చెట్టు. బొఱియ, కలుఁగు, బొక్క, బొంద, లోయ-౫ బిలము. అడుసు, బురద, ఒంపి, ఆసలు - ౪ పంకము. మడుఁగు, మడువు - ౨. హ్రదము. పొడవు - ౧ ఉన్నతము. గోడ-౧ కుడ్యము. సోరణగండ్లు - ౧ గవాక్షము, మాడుగులు, మిద్దెలు, మచ్చులు-౩ కొయ్యతోఁ గట్టినయిండ్లు. తరకసము. బత్తళిక, పొది, దోన - ౪ అమ్ములపొది. పెట్టి, మందసము, పెట్టె, పెట్టియ-౪ పేటిక.

సీ. ఎన జోడు మాదిరి • యీడు పురుడు మాద్రి
సాటి పాటి తరంబు • దీటు దినుసు
సరి యుద్ది ప్రతి దిన్సు • సవతు పోలిక దొర
జత యనఁగా సదృ•శమున కెసఁగుఁ
బల్లకి పల్లకీ • పాలకి పాల్కి నాఁ
బల్యంకికాఖ్యలు • పరఁగు లాలి
యుయ్యాల యుయ్యేల • యూయెల తొట్ల జో
ల యనంగ డోలికా • హ్వయము లెసఁగుఁ

తే. గంకటియు మంచ మనఁ జెల్లు • ఖట్వమునకుఁ
బీఁట పలక యనఁగ నొప్పుఁ • బీఠమునకు
బరణియుఁ గరాట మనుపేళ్లు • భరణి కమరు
నిచ్చెన యనంగ నిశ్రేణి • నెగడు సాంబ. 64

టీ. ఎన, జోడు, మాదిరి, ఈడు, పురుడు, మాద్రి, సాటి, పాటి, తరము, దీటు, దినుసు, సరి, ఉద్ది, ప్రతి, దిస్స, సవతు, పోలిక, దొర, జత- ౧౯ సమానములనుట. పల్లకి, పల్లకీ, పాలకి, పాల్కి - ౪ పల్లకి. లాలి. ఉయ్యాల. రూ. ఊయాల - ఊయల, ఉయ్యెల. రూ. ఉయ్యెల-ఊయెల- ఊయెల-ఉయెల, తొట్ల, జోల - ౧౧ డోలిక. కంకటి, మంచము - ౨ ఖట్వము. పీఁట, పలక-౨ ఆసనము. బరణి, కరాటము- ౨ కాటుకభరణి. నిచ్చెన - ౧ నిశ్రేణి - ఎక్కుసాధనము.

సీ. ఉలి యు క్కను మనఁగ • నొనరు నయస్సంజ్ఞ
చెంబు రాగి యనఁ దామ్రం బెసంగుఁ
దగరము కరుగు డనఁగ సీసము రహించు
కాంస్యంబు వర్తిల్లుఁ • గం చనంగఁ
ద్రపునామ మమరుఁ బి త్తళి యిత్తళి యనంగఁ
గుండలు చట్లు మూఁకుళ్లు బుడ్లు
కడవలు బానలు • పిడతల్ వెస ళ్లన
భాండముల్ తగు నాఁచు • పాఁచి యనఁగ

తే. శైవలం బగు నూతులు • బావు లనఁగ
వెలయుఁ గూపంబులకు గుంట • కొలను కొలఁకు
తిరుకొళం బన సరసికిఁ • బరఁగు వాఁక
యేఱు వంక వాఁ గనఁ జేరు • లెసఁగు సాంబ. 65

టీ. ఉలి, ఉక్కు, ఇనుము - ౩ అయము - లోహము. చెంబు (ఇది ద్రావిడము.), రాగి - ౨ తామ్రమనులోహము. తగరము, కరుగుడు - ౨ సీసము. కంచు - ౧ కాంస్యము. పిత్తళి, ఇత్తళి. రూ. ఇత్తడి - ౩ త్రపువనులోహము. * కుండ, చట్టి, మూఁకుడు, బుడ్డి, కడవ, బాన, పిడత, వెసరు - ౮ మంటికుండలలోభేదములు. నాఁచు, పాఁచి - ౨ శైవాలము-పాఁచితీఁగ. నూయి, బావి - ౨ బావి. గుంట, కొలను, కొలఁకు, తిరుకొశము (ఇది ద్రావిడపదము.) - ౪ సరస్సు. వాఁక, ఏఱు, వంక, వాఁగు - ౪ నది.

సీ. మీల్ మీలు చేఁపలు ♦ మీనులు తెఱగంట్లు
మచ్ఛము లనఁ జెల్లు ♦ మత్స్యములకుఁ
దాఁబేలు తాఁమేలు ♦ నాఁ బొల్చుఁ గూర్మము
నెండ్రకా యన ♦ నెసఁగుఁ గర్కి
యోడ కల మనంగ ♦ నొనరు నావకు వాన
జడి ముసు రనఁగ వర్షమున కలరు
వానజాల్ వడగండ్లు ♦ నా నొప్పుఁ గరకలు
నిసు మన నిసు కన ♦ నిసు వనంగ
తే. మెఱయు సైకతనామముల్ ♦ కురుజు తేనె
పుట్టతేనియ పెరతేనె ♦ పువ్వుఁదేనె

---

* కుండ=సాధారణపాత్రము. చట్టి=నోరు వెడల్పుగానుండు గిన్నెవంటిపాత్రము. మూఁకుడు = మూఁతపెట్టెడిపాత్రము. బుడ్డి = నోరుసన్నగను బొడ్డువుగాను నుండుపాత్రము. కడవ=నీళ్లు మొదలగునవి తోఁడుబిందె. బాన=నోరు చిన్నదిగను కడుపు పెద్దదిగను నుండుకుండ. పిడత = చిన్నగిండి చెంబువంటి పాత్ర. వెసరు=వండుటకుఁ దగినపాత్ర.

జుంటితేనియ యనఁ దగు • సుమరసంబు
శంబధరనుతసుగుణక•దంబ సాంబ. 66

టీ. మీను (దీనికి బహువచనము మీలు, మీల్, మీనులు), చేఁప, తెఱఁగన్ను, మచ్చెము (ప్ర. మత్స్యము.) - ౮ మత్స్యము. తాఁబేలు, తాmeలు - ౨ కూర్మము. ఎండ్రి, ఎండ్రకాయ - ౨ కర్కాటకము. ఓడ, కలము - ౨ నావ. వాన, జడి, ముసురు-3 వర్షము. వానఱాలు, వడగండ్లు-౨ వర్షోపలములు. ఇసుము, ఇసువు, ఇసుక - 3 సికత. కురుజుతేనె, పుట్టతేనె, పెరతేనె, పువ్వుఁదేనె (పువ్వు+తేనె) = పుష్పములయందలితేనె, జుంటితేనె - ౫ మకరందము.

సీ. జముకాణము తివాసి • జంబుకాణ మనంగఁ
గంబళాఖ్య లగు బం•గారు హొన్ను
జాళువా పుత్తడి • మేలిమి బంగరు
పసిఁడి పొన్ను కడాని • పైఁడి యుదిరి
యన సువర్ణము వొల్చు • నపరంజి కుందనం
బనఁ దప్తకనక మౌఁ • దునుక తునియ
చిదురుప చిదురు నాఁ • జెలఁగు ఖండమునకుఁ
బొది ప్రోగు వామియుఁ • బ్రోవు తిట్ట
తే. కుప్ప యన రాశి కగు సజ్జ • యుప్పరిగయు
మహాలు మేడ యనంగ హా•ర్మ్య మగుఁ ద్రోవ
దారి తెన్ను తెరు వనఁ బ•థంబు వెలయు
రవ రజం బన లవముపే • ళ్లవును సాంబ. 67

టీ. జముకాణము, తివాసి, జంబుకాణము - 3 కంబళము. బంగారు, హొన్ను, జాళువా, పుత్తడి, మేలిమి, బంగరు, పసిఁడి, పొన్ను, కడాని, పైఁడి. రూ. పయిఁడి, ఉదిరి-౧౨ సువర్ణము. అపరంజి, కుందనము-౨ పుటము

వేసినబంగారము. తునుక, తునియ, చిదురుపు, చిదుర-౪ ఖండము. పొది, ప్రోగు, ధామి, ప్రోవు, తిట్ట, కుప్ప - ౬ రాశి. సజ్జ, ఉప్పరిగ, మహాలు (ఇది యన్యదేశ్యము.), మేడ - ౪ హర్మ్యము. త్రోవ, దారి, తెన్ను, తెరువు-౪ మార్గము. రవ, రజము-౨ కొంచెము.

సీ. అడవి కాన యనంగ ♦ నటవికిఁ దగు హవాసు
తోఁట సింగారపుఁ♦దోఁట నంద
వన మనంగను నుప♦వన మొప్పు నడబావి
డిగ్గియ దొరు వన ♦ దీర్ఘిక తగుఁ
బవ్వళింపుబిడారు ♦ పడుకటి ల్లనఁ గేళి
గృహ మగు బోనపు♦టిల్లు వంట
యిల్లు సువారంపు♦టి ల్లనఁ బాకమం
దిరము రాజిలు దగ♦తీర్పు చల్ల
తే. పంది లనఁ జలిపంది ల♦నం దనర్పు
సలిలశాలాభిధలు నీరు♦చల్ల నీరు
మజ్జిగయు జలతక్ర నా♦మములు విసన
కఱ్ఱ వీవన యన వృంత♦క మగు సాంబ. 68

టీ. అడవి (ప్ర. అటవి.), కాన (ప్ర. కాననము.)-౨ అరణ్యము. హవాసుతోఁట, సింగారపుఁదోఁట, నందవనము- 3 ఉద్యానము. నడబావి, డిగ్గియ. రూ. డిగ్గి, దొరువు - 3 దిగుడుబావి. పవ్వళింపుబిడారు, పడకటిల్లు (పడక+ఇల్లు) - ౨ శయనగృహము. బోనపుటిల్లు(బోనము+ఇల్లు)=అన్నము పాకముజేయునట్టి యిల్లు, వంటయిల్లు, సువారంపుటిల్లు (సువారము+ఇల్లు)= వంటకైనయిల్లు-మహానసము-పాకశాల. దగతీర్పు, చల్లపందిలి, చలిపందిలి- 3 పానీయశాల. నీరుచల్ల, నీరుమజ్జిగ-౨ నీటితోఁగూడిన మజ్జిగ. విసనకఱ్ఱ, వీవన - ౨ తాళవృంతము.

క. భువి నీస్థావరవర్గను
సవరణవ్రాసినను వినినఁ • జదివిన యమ్మా
నవులను విద్యామతిపై
భవశాలులఁ గా నొనర్పు • పశుపతి సాంబా. 69

తా. పుడమియందు ఈస్థావరవర్గను చక్కఁగా వ్రాసినవారును, వినిన వారును, చదివినవారును నీయనుగ్రహమువలన విద్య, మతి, కలిమియుఁ గలవా రగునట్లు చేయుము.

స్థావరవర్గ సమాప్తము.

---

## తిర్యగ్వర్గ.

క. శ్రీగౌరీపతి నీపై
బా గౌరీతి రచియింతుఁ • బటుకవితాధా
రాగతిఁ దిర్యగ్వర్గను
వేగమె నిగిడించి ప్రోవవే శ్రీసాంబ. 70

తా. కాంతియుతుఁడవయిన ఓ గౌరీనాయకా! నీకంకితముగా చక్కని శైలిని దిట్టమైన కవిత్వధార మెఱయఁ దిర్యగ్వర్గను వేగిరముగా రచియించెదను. దానిని వేగిరముగాఁ గొనసాగించి కాపాడుము.

సీ. నెఱసరి సింగంబు • తెఱమొగము మెకంబు
మెకములదొర జడ•మెకము బొబ్బ
మెకము వెడఁదనోటి•మెకము గుబ్బలిపట్టి
గుట్టు మేనుంగుల•గొంగ యనఁగఁ
జలఁగు సింహాముపేళ్లు • పులి చాఱలమెకంబు
తెరువుఁగాపరి పసి•తిండిపోతు

ముువ్వన్నెమెక మనఁ ♦ బొలుపొందు వ్యాఘ్రంబు
వాపురము పటాణి ♦ వారువంబు
తే. జిక్కి మావు గుఱ్ఱము తేజి ♦ యెక్కిరింత
తత్తడి రవాలు నడగఁడు ♦ కత్తలాని
తురికి బాబా యనఁగ నొప్పు ♦ దురగమునకుఁ
గొమ్మనఁగఁ దనమెరు శృం♦గమ్ము సాంబ. 71

టీ. నెఱసరి=శౌర్యముగలది, సింగము (ప్ర. సింహము.), తెఱమొగము మెకము=విరివిమోముగల మృగము, మెకములదొర=మృగరాజు, జడమెకము=కేసరములుగలది, బొబ్బమెకము=గొప్పనాదముచేయుమృగము, వెడఁదనోటిమెకము = విశాలముఖము గలమృగము, గుబ్బలిపట్టిగుఱ్ఱము = పర్వతపుత్త్రికి (పార్వతికి) వాహనము, ఏనుఁగులగొంగ = గజశత్రువు–౯ సింహము. పులి, చాఱలమెకము=గీఁతలుగలమృగము, తెరువుగాఁపరి=మార్గమునఁ గాచియుండునది, పసితిండిపోతు = పసులను భక్షించునది, ముువ్వన్నెమెకము=మూఁడువర్ణములు (నలుపు, తెలుపు, పసుపు) గల మృగము – ౫ వ్యాఘ్రము. వాపురము, పటాణి, వారువము. రూ. వార్వము, జిక్కి, మావు, గుఱ్ఱము, తేజి. రూ. తేజీ, ఎక్కిరింత. రూ. ఎకిరింత, తత్తడి, రవాలు, నడగఁడు, కత్తలాని. పా. కత్తళఁడు, తురికి, బాబా–౧౪ అశ్వము. కొమ్ము–౧ శృంగము.

సీ. సిబ్బెమేనిమెకంబు ♦ గబ్బుచెంపమెకంబు
గొప్పయజ్జమెక మె♦క్కుడుమెకంబు
గౌరు చెయ్యిగలమె♦కము రెండుత్రాగు దే
నుఁగు పలుగొమ్ములు ♦ దగినమెకము
హత్తి బత్తులమెకం ♦ బన దంతిపేళ్ళగుఁ
బుట్టకూటిమెకంబు ♦ బొచ్చుమెకము

వెనుచూపుమెక మెల్లు ♦ వెలినోటిమెక మన
భల్లూకనామముల్ ♦ పరఁగు గొరిజ
తే. గొరిసె యన ఖుర మమరును ♦ గోరనంగ
నఖము తగు జోడనలు రవ♦నడలు నడ్డ
వేడెములు పర్వు లనఁ జుట్టు♦వేడెము లనఁ
బంచధారలనామముల్ ♦ పరఁగు సాంబ. 72

టీ. సిబ్బెమేనిమెకము=పొడలుగలమేనితోఁ గూడినమృగము, గబ్బు
కంపుమెకము = మదగంధముగలమృగము, గొప్పయడుగుమెకము=పెద్దపాదము
లుగల మృగము, ఎక్కుడుమెకము=రాజులెక్కుడిమృగము, గారు, చెయ్యి
గలమెకము=తొండముగలమృగము, రెండుత్రాగుడు = రెండుమాఱులుత్రా
గునది-ద్విపము, ఏనుఁగు. రూ. ఏనిక, పలుగొమ్ములు దగినమెకము=పండ్లె
కొమ్ములుగాఁగల మృగము, హత్తి (ప్ర. హస్తి), బత్తలమెకము=గొప్పతల
గలమృగము-౧౩ గజము. పుట్టకూటిమెకము=పుట్టకూటిని (చీమగ్రుడ్లతోఁ
గూడిన పుట్టమంటిని)దినుమృగము, బొచ్చుమెకము=ఒడలినిండుగ వెండ్రుకలు
గల మృగము, వెనుచూపుమెకము, ఎల్లు, వెలినోటిమెకము-౫ ఎలుఁగు
గొడ్డు. గొరిజ, గొరిసె - ౨ గిట్ట-ఖురము. గోరు-నఖము. జోడనలు=ధౌరి
తకములు, రవనడలు=ఆస్కందితములు, అడ్డవేడెములు=రేచితము, పర్వులు=
ప్లుతములు, చుట్టువేడెములు=వల్గితములు-౫ గుఱ్ఱముయొక్క నడకభేదములు.

సీ. పసి గిడ్డి మొద వావు ♦ పసరము తొడు కనఁ
బసువు పేళ్లగు గిబ్బ ♦ బసవఁ డాల
పోతు నాఁబోతు మూఁ♦పురముదా ల్పెద్దు వు
క్కుంటిమా వన వృషా♦ఖ్యలు దనర్చుఁ
గోడె గిత్త యనంగఁ ♦ గొఱలు సుతాఖ్యల
క్రేపు పడ్డయు గూడ ♦ లేఁగ పెయ్య

యన వత్సనామంబు ♦ లలరును నెనుపెంటి
బఱ్ఱె నా మహిషికిఁ ♦ బరఁగు దుంత
తే. దున్న పో తన మహిషమౌ ♦ దొడ్డి తొట్టుఁ
పట్టు లనఁగ గోస్థానముల్ ♦ పరఁగు మంద
కదుపు పదు వనఁ జెలఁగు గో♦గణము పాఁగ
లాయ మన నొప్పు వాజిశా♦లకును సాంబ. 73

టీ. పసి, గిడ్డి, మొదవు, ఆవు, పసరము, తొడుకు-౬ పశువు. గిబ్బ, బసవఁడు, ఆలపోతు, ఆఁబోతు, మూఁపురముదాల్పు, ఎద్దు, ముక్కంటిమావు = శివునివాహనమైనది - ౭ వృషభము. కోడె, గిత్త - ౨ చిన్నయెద్దు-ఉక్షము. క్రేపు, వడ్డ, దూడ, లేఁగ, పెయ్య - ౫ ఆవుదూడ-వత్సము. ఎనుపెంటి (ఎనుము+పెంటి), బఱ్ఱె-౨మహిషి-గేదె. దుంత, దున్న, పోతు - 3మహిషము. దొడ్డి, తొట్టుపట్టు - ౨ పసులకొట్టము. మంద, కదుపు, పదుపు - 3 ఆవులగుంపు. పాఁగ. పా. పాగా, లాయము - 3 అశ్వశాల.

సీ. సింగంబుగొంగ ద♦చ్చియడుగులమెక మ
నఁగ శరభాఖ్య లౌఁ ♦ దగరు జంట
మొగము వేలుపు తేజి ♦ పొట్టేలు గొఱెయపో
తేడిక యన మేష ♦ మెసఁగు నిఱ్ఱి
నులికొమ్ము మెక మన ♦ వెలయుఁ గృష్ణమృగంబు
జింక లే డన మృగి ♦ చెలఁగుఁ బిల్లి
చీలి యనంగ మా♦ర్జాల మౌఁ గుందేలు
చెవులపో తనఁగ రం♦జిలు శశంబు
తే. నొంటె లొట్టిపిట్ట యనఁగ ♦ నుష్ట్ర మమరుఁ
గణితి కణఁ జనఁ దనరు గో♦కర్ణమృగము

పిక్కుమేక మెండ్రిమేఁతరి ♦ నక్క బుద్ధి
మెక మనఁగ జంబుకాఖ్యలు ♦ మెఱయు సాంబ. 74

టీ. సింగపుగొంగ = సింహమునకువిరోధి, దచ్చియడుగులమెకము = ఎనిమిదికాళ్లమృగము—౧ శరభమృగము. తగరు, జంటమొగమువేలుపుతేజీ= రెండుముఖములుగల వేల్పునకు(అగ్నికి)వాహనము, పొట్టేలు, గొఱియపోతు. రూ. గొఱ్ఱెపోతు. ఏడిక - ౫ మేషము. ఇఱ్ఱి, నులికొమ్ముమెకము = మెలికలు దిరిగినకొమ్ములు గలమృగము – ౧ కృష్ణమృగము. జింక, లేడి. రూ. లేటి—౧ ఆఁడుజింక. పిల్లి, చీలి - ౧ మార్జాలము. కుందేలు, చెవులపోతు— ౧ శశము. ఒంటె. రూ. ఒంటియ, లొట్టిపిట్ట. రూ. లొట్టిపిట—లొటిపిట్ట— లొటిపిట. పా. లొట్టియ—లొట్టె—లొట్టెనఁగు—ఉష్ట్రము. కణితి. రూ. కడితి, కణుఁజు. రూ. కడుఁజు-౪ గోకర్ణమృగము. పిక్కుమెకము=వంచన చేయుమృగము, ఎండ్రిమేఁతరి = ఎండ్రకాయలనుదినునది, నక్క, బుద్ధిమెకము— ౪ జంబుకము.

సీ. కొమ్మబెంకిమెకంబు ♦ తిమ్మఁడు వెకిరింత
కోఁతి నాఁ గపివేళ్లు ♦ కొఱలుచుండు
జల్లితోఁకమెకంబు ♦ సవరంపుమెక మనఁ
జమరికిం జనుఁ బంది ♦ చప్పరింత
కొమ్ముకాఁ దూటమె♦కమ్ము వేపులమిత్తి
ముస్తెలమేపరి ♦ మోటుమెకము
వాలుమెకంబు రో♦బంటరి యొంటరి
ముట్టెమెకము పీఁట♦వెట్టుమెకము
తే. ఏకలము గుర్గురిం తన ♦ నెసఁగు దంష్ట్రి
పొడమెకము దుప్పి యనఁ బొలు♦పడరు రామ
మృగము మనుఁబోతనఁగ బుర్య♦మృగము దనరు
బల్లి గౌళిన ముసలికిఁ ♦ బరఁగు సాంబ. 75

టీ. కొమ్మలెంకి మెకము=చెట్లకొమ్మలె యునికిపట్టుగాఁగల మృగము-శాఖామృగము, తిమ్మఁడు, వెకిరింత=తన్నెచ్చరించువారిని వెక్కిరించునది, కోఁతి. రూ. క్రోఁతి - ౫ వానరము. జల్లితోఁకమెకము=పలుచనివెండ్రుకలు తోఁకయందుఁ గలమృగము, సవరంపుమెకము=సవరములకైనమృగము-౨ చమరమృగము. పంది, చప్పరింత=చప్పరించితినునది, కొమ్ముకాఁడు=కొమ్ము గలది, ఊఁటమెకము=దృఢమైనమృగము, వేపులమిత్తి = కుక్కలకుశత్రువు, ముస్తెలమేపరి = తుంగగడ్డలనుదినునది, మోటుమెకము=*మోటుపయోగింపఁబడుమృగము, వాలుమెకము=క్రూరమైనమృగము, లోబంటరి, ఒంటరి, ముట్టె మెకము = ముట్టెగలమృగము, పీఁటవెట్టుమెకము=పల్లముత్రవ్వికూర్చుండు మృగము. ఏకలము, గుర్గురింత=గుఱగుఱయని చప్పుడుచేయునది-౧౪ అడవి పంది-వరాహము. పొడమెకము, దుప్పి - ౨ రామమృగము. మనుఁబోతు-౧ ఋశ్యమృగము. బల్లి, గౌళి - ౨ బల్లి.

సీ. తోఁడేలు గొఱియల♦సూడన వృక మొప్పు
 ముఱిఁగిస వెంట్రువ ♦ ముంగి యనఁగ
 బభ్రువు తగుఁ గొక్కు ♦ పందికొక్కన మూషి
 కకుఁ బొల్చు గాడిద ♦ గాలిగాఁడు
 చలువగుఱ్ఱము తేపు♦జక్కి యన ఖరాఖ్య
 లగు మొఱఁగుడు జాగి♦లమ్ము గుక్క
 వేపి నా శునకంబు ♦ వెలయును దొండ యూ
 సరవెల్లి యనఁ దగు ♦ సరటమునకుఁ
తే. జిట్టెలుక యన బొలమూ♦షికకుఁ బొల్చు
 నుడుము తేళ్లమేపరి యన ♦ నొనరు చుండు

*మోటు-అనఁగా పందికెదుట మనుష్యాకారముగా నిలిపిన కపట లక్ష్యము.

నవని గౌధేరనామధే•యములు మహిత
సకలసురచక్రవర్తి శ్రీ•సాంబమూర్తి. 76

టీ. తోఁడేలు, గొఱియలసూడు = గొఱ్ఱెలకు శత్రువు - ౨ వృకము. ముంగిస, వెంట్రువ, ముంగి - ౩ నకులము. కొక్కు, పందికొక్కు - ౨ మూషికము. గాడిద, గాలిగాఁడు, చలువగుఱ్ఱము=చాకలి చలువచేసినబట్టలు మోయువాహనము, ఓవుజక్కి = చాకిరేవునందుండుగుఱ్ఱము - ౫ ఖరము. మొఱుఁగుఁడు, జాగిలము, కుక్క, వేపి - ౪ శునకము. తొండ, ఊసరవెల్లి- ౨ సరట. చిట్టెలుక (చిఱు+ఎలుక)=చిన్న ఎలుక-౧ చుంచు. ఉడుము, తేళ్ళమేఁపరి - ౨ ఉసుము - గౌధేరము.

సీ. తంతువాయ మగుఁ బా•దట్టుపురుగు సన్న
పిల్లి సాలీఁ డన • రాళ్ళరాసి
గాఁడు గరిమిడిమొ•ల్క యన నాఖువు దగు
నెలుకలు చట్టుపల్ • గఱులు తెక్క
లనఁ బక్షములు పొల్చు • లావు లీఁక లనంగఁ
బర్ణంబు తగు గువ్వ • పక్కి పిట్ట
పులుఁ గనఁ బక్షికి • వెలయు మదికొలంకు
పులుఁగు తెల్లనిపిట్ట • నలువతేజి
తే. పాలు నీరును వెలినేయు•పక్కి యంచ
యన మరాళంబు తగుఁ గెంపు•కనులపుల్లు
తలిరుమేఁతరి సాఁకుడు•పులుఁగు మావి
కొమ్మయిలుపుల్లు కోవెల • కోయి లనఁగఁ
బరభృతమునామధేయముల్ • పరఁగు సాంబ. 77

టీ. పాదట్టుపురుగు. రూ. పాదొట్టుపురుగు = ఇండ్లలోపలి వాసములకు పట్టెలకు పట్టెడుబూసిని గలిగించుపురుగు. సన్నపిల్లి. సాలీఁడు-౪ సాలె

పురుగు. ఆళ్ళరాసిగాఁడు, గరిమిడియెలుక-గొప్పయెలుక. ఎఱకలు, చట్టుపలు, గఱులు, ఱెక్కలు - ౪ పక్షములు. లావులు, ఈఁకలు_౩ఈఁకలు-పర్ణములు. గువ్వ, పక్కి (ప్ర. పక్షి.), పిట్ట, పులుఁగు-౪ పక్షి. మదికొలఁకుపులుఁగు = మానససరస్సునందలిపక్షి, తెల్లనిపిట్ట= తెల్లవర్ణముగలపక్షి, . నలువతేజి=బ్రహ్మవాహనము, పాలునీరునువెలిసేయుపక్కి, అంచ-౫ హంసము. కెంపుకనులపుల్గు = ఎఱ్ఱనికన్నులుగలపిట్ట, తలిరుమేఁతరి=చిగుళ్లు . తినునది, సాఁకుడుపులుఁగు=ఇతరులచే-కాకులచే సాఁకఁబడుపక్షి-పరభృతము. మావి...పుల్గు=మామిడికొమ్మయందు వసించుపిట్ట, కోవెల, కోయిల-౬ కోకిలపక్షి.

సీ. పచ్చఱెక్కలపుల్గు ♦ పచ్చవిల్తునితేజి
పలుకులపులుఁగు నాఁ ♦ జిలుక చిల్క
యనఁగ శుకాభిఖ్య ♦ లగు బట్టికాఁడు గో
ర్వంక గోరింక గో♦రంక యనఁగ
శారికాహ్వయము లె♦సంగు నట్టువపిట్ట
నెమ్మి జొట్టుఁబులుఁగు ♦ నెమిలి నమిలి
పురివిప్పియాడెడి♦పులుఁగు కన్నులుగల
పులుఁ గన బర్హికి ♦ వెలయుచుండు
తే. జంటపిట్ట బటువుగువ్వ ♦ జక్కవ యనఁ
గోకనామంబు లగు మంచు♦గ్రోలుపుల్గు
నిప్పులను మ్రింగుపులుఁగు వె♦న్నెలవులుఁ గన
నమరును జకోరనామధే♦యములు సాంబ. 78

టీ. పచ్చఱెక్కలపులుఁగు=ఆకుపచ్చనిఱెక్కలుగలపిట్ట, పచ్చవిల్తునితేజి=మన్మథునివాహనము, పలుకులపులుఁగు=మాటాడుపక్షి, చిలుక, చిల్క-౫ శుకము. బట్టికాఁడు, గోర్వంక. రూ. గోరువంక, గోరింక, గోరంక-౫శారిక. నట్టువపిట్ట=నాట్యమాడుపక్షి, నెమ్మి, జొట్టుఁబులుఁగు=జొట్టుగలపక్షి-

శిఖి, నెమలి. రూ. నెమిలి, నమిలి, పురివిప్పియాడెడిపులుఁగు=పింఛము విచ్చి యాడుపక్షి, కన్నులు గలపులుఁగు=నయనమువంటి యాకృతిగల పురిగల పక్షి - 8 మయూరము. జంటపిట్ట=ఆలుమగలు గలిసియుండుపక్షి, బటువు గువ్వ=గుండ్రనిపక్షి, జక్కవ - 3 చక్రవాకము. మంచుగ్రోలుపులుఁగు = మంచుపానముచేయుపక్షి, నిప్పులను మ్రింగుపులుఁగు, వెన్నెలపులుఁగు - 3 చకోరపక్షి.

సీ. విరితేనెత్రావుడు • మరునల్లె బమిపుర్వు
 తుమ్మెద తేఁటి ము•ద్దుగలకాళ్ల
పురు గన భ్రమరంబు • పొలుచు లకోరీలు
 బకదారు లొడ్డీలు • పల్లటీలు
పావురములు నేల•పల్లటీల్ కూకీలు
 పావురా లంతర•పల్లటీలు
సురటీ లనంగఁ బొ•ల్చును గలరవములు
 కొక్కెర కొంచయుఁ • గొక్కెరాయి
తే. యనఁగ క్రౌంచాఖ్య లగుఁ గొంగ • యన బకంబు
 జాలె జలకట్టె యణుజు వే•సడము లగుడు
 జావడము వారణము బైరి • సాళువంబు
 కనిసెరము చెంచడము డేగ • యనఁగఁ దనరు
 శ్యేనమునకు మునీశ్వరా•ధీన సాంబ. 79

టీ. విరితేనెత్రావుడు=పూవులతేనెను పానముచేయునది, మరునల్లె= మన్మథుని కల్లెత్రాటివంటిది, బమిపుర్వు, తుమ్మెద, తేఁటి, ముద్దుగలకాళ్ళపురుగు=మూఁడుజంటల (ఆఱు) కాళ్ళపురుగు - షట్పదము-ఽ భ్రమరము. లకోరీలు, బకదారులు, ఒడ్డీలు, పల్లటీలు, పావురములు, నేలపల్లటీలు, కూకీలు,

పావురాలు, అంతరపల్లటీలు, సురటీలు - ౧౦ కపోతములు. కొక్కెర, కొంచ, కొక్కెరాయి-౩ క్రౌంచపక్షి. కొంగ - ౧ బకము. జాలె. రూ. జాలియ, జలకట్టె. రూ. జలకట్టియ. పా. సెలకట్టె, అణుజు. రూ. అడుజు, వేసడము, లగుడు, జాపడము, వారణము, బైరి. రూ. బయిరి, సాళువము. రూ. సాళ్వము, కనిసెరము, చెంచడము, డేగ - ౧౮ శ్యేనభేదములు.

సీ. కరువలిమేఁతరి ♦ కంటివిన్కూరి పాము
పుట్టకాఁపరి త్రాఁచు ♦ చుట్టుపురుఁగు
విసముతాలుపు చిల్వ ♦ బుసపుర్వు నా భోగి
వెలయుఁ జిలువఱేఁడు ♦ వెన్నుపాన్పు
తడవులనిడుపఁడు ♦ తరిగట్టుత్రాఁ డన
నహిపతి కగు నజ్జ♦యలుఁగువులుఁగు
కోడి పుం జన నొప్పుఁ ♦ గుక్కుటనామముల్
గుడ్లగూబ పగటి♦గ్రుడ్డి గూబ
తే. యనఁగ ఘూకాభిధానంబు ♦ లగు లకుముకి
మీనవల్లంకి పొదలిక ♦ మీలగొంగ
యనఁగఁ జను వర్తితకుఁ బేరు ♦ లమరు దివ్వె
యార్పు మిడు తన శలభాఖ్య ♦ లమరు సాంబ. 80

టీ. కరువలిమేఁతరి = గాలిని భక్షించునది, కంటివిన్కూరి = చక్షుశ్శ్రవము, పాము, పుట్టకాఁపరి=పుట్టయందు వాసముచేయునది, త్రాఁచు, చుట్టుపురుగు = చుట్టుకొని యుండుకీటము, విసముతాలుపు = విషముధరించునది, చిల్వ. రూ. చిలువ, బుసపుర్వు=బుసకొట్టుపురుగు-౧౦పాము-సర్పము. చిలువఱేఁడు=పాములకు ఱేఁడు, వెన్నుపాన్పు=విష్ణువునకు శయనమైనవాఁడు. తడవులనిడుపఁడు = చిరకాలము జీవించియుండువాఁడు, తరిగట్టుత్రాఁడు = మంథరపర్వతమునకుఁ గవ్వపుఁద్రాడయినది - ౪ఆదిశేషుఁడు. అజ్జయలుఁగు

**పులుఁగు = చరణాయుధము, కోడి, పుంజు - ౩ కుక్కుటము. గుడ్లగూబ, పగటిగ్రుడ్డి = దివాంధము, గూబ - ౩ ఘూకము. లకుముకి, మీనవల్లంకి, పొదలిక, మీలగ్రొంగ = చేఁపలకువైరి- ౩ పిచ్ఛుక. దివ్వెయార్చు=దీపము చల్లార్చునది, మిడుత - ౨ శలభము.**

సీ. కాటుకపిట్ట కూఁ♦కటిగువ్వ యేట్రింత
పులుఁగులగదుమరి ♦ పోలిగాఁడు
నాఁగ భరద్వాజ♦నామముల్ తగు గబ్బి
లము గబ్బిడా గబ్బి♦లాయి చీకు
రా యనంగనుఁ దైల♦పాయి కాఖ్యలు చెల్లు
మ్రానుదొలుచుపిట్ట ♦ మ్రానుపోటు
వనఁగ దార్వాఘాట♦మున కగు బెగ్గుర
మన సారసమ్మున ♦ కలరు నీరు
తే. కట్టె నీరుపా మన నల♦గర్ద మలరుఁ
బుడమిచెవి పాములబిడారు ♦ పుట్ట యనఁగ
మించు వల్మీకనామముల్ ♦ మెట్టు తాప
మెట్టిక యన సోపానాఖ్య ♦ మెఱయు సాంబ. 81

**టీ: కాటుకపిట్ట, కూఁకటిగువ్వ, ఏట్రింత, పులుఁగులగదుమరి=పక్షులను సంహరించునది, పోలిగాఁడు. రూ. పోలఁడు-౬ భరద్వాజపక్షి. గబ్బిలము. రూ. గబ్బిడము, గబ్బిడా. రూ. గబ్బిలా, గబ్బిడాయి. రూ. గబ్బిలాయి, చీకురా. రూ. చీకురువాయి-౮ తైలపాయిక. మ్రానుదొలుచుపిట్ట, మ్రానుపోటువు-౨ వడ్రంగిపిట్ట. బెగ్గురము - ౧ సారసపక్షి. నీరుకట్టె, నీరుపాము-౨ నీటిలో వసించుపాము-అలగర్దము. పుడమిచెవి=భూమికర్ణము, పాములబిడారు = సర్పగృహము, పుట్ట - ౩ వల్మీకము. మెట్టు, తాప, మెట్టిక. రూ. మెటిక - ౩ సోపానము.**

సీ. గుమికాఁడు కాకి నాఁ • గొఱలుఁ గాకము పేళ్లు
గ్రద్ద యనంగ గృ • ధ్రంబు వెలయు
జరగు గుబ్బిలికాఁడు • సకినాలు వెలయించు
పక్కి పగటిచీకు • పైఁడికంటి
యనఁ గనకాక్షికి • దనరు జవాది జ
వ్వాజి యనఁగ సాంక • వము దనర్చు
కస్తూరి పీణెయుఁ • గస్తురి యనఁ బొల్చు
మృగనాభి చట్టపు • మెకము పునుఁగుఁ
తే. బిల్లి యొత్తెడుపిల్లి నాఁ • బేళ్లు వెలయు
గంధిలమునకుఁ జాతకా • ఖ్యలు దనర్చు
వానకోయిల మబ్బునీ • రానుపిట్ట
యనఁగఁ గైలాసశైలవి • హార సాంబ. 82

టీ. గుమికాఁడు=కూటముచేర్చునది, కాకి - ౨ వాయసము. గ్రద్ది. రూ. గద్ద - ౧ గృధ్రము. గుబ్బిలికాఁడు. రూ. గుబ్బిలి, సకినాలు... పక్కి=శకునములను దెలుపుపక్షి, పగటిచీకు=పగలుకన్నులుదెలియనిది, పైఁడి కంటి = బంగరువంటికన్నులుగలది-౫ కనకాక్షి. జవాది. రూ. జవ్వాది-జవ్వాదు, జవ్వాజి. రూ. జవాజి - ౫ సంకుమదము - ఒకసుగంధద్రవ్యము. కస్తూరి, పీణె. రూ. పీణియ, కస్తురి-౪ మృగమదము-ఒకదినుసు సుగంధద్రవ్యము. చట్టపుమెకము-పునుఁగుచట్టముగల మృగము, పునుఁగుఁబిల్లి (పునుఁగు+పిల్లి), ఒత్తెడుపిల్లి-3 ఒకజాతిపిల్లి. వానకోయిల, మబ్బునీరానుపిట్ట= మేఘజలమును ద్రావెడుపక్షి - ౨ చాతకపక్షి.

సీ. పొడకోడి కానపుం • జడవిపుం జన వన
కుక్కుటం బగు బొల్లి • కోడి నీరు

కోడి యనఁగ జల•కుక్కుటంబు దలిర్చు
పిట్ట పిచ్చిక యూరఁ•బిచ్చిక యనఁ
దగుఁ జటకమున కౌ • దాఁటరి చలికాపు
కప్ప యనఁగ భేక • మొప్పు జలగ
నల్లత్రాగు డన రా•జిల్లు జలూకము
మొగటిపురువు గోడ•పురువు నల్లి
తే. నాఁగ మత్కుణ మగు నీవ • యీఁగ యనఁగ
మక్షికకు నొప్పు ములుపుర్వు • మంటితిండి
తే లనఁగ వృశ్చికంబు వ•ర్తిల్లు ఓచ్చు
పురుగు దోమ యన మశకంబు • పరఁగు సాంబ. 83

టీ. పొడకోడి, కానపుంజు, అడవిపుంజు-౩ వనకుక్కుటము. బొల్లికోడి, నీరుకోడి-౨ నీటియందు వసించుకుక్కుటము. పిట్ట, పిచ్చిక, ఊరఁబిచ్చిక (ఊరన్+పిచ్చిక) - ౩ ఒకదినుసుపిట్ట-చటకము. దాఁటరి=దుముకునది, చలికాపు-వర్షాకాలమునఁ జలికిఁ బుట్టునది, కప్ప - ౩ మండూకము. జలగ, నల్లత్రాగుడు-రక్తపానము చేయునది-౨ జలూకము. మొగటిపురువు-గోడపురువు = గోడయందుఁ బ్రాఁకునట్టిపురుగు, నల్లి - ౩ మత్కుణము. ఈఁగ, ఈవ - ౨ మక్షిక. ములుపుర్వు=కొండిగలపురుగు, మంటితిండి=మన్ను భక్షించునది, తేలు - ౩ వృశ్చికము. ఓచ్చుపురుగు=అడుసుమీఁద వాలుపురుగు, దోమ - ౨ మశకము.

ప్రీతిని భవదంకిత మౌ
నీతిర్యగ్వర్గ జగము • లెన్నఁగ లోకా
తీతం బై పూతం బై
ఖ్యాతం బై ధరను వెలయుఁ • గోవృత సాంబా. 84

తా. ఓ సాంబమూర్తీ! నేను భక్తితో నీకంకితముగా నొనర్చిన యీ తిర్యగ్వర్గు లోకులందఱు గొనియాడునట్లు మిక్కిలి ప్రసిద్ధమయి పావనమై లోకాతీతమై పుడమియందు వెలుఁగును గాక.

తిర్యగ్వర్గు సమాప్తము.

---

## నా నా ర్థ వ ర్గు.

క. శ్రీనాయకసాయక వా
ణీనాయకముఖ్యవినుత ♦ నీపేరిట నే
నానార్థవర్గుఁ జేసెద
నానార్థము లొసఁగి ప్రోవు ♦ ననుఁ గృప సాంబా. 85

తా. త్రిపురసంహారసమయంబున విష్ణువును దూపునుగాఁ జేసికొన్న వాఁడా! బ్రహ్మాదిదేవతలచేఁ బొగడఁబడువాఁడా! నీకంకితముగా నానార్థ వర్గును రచించెదను. నీవు నాకన్నిసంపదల నొసఁగి కాపాడుము.

సీ. గుణమున కాటుకుఁ ♦ గోవు నా విలసిల్లు
గోతికి శాఖ కౌఁ ♦ గొమ్మ యనఁగ
శకలంబునకును మాటకు బలు కన మించు
నిసువును గోవు నాఁ ♦ బసి యనంగఁ
గటికిఁ బై పూరికిఁ ♦ గప్పనఁ జెన్నొందుఁ
గొట్టుకుఁ గడమ కౌఁ ♦ గొఱఁత యనఁగ
మగగుఱ్ఱమునకు గుల్మమున కౌ గుం డన
నెలకు జాబిల్లి కౌ ♦ నెల యనంగ
తే. నూటకును జేవకుఁ దనర్చు ♦ నూట యనఁగ
వేఁడుటకుఁ గాఁకకుఁ దలిర్చు ♦ వేఁడి యనఁగ

సంకమునకు బిడ్డకును గం ♦ దనఁగఁ బరఁగు
లలితమునిమానసాబ్జరో♦లంబ సాంబ. 86

టీ. 1 కోపు=అల్లెత్రాడు, ఆట. 2 కొమ్మ = ఆఁడుది, చెట్టుకొమ్మ. 3 పలుకు=తునుక, మాట. 4 పసి=బాలుఁడు, పసరము. 5 కప్పు = నల్లన, ఇంటిపైకప్పు. 6 కొఱఁత=కొఱ్ఱు, తక్కువ. 7 గుండు-మగగుఱ్ఱము, గుల్లము. 8 నెల=మాసము(30 దినములు.), చంద్రుఁడు. 9 ఊట=బలము, నీటియూట. 10 వేఁడి (వేఁడుధాతువు-క్త్వార్థకము)=వేఁడుకొని యనుట, ఉష్ణము. 11 కందు=కళంకము, బిడ్డఁడు.

సీ. ఈఁతచెట్టును లోఁతు ♦ నీఁత యనఁ జెలంగు
నజ్జకుఁ గ్రింది కౌ ♦ నడు గనంగ
మాల్మికి నడత కి ♦ మ్మగు నలవా టన
నమ్మకు నవ్వ కౌ ♦ నవ్వ యనఁగ
గొడుగును మఱునాఁడు ♦ నలరు నెల్లి యనంగ
నెట్టుకుఁ దిండి కౌ ♦ నెర యనంగ
విరికి నొప్పుటకును ♦ వెలయు నల రనంగఁ
బేరును దండ యాఁ ♦ బే రనంగ
తే. నది యనుటకు భంగమున కౌ ♦ నల యనంగ
నాత్రమునకు వృత్తమున కౌ ♦ నక్కఱ య
నాలమునకుఁ బలుకుట కౌ ♦ నని యనంగ
నంబరధునీలసజ్జటా♦డంబ సాంబ. 87

టీ. 1 ఈఁత=ఈఁతచెట్టు(ఇది సమాసపదముయొక్క యొకభాగము, దీనికి ప్రాతిపదికము.), నీటియందుఈఁదుట. 2 అడుగు=పాదము, క్రిందిభాగము. 3 అలవాటు=మాలిమి, స్వభావము. 4 అవ్వ=తల్లి, తాతతల్లి, తల్లితల్లి.

5 ఎల్లి = గొడుగు, మఱునాఁడు-రేపు అనుట. 6 ఎఱ (శకటరేఫము)= ఎఱుపు, ఎర (లఘురేఫము)=ఆహారము. 7 అలరు=పుష్పము (నామము.), ఒప్పు (క్రియ.). 8 పేరు=దండ, నామధేయము. 9 అల=ఆయనుట (విశ), తరంగము. 10 అక్కఱ=ఆత్రము (అలఘురేఫము), అక్కర యను నొక వృత్తము (లఘురేఫము.). 11 అని=(అనుధాతువు క్త్వార్థకము. అవ్య.) చెప్పి యనుట, యుద్ధము నామము.

సీ. ములికికిఁ జెఱువుకో♦పునకు న ల్గనఁ బొల్చు
    నైదును దాను నే♦నన రహించుఁ
జెవిసొమ్మునకును దం♦తువుకుఁ బోఁ గనఁ జెల్లుఁ
    బురిటికి సాటికిఁ♦బురు డనఁ దగు
నడవికిఁ జూడమి♦కగుఁ గాన యనఁ బొల్చు
    గల్లును ఱాయియుఁ♦గ ల్లనంగఁ
గంచుకొమ్మునకు శృం♦గమున కొఁ గొ మ్మనఁ
    బాఁచికి దొంగ కొ♦సాఁ చనంగఁ
తే. గరువలికి దయ్యమునకు నొ♦గాలి యనఁగ
ఘటికయును దల్పుమల్కునొ♦గడియ యనఁగ
నూటికిని మర్దనమున కొ♦నూ అనంగ
జటులదైతేయమదశైల♦శంబ సాంబ. 88

టీ. 1 అల్గు. రూ. అలుఁగు=బాణము, చెఱువుకట్టయొక్క కొనభాగము. 2 ఏను=ఐదు, 'నేను' అనుదానికి రూపాంతరము. 3 బోఁగు=కర్ణభూషణము, దారము. 4 పురుడు=ఆశౌచము (జాతము), సమానము. 5 కాన= అడవి, కనుధాతువు తుమున్నర్థకము (చూచుటకు అనుట). 6 కల్లు= ఱాయి, మద్యము. 7 కొమ్ము=కంచుతోఁ జేయఁబడినయొక వాద్యవిశేషము, శృంగము. 8 సాఁచు=పాఁచి, దొంగ. 9 గాలి=గాడ్పు, దయ్యము. 10 గడి

య=ఘటిక (24 నిమిషములకాలము), తలుపుగొళ్లెము. 11 నూఱు=పదిపదులు (నామము.), బండమీఁద నొకవస్తువును రాచుట.

సీ. కడుపుగడ్డయుఁ దూము ♦ నడరు బల్ల యనంగ
విఱివికి శయ్య కౌఁ ♦ బఱ పనంగఁ
గౌముదికిని మ్రొక్కు ♦ కగు వెన్నెల యనంగఁ
బగలును గంటు నౌఁ ♦ బగ లనంగ
నంగళ్ల నొకపోఁగు ♦ నగును బేఁట యనఁగ
నెమలికి మైత్రి కౌ ♦ నెమ్మి యనఁగఁ
బసుపుతావికి వీథి ♦ కెసఁగు వాడ యనఁగఁ
జలికిని గాలి కౌ ♦ వలి యనంగఁ
తే. బట్టునకుఁ గొ మ్మనుటకు నౌఁ ♦ బ ట్టనంగ
భేదమునకు మూలమున కౌ ♦ వే ఱనంగ
ఫలమునకు వృద్ధునకుఁ దగుఁ ♦ బం డనంగ
దాసహృదయకాసారకా♦దంబ సాంబ. 89

**టీ.** 1 బల్ల = కడుపులోనిగడ్డ, తూము. 2 పఱపు (పఱచుధాతువు కృదంతము)=పాన్పు, వైశాల్యము. 3 వెన్నెల=జ్యోత్స్న-చంద్రునికాంతి, నమస్కారము. 4 పగలు(ఏకవచనము-పగ)=విరోధములు, దినము (ఈయర్థంబున. 'పగలు'అనునదే ఏకవచనము.) 5 పేఁట=అంగళ్లవరుస, ఒకనూలిపోఁగు. 6 నెమ్మి=నెమిలి, స్నేహము. 7 వాడ=పసుపువాసన, వీథి. 8 వలి=చలి, గాలి. 9 పట్టు=పట్టువస్త్రము, పూనిక, తీసికొనుము అనుట (ఈయర్థమున విది క్రియ). 10 వేఱు (అలఘురేఫము)=భేదము, వేరు(లఘురేఫము)=చెట్టువేరు. 11 పండు=ఫలము, ముసలివాఁడు.

సీ. సాముకూటమునకు ♦ సరస కౌ గరిడి నా
సౌరును ములికి యాఁ ♦ దీ రనంగఁ

హాయశాలకును బాగ ♦ కమరుఁ బాగా యన
మావి కామ్రమున కౌ ♦ మావి యనఁగఁ
గాహాళి కొకచెట్టు ♦ కలరు బూరుగు యన
జడితికి విరతి కౌ ♦ వడి యనంగ
హొన్నున కుపకృతి ♦ కొనరు మేల్మి యనంగ
మురువును సొగసు నౌ ♦ మురు వనంగ
తే. గళుకునకుఁ గంపకోట కౌ ♦ వెలుఁ గనంగ
మాను మనుటయుఁ దరువు నౌ ♦ మా ననంగఁ
జేవడికిఁ బోలిక కెసంగుఁ ♦ గైవడి యన
డమరుశూలపాశాంకుశా♦డంబ సాంబ. 90

టీ. 1 గరిడి=సాముచేయుచోటు, సమీపము. 2 తీరు=కాంతి, బాణము-ములికి. 3 పాగా=లాయము, తలగుడ్డ. 4 మావి=గుఱ్ఱము, మామిడి చెట్టు. 5 బూరుగ=శాల్మలీవృక్షము (బూరగ), వాద్యభేదము. 6 వడి=వేగము, పద్యమందలియతి. 7 మేలిమి (మేల్మి)=బంగారము, ఉపకారము. 8 మురువు (మురుగు)=చేతికడియము, అందము. 9 వెలుఁగు=ప్రకాశము, వెలుగు=పశువులు రాకుండుటకై చేలచుట్టునాఁటుకంప (ఈయర్థమున అరసున్న లేదు). 10 మాను=విడుచు (క్రియ.), చెట్టు (నామము.). 11 కైవడి=చేతియొరపడి (సమస్తనామపదము), పోలిక (అవ్యయము).

సీ. ఘూకంబునకుఁ జెవి♦గూబ కౌ గూబన
శిశువును బులియు నౌఁ ♦ జిఱుత యనఁగ
సంధ్యవార్చుటకు సం♦జకు సందె యనఁ బోల్చుఁ
బత్తియుఁ దరువు నౌఁ ♦ బాల యనఁగ
నొకమ్రాకునకు వాతె♦ఱకు మోవి యనఁ జెల్లు
రిక్కయు బొట్టు నౌఁ ♦ జుక్క యనఁగఁ

గూరకు శ్వాసాన•కుఁ జెలంగు నూర్పన
హెచ్చు నెక్కుటయు నౌ ♦ నెక్కు డనఁగఁ
తే. గుచమునకుఁ దల్పుచీలకు ♦ గుబ్బ యనఁగఁ
బక్కకును గుణపమున కౌ ♦ బడు గనంగ
దళసరికిఁ బర్ణమునకు నౌ ♦ దళ మనంగ
శంబరాంకకపర్దావ•లంబ సాంబ. 91

టీ. 1 గూబ=గుడ్లగూబ, చెవిలోపలిరంధ్రము. 2 చిఱుత=బిడ్డ, పులి. 3 సందె=సంధ్యావందనము, సంధ్యాకాలము. 4 పాల=పాలపక్షి, పాలచెట్టు, క్షీరికవృక్షము. 5 మోవి=వృక్షవిశేషము, పెదవి. 6 చుక్క=నక్షత్రము, తిలకము. 7 ఊర్పు=శాకము, ఊపిరి. 8 ఎక్కుడు=అధికము, ఎక్కుట. 9 గుబ్బ=స్తనము, తలుపుచీల. 10 బడుగు=చిక్కినవాఁడు, పీనుఁగు. 11 దళము (దేశ్యము)=దట్టమైనది, (సంస్కృతము) ఆకు.

సీ. లేపన మెత్తకు ♦ లేపుటకుఁ దనర్పు
డా లనఁగాఁ గాంతి ♦ డాలుఁ బరఁగు
నా డనఁ దగు నాది•నమునకు సీమకు
మించన జడలకు ♦ మీఱుట కగు
మోడి నా నల్కకుఁ ♦ బైఁడితున్కకుఁ జెల్లు
బా రన బార యీ•రాలు నొనరు
దండ నాఁ జెంతకు ♦ దామంబున కెసంగు
సరి యన దండకు ♦ సమమున కగుఁ
తే. దోర మనఁగను స్థూలము ♦ నోముదార
మమరు నా జీత్తిగయును నూఁ•గారునగును
గ్రుడ్డనఁగ నండమున కంధ•కునకుఁ బొసఁగు
వంబరతరంగిణీజటా•డంబ సాంబ. 92

టీ. 1 లేపు=పాన్పు (నామము.), లేపుట(క్రియ). 2 డాలు=కాంతి కెంకెక్కము. 3 నాఁడు=ఆదినము (అరసున్నయున్నది.), నాడు=దేశము (అరసున్నలేదు.). 4 మించు = మెఱుపుఁదీఁగె (నామము), మీఱుట (క్రియ). 5 మోడి=కోపము, బంగారుతునుక. 6 బారు=చాఁచినరెండుచేతులపొడువు, పంక్తి 7 దండ = సమీపము, పూవులదండ. 8 సరి = దండ, సాటి 9 తోరము=లావయినది-నోముదారము. 10 ఆఱు = ఒకసంఖ్య - ఐదునొక్కటి, రోమావళి. (ఈయర్థమున ఆరు అని రూపము.) 11 గ్రుడ్డు = అండము-గుడ్డివాఁడు.

సీ. కొప్పనంగను వింటి♦కొనకును గబరి కొ
నెన్ను నా నెన్నున ♦ కెన్నుట కగు
న బ్బనంగను చంద్రి ♦ కగపడమికిఁ జెల్లు
నప్ప యనఁగఁ దండ్రి ♦ కక్క కమరుఁ
గలు పన మడిలోని♦కసవును బెరుఁగు నొ
బా సన నానకు ♦ భాష కలరు
డ బ్బన గవ్వకు ♦ డంబంబునకుఁ బొల్చు
మే లన మరులకు ♦ మెచ్చున కగుఁ
తే. బా లగును తీరమునకును ♦ భాగ్యమునకుఁ
గమ్మ యనఁ బత్త్రికకుఁ జెవి♦కమ్మ కెనయుఁ
బాప యన బిడ్డకును గను♦బాప కెనయుఁ
దాపసోత్తమవినుతిక♦దంబ సాంబ. 93

టీ. 1 కొప్పు=వింటికొన, స్త్రీలకొప్పు. 2 ఎన్ను=కంకి (నామము), తలంచు (క్రియ). 3 అబ్బ=తండ్రి(కళ), దొరకఁగా(ద్రుతాంతము-అబ్బన్ అని రూపము.), 4 అప్ప=తండ్రి, అక్క. 5 కలుపు = చేనిలోనికసవు, పెరుఁగు. 6 బాస=భాష, ప్రమాణము. 7 డబ్బు = డంబము, ధనము, గవ్వ.

8 మేలు=కోరిక, మెచ్చుకొనుట. 9 పాలు=క్షీరము, భాగము. 10 కమ్మ=చెవిసొమ్ము, జాబు. 11 పాప=బిడ్డఁడు, కంటిపాప.

సీ. పెర యనఁగాఁ దేనె♦పెరకు వింతకుఁ బొల్చు
మెఱుఁ గనఁ గాంతికి ♦ మించున కగు
బండ నాఁ దిట్టుకుఁ ♦ బలుగుబాతికిఁ జెల్లు
బంతి నాఁ జెండును ♦ బంక్తియు నగుఁ
బెరుఁ గన దధికిని ♦ వృద్ధికిఁ దనరారు
వేఁట నా గోటియకు ♦ వేఁట కమరు
వెలి యన బయటికి ♦ వెల్లనకుఁ దనర్చు
వీడన వదలును ♦ వీడు నలరు

తే. మ బ్బనఁగ మందుసొక్కును ♦ మబ్బును నగు
బులు గనఁగ లాంఛనమునకుఁ ♦ బులుఁగు కొదవ
నా లనఁగ గోవులకు భార్య ♦ కతిశయిల్లు
శంబరాహితమదభిదా♦డంబ సాంబ. 94

టీ. 1 పెర (ల. రే.) = తేనెతెట్టె, పెఱ (అల. రే.)=అన్యుఁడు. 2 మెఱుఁగు=కాంతి, మెఱుపు. 3 బండ=తిట్టు, పలుగుబాయి. 4 బంతి = చెండు, వరుస. 5 పెరుఁగు = దధి (అరసున్న), వృద్ధియగు (అరసున్నలేదు క్రియ). 6 వేఁట=వేఁటాడుట, గొఱ్ఱె. 7 వెలి=బయలు, తెలుపు. 8 వీడు =వదలు (క్రియ), పట్టణము (నామ.). 9 మబ్బు = మందుసొక్కు, మేఘము. 10 పులుఁగు=పక్షి, గుఱుతు (అరసున్నలేదు). 11 ఆలు=గోవులు (బహువచనము), భార్య (ఏకవచనము).

సీ. గురు వన నొజ్జకుఁ ♦ బరువునకుఁ జెలంగు
నారి నా యల్లెకు ♦ నాతి కైనయు

నూరనఁ బల్లెకు ♦ నూరువునకుఁ బోల్పఁ
దమి యన రాత్రికిఁ ♦ దమికి నమరుఁ
గరి యన దంతికిఁ ♦ గప్పునకుఁ దనర్పఁ
జింత నాఁ దింత్రిణి ♦ చింత యొనరు
మూల యనఁగఁ గోణ♦మునకు రిక్కకుఁ జెల్లు
మను వన బ్రతుకును ♦ మనువును నగుఁ
తే. గూట మన శిఖరమునకు ♦ గుంపున కగు
జాతి యన నన్వయమునకు ♦ జాతి కైనయుఁ
బురి యనఁగ నెమ్మితోఁకకుఁ ♦ బురికిఁ దనరు
సకలసురచక్రవర్తి శ్రీ♦సాంబమూర్తి. 95

| పదము. | సంస్కృతమైనపుడు. | తెనుఁగయినపుడు. |
|---|---|---|
| 1 గురువు | ఉపాధ్యాయుఁడు | బరువు |
| 2 నారి | స్త్రీ | అల్లెత్రాడు |
| 3 ఊరు | తొడ | గ్రామము |
| 4 తమి | రాత్రి | కోరిక |
| 5 కరి | ఏనుఁగు | కటికనలుపు |
| 6 చింత | విచారము | చింతచెట్టు |
| 7 మూల | నక్షత్రము | కోణము |
| 8 మనువు | ఒకరాజు | బ్రదుకు |
| 9 కూటము | కొండకొన | గుంపు |
| 10 జాతి | జాజిపువ్వు | కులము |
| 11 పురి | పట్టణము | నెమలిపింఛము. |

క. నిస్తులలక్షణకవి యగు
కస్తూరీరంగసుకవి ♦ ఘటియించినయీ
సిస్తగునాంధ్రనిఘంటు ప్ర
శస్తంబై వెలయుఁగాత ♦ జగతిని సాంబా. 96

తా. ఓ సాంబమూర్తీ! సాటిలేని లక్షణవేత్త యగు కస్తూరిరంగ సుకవి రచించిన యీమేలగునిఘంటువు పుడమిని ప్రసిద్ధమై వెలయును గాక.

క. ఈరుచిరాంధ్రనిఘంటు మ
హారూఢి వహించి మించి ♦ యారవిశశిభూ
తారకమై తారకమై
తారక మాఁ గాత సుకవి♦తతులకు సాంబా. 97

తా. ఓ సాంబమూర్తీ! ఈయుపయుక్తమయిన తెలుఁగునిఘంటువు మిక్కిలి వన్నెకెక్కి, యన్నినిఘంటువులను మీఱి, సూర్యచంద్రనక్షత్రము లున్నంతవఱకును సుకవిజనులకు పదార్థసందియములను దీర్చి కడతేర్చినదై శాశ్వతమయి యుండునుగాక.

నానార్థవర్గు సమాప్తము.

సాంబనిఘంటువు సమాప్తము

---

శ్రీరస్తు.

# సాంబనిఘంటువు

## అకారాదిశబ్దానుక్రమణిక.

## అకారాదిశబ్దానుక్రమ

---

# ఆంధ్రగ్రంథములు.

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| అచ్చ తెనుఁగు రామాయణము, శుద్ధప్రతి | ... | 1 | 4 |
| అడవిమల్లెలు | ... | 0 | 8 |
| అధ్యాత్మరామాయణము, పద్యము, క్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| అనంతునిఛందము, ఛందోదర్పణము | ... | 0 | 14 |
| అనిరుద్ధచరిత్రము | ... | 0 | 8 |
| అప్పకవీయము, విపులమైనవిమర్శతో చక్కఁగముద్రితము | ... | 2 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక | ... | 0 | 4 |
| ఆముక్తమాల్యద, సటీక | ... | 3 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 2 |
| ఆంధ్రభాగవతము, చక్కనిప్రతి | ... | 6 | 0 |
| డిటో అత్యుత్తమప్రతి 2 సంపుటములు | ... | 8 | 0 |
| ఆంధ్రభారతము, 7 సంపుటములప్రతి | ... | 15 | 12 |
| డిటో 3 సంపుటములప్రతి | ... | 15 | 0 |
| ఆది, సభాపర్వములు గలసంపుటము | ... | 2 | 4 |
| అరణ్యపర్వము ,, | ... | 2 | 4 |
| విరాటోద్యోగపర్వములు ,, | ... | 2 | 4 |
| భీష్మద్రోణపర్వములు ,, | ... | 2 | 4 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు ,, | ... | 2 | 4 |
| శాంతిపర్వము ,, | ... | 2 | 4 |
| అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | ... | 2 | 4 |
| ఆంధ్రభారతవిమర్శనము | ... | 0 | 8 |
| ఆదిపర్వము, పెద్దచ్చు, చిన్నసైజు | ... | 1 | 8 |
| ఆనందరంగరాట్ఛందము | ... | 1 | 8 |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | | ప్రతి 1-కి రూ. | అ. |
| ఆంధ్రశ్రీమద్రామాయణము, కావ్యతీర్థ జనమంచి, శేషాద్రిశర్మ కృతము, 3 సంపుటములు | ... | 12 | 0 |
| డిటో 7 సంపుటములు | ... | 14 | 0 |
| ఆంధ్రభాషాభూషణము | ... | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము | ... | 0 | 12 |
| ఆంధ్రనామసంగ్రహము, శేషము, సాంబనిఘంటువు | ... | 0 | 12 |
| డిటో కాలికోబైండు | ... | 1 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 0 | 8 |
| ఉత్తరరామాయణము, మేలుప్రతి, చక్కనికూర్పు, కాలికోబైండు | | 2 | 0 |
| ఉత్తరహరివంశము | ... | 1 | 8 |
| కవికర్ణరసాయనము | ... | 1 | 8 |
| కళాపూర్ణోదయము | ... | 2 | 4 |
| కాశీఖండము, క్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 4 |
| డిటో గట్టుప్రభువుకృతము | ... | 0 | 6 |
| కృష్ణరాయవిజయము | ... | 0 | 8 |
| గజేంద్రమోక్షము, సటీక, కాలికోబైండు | ... | 0 | 10 |
| గోపీనాథరామాయణము, 2 సంపుటములు | ... | 7 | 8 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము | ... | 1 | 4 |
| డిటో రెండవభాగము, మేలుప్రతి | ... | 1 | 10 |
| చెన్నబసవపురాణము | ... | 1 | 2 |
| జైమినిభారతము | ... | 1 | 0 |
| తారాశశాంకవిజయము, చక్కనికూర్పు | ... | 0 | 12 |
| తెనుగుసమస్యలు | ... | 0 | 2 |
| దశావతారచరిత్ర, నూతనముద్రితము | ... | 2 | 0 |
| దసరాపద్యములు | ... | 0 | 1 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| నరసభూపాలీయము, అట్టబైండు | ... | 0 | 10 |
| నలోపాఖ్యానము, సటీక | ... | 0 | 6 |
| నలచరిత్ర, ద్విపద | ... | 0 | 14 |
| నిర్వచనోత్తరరామాయణము | ... | 0 | 12 |
| నిరంకుశోపాఖ్యానము | ... | 0 | 6 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | ... | 0 | 4 |
| నీలాసుందరీపరిణయము | ... | 0 | 4 |
| నృసింహపురాణము | ... | 1 | 0 |
| పంచతంత్రము, నారాయణకవిది | ... | 0 | 12 |
| డిటో వేంకటనాథరాజకవికృతము | ... | 1 | 8 |
| దశకుమారచరిత్రము, పద్యకావ్యము, కేతనకవికృతము | ... | 1 | 4 |
| ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు | ... | 0 | 10 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు | ... | 0 | 8 |
| బ్రహ్మోత్తరఖండము | ... | 1 | 0 |
| బిల్హణీయము, చక్కనికూర్పు | ... | 0 | 8 |
| భాస్కరరామాయణము | ... | 4 | 0 |
| భోగినీదండకము | ... | 0 | 1 |
| భోజరాజీయము, అనంతామాత్యకృతము | ... | 1 | 2 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల. రామస్వామిశాస్త్రిగారివ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీఁద స్ఫుటమైన అక్షరములతో చక్కగముద్రితము | ... | 2 | 0 |
| మార్కండేయపురాణము, మారనకృతము | ... | 1 | 12 |
| మొల్ల రామాయణము, చిన్నసైజు | ... | 0 | 10 |
| రత్నపరీక్ష, సాంధ్రతాత్పర్యము | ... | 0 | 3 |
| రసికజనమనోభిరామము | ... | 0 | 12 |
| రంగనాథరామాయణము, ద్విపద | ... | 3 | 8 |
| రంగరాయచరిత్రము | ... | 0 | 8 |
| రాఘవపాండవీయము, సటీక | ... | 2 | 4 |
| రాజయోగసారము, ద్విపద | ... | 0 | 4 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| రాజశేఖరవిలాసము | ... | 0 | 8 |
| రామరాజీయము, చక్కనిప్రతి | ... | 0 | 12 |
| రామాభ్యుదయము | ... | 1 | 4 |
| రుక్మిణీకల్యాణము, సటీక, చక్కనిప్రతి | ... | 0 | 10 |
| రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి | ... | 0 | 8 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము | ... | 0 | 10 |
| రూపవతి, రాజపుత్రస్త్రీసాహసపుకథ, శ్రీ ఎనమండ్ర నారాయణమూర్తిది | | 0 | 8 |
| లంకావిజయము, (రావణదమ్మీయము), సటీక, పిండిప్రోలు లక్ష్మణకవికృతము | ... | 1 | 4 |
| వసుచరిత్ర, సటీక, అనేకనూతనాంశములుగల చక్కని క్రొత్తకూర్పు | | 4 | 0 |
| వసుచరిత్రవిమర్శనము, శ్రీ చినసీతారామస్వామి శాస్త్రికృతము, అత్యద్భుతములగు క్రొత్తవిషయము లనేకము లిందుగలవు. | | 1 | 0 |
| వసిష్ఠజనకసంవాదము | ... | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిప్రణీతము | ... | 1 | 4 |
| విజయవిలాసము, చేమకూర వేంకటకవికృతము | ... | 0 | 8 |
| విదురనీతి, సటీక, ఆంధ్రభారతములోనిది | ... | 0 | 5 |
| వీరభద్రవిజయము, బమ్మెర పోతరాజకృతము | ... | 0 | 12 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ వెంకమ్మది | ... | 1 | 0 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు | ... | 0 | 6 |
| డిటో బ్రౌనుదొరగారి ఇంగ్లీషుతో | ... | 1 | 4 |
| డిటో 2700 పద్యములు, కాలికోబైండు | ... | 1 | 12 |
| వేమనపద్యములు, 2700 పద్యములు, తాత్పర్యసహితము, ఇందు గ్రంథవిమర్శ, కవిజీవితము మొదలగునవి చేర్పఁబడినవి, చక్కని క్రొత్తకూర్పు | ... | 3 | 8 |
| వైశ్యపురాణము | ... | 1 | 4 |
| వైజయంతీవిలాసము | ... | 0 | 8 |
| శతకంఠరామాయణము, క్రొత్తకూర్పు | ... | 0 | 10 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము | ... | 0 | 12 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| శశిరేఖాపరిణయము, అప్పప్పకవికృతము | ... | 0 | 12 |
| శివలీలావిలాసము, కూచిమంచి తిమ్మకవిప్రణీతము | ... | 0 | 6 |
| శ్రీనాథునివీథినాటకము | ... | 0 | 2 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది, క్రొత్తకూర్పు | ... | 1 | 0 |
| శృంగారశాకుంతలము, పినవీరభద్రకవిది | ... | 0 | 12 |
| సహస్రకంఠరామాయణము | ... | 0 | 12 |
| సప్తమస్కంధము, సాధారణప్రతి, (భాగవతము) | ... | 0 | 6 |
| సారంగధరచరిత్రము, చేమకూర వేంకటకవికృతము | ... | 0 | 10 |
| సానందోపాఖ్యానము, శ్రీ శివరామకవివిరచితము | ... | 1 | 0 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక, అనేక నూతనాంశములు చేర్చి చిన్నసైజునముద్రించినారము. టీక, వివరణము మిక్కిలి విపులము. ఈవఱకు ప్రకటితమైన ప్రతులకన్న బాగుగనున్నది, సాధారణప్రతి | ... | 2 | 0 |
| డిటో మేలుకాకితములు, గిల్టుపేరు, కాలికోబైండు | ... | 3 | 8 |
| సులక్షణసారము, సటీక | ... | 0 | 10 |
| హరవిలాసము, శ్రీనాథకవి | ... | 0 | 12 |
| హరివంశము, క్రొత్తకూర్పు | ... | 3 | 0 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము | ... | 0 | 12 |
| హంసవింశతి, నారాయణామాత్యప్రణీతము | ... | 0 | 14 |
| భక్తిరసశతకసంపుటము మొదటి సంపుటము | ... | 2 | 0 |
| ,, రెండవ సంపుటము | ... | 2 | 0 |
| ఆంధ్రనాయకశతకము | ... | 0 | 4 |
| ఉద్దండరాయశతకము | ... | 0 | 2 |
| ఒంటిమిట్టరఘువీరశతకము | ... | 0 | 2 |
| కలువాయిశతకము, సటీక | ... | 0 | 4 |
| కవిచౌడప్పశతకము | ... | 0 | 2 |
| కాళహస్తిశతకము | ... | 0 | 2 |
| కాళహస్తీశ్వరశతకము, ధూర్జటికవిది | ... | 0 | 2 |
| శ్రీనాగపూడి కుప్పుస్వామయ్యగారిది | ... | 0 | 4 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| కామేశ్వరీశతకము | ... | 0 | 2 |
| కుమారీశతకము, సటీక | ... | 0 | 3 |
| కుక్కుటేశ్వరశతకము | ... | 0 | 3 |
| కృష్ణశతకము | ... | 0 | 2 |
| గోట్టుముక్కలరాజగోపాలశతకము | ... | 0 | 2 |
| చంద్రశేఖరశతకము | ... | 0 | 2 |
| చాణక్యశతకము | ... | 0 | 2 |
| చిత్తబోధశతకము, సటీక | ... | 0 | 3 |
| చెన్నమల్లుసీసములు | ... | 0 | 2 |
| జగన్నాయకశతకము | ... | 0 | 2 |
| జానకీపరశతకము | ... | 0 | 2 |
| జ్ఞానప్రసూనాంబికాశతకము | ... | 0 | 2 |
| దాశరథిశతకము, సటీక | ... | 0 | 4 |
| దేవకీనందనశతకము | ... | 0 | 2 |
| నారాయణశతకము | ... | 0 | 2 |
| నృసింహశతకము | ... | 0 | 3 |
| పార్థసారథిశతకము, పానకాలరాయవిరచితము | ... | 0 | 3 |
| ప్రసన్నరాఘవశతకము | ... | 0 | 3 |
| భక్తచింతామణిశతకము | ... | 0 | 2 |
| భద్రాద్రిరామశతకము | ... | 0 | 2 |
| భాస్కరశతకము, సటీక | ... | 0 | 4 |
| మహిజామనోహరశతకము | ... | 0 | 2 |
| మహిషాసురమర్దినిశతకము | ... | 0 | 2 |
| మాతృశతకము | ... | 0 | 1 |
| మాధవశతకము | ... | 0 | 2 |
| మానసబోధశతకము, సటీక | ... | 0 | 3 |
| మారుతిశతకము | ... | 0 | 2 |
| ముకుందశతకము | ... | 0 | 2 |
| రఘువీరశతకము | ... | 0 | 2 |
| రఘుతిలకశతకము | ... | 0 | 2 |

| | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|
| రమానాయకశతకము | ... | 0 | 2 |
| రంగేశశతకము | ... | 0 | 4 |
| రమాధీశ్వరశతకము | ... | 0 | 2 |
| రాజగోపాలశతకము | ... | 0 | 4 |
| రాజశేఖరశతకము | ... | 0 | 2 |
| రామశతకము, జయంతి కామేశంపంతులు | ... | 0 | 2 |
| రామలింగేశశతకము | ... | 0 | 3 |
| రామతారకశతకము | ... | 0 | 4 |
| రామప్రభుశతకము | ... | 0 | 2 |
| రామరాఘవశతకము | ... | 0 | 2 |
| రామరామశతకము | ... | 0 | 2 |
| రుక్మిణీపతిశతకము | ... | 0 | 2 |
| రేఫాల రాజలింగశతకము | ... | 0 | 4 |
| లావణ్యాశతకము | ... | 0 | 4 |
| వృషాధిపశతకము | ... | 0 | 2 |
| విశ్వనాథశతకము | ... | 0 | 4 |
| వేణుగోపాలశతకము | ... | 0 | 4 |
| శివముకుందశతకము | ... | 0 | 2 |
| శివశతకము | ... | 0 | 2 |
| శ్రీశైలమల్లేశ్వరశతకము | ... | 0 | 2 |
| శిఖినరసింహాశతకము, (శకునశాస్త్రము) | ... | 0 | 4 |
| సదానందయోగిశతకము | ... | 0 | 2 |
| సర్వేశ్వరశతకము | ... | 0 | 2 |
| సంపగిమన్నశతకము | ... | 0 | 2 |
| సింహాద్రినారసింహాశతకము | ... | 0 | 3 |
| సీతాపతిశతకము | ... | 0 | 2 |
| సుమతిశతకము, సటీక | ... | 0 | 3 |
| సూర్యనారాయణశతకము | ... | 0 | 2 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.